This book is published with the Financial Assistance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
under their scheme - aid to publish religious books



# రామ భక్తి సామ్రాజ్యము

రచయిత్రి :
శ్రీమతి చలువాది సరోజినిరత్నం
బెంగుళూరు

This book is published with the Financial Assistance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
under their scheme - aid to publish religious books



# రామ భక్తి సామ్రాజ్యము

రచయిత్రి :
శ్రీమతి చలువాది సరోజినిరత్నం
బెంగుళూరు

# రామ భక్తి సామ్రాజ్యము

# RAMA BHAKTHI SAMBRAJYAMU

రచన : శ్రీమతి చలువాది సరోజినీ రత్నం

Authoress : **Smt. CHALUVADI SAROJINI RATNAM**

ముఖచిత్రం : శ్రీమతి పసుమర్తి శోభారాణి

Cover Picture : **Smt. PASUMARTHI SHOBARANI**

ప్రచురణ : ఫిబ్రవరి, 1993

Publication : February 1993

ప్రతులు : 1000

For Copies :

**Smt. C SAROJINI RATNAM**

HIG No. 22, 2nd Cross, 3rd Main

BDA HIG Layout

Rajamahal Vilas II

BANGALORE - 560 094, INDIA

Price : **Rs. 25/-**

U.S. Dollars : 5

VASAVI PRINTERS

Tenali - 522 201. A.P. India



అంకితం:

మా ఇలవేల్పు శ్రీరాములవారికి

# నా ధ్యేయము

రామ భక్తి సామ్రాజ్యమే నా భాగ్యము. ఆ భాగ్యము సాధించుటే నా ధ్యేయము. ఈ భాగ్యము దొరకుటకు మూలాధారము శ్రీరాముని స్మరణ. శ్రీరామనామస్మరణ మనమున గట్టిగా నిలుపుటకు చాలా సాధన కావాలి. ఆ సాధన శ్రీరాముని భజించుటవలన అభ్యాసము అవుతుంది. శ్రీరాముని భజించిన భక్తి కుదురుతుంది. ఆ భక్తి మార్గమే ముక్తి మార్గము. శ్రీరామ భక్తి సామ్రాజ్యభాగ్యము లభించుటకు ఈ భజనలు, కీర్తనలు భక్తులకు ఆనందసాధనములు శ్రీరాముని, సీతమ్మను ఎన్నో విధాల స్మరించగలుగుతాము. మేలుకొలపవచ్చు, లాలించవచ్చు, వేడుకొనవచ్చు, విన్నపాలు చేయవచ్చు, ప్రార్థించవచ్చు, కోపగించవచ్చు, ఆత్మార్పణ చేయవచ్చు ఈ విధముగా మనసార సీతారాముల ప్రార్థించవచ్చు. ఇట్లు ప్రార్థించి ప్రార్థించి సీతారాముల మనమున వీడక నిలుపుకోవచ్చు. ఈ ఉద్దేశముతోనే ఈ భజనలు, కీర్తనలు వ్రాయబడినవి. ఈ భజనలు, కీర్తనలు చదివినవారికి ఈ అనుభవము తప్పక కలుగునని నా ఆశ. సీతారాములు అభయహస్తులై మనల దీవించుగాక.

శ్రీరాములవారు నామనస్సున నిల్చి "రామ భక్తి సామ్రాజ్యము" ను వ్రాయించినారు. కాని అందరకూ అందుబాటు కాగలగింది శ్రీ చలువాది వెంకటసుబ్బరత్నంగారి వలన. మధ్యరాత్రిలో నేను సంకీర్తనవ్రాసి వారిని చదువమనినా శ్రద్ధతోచదివి ఉత్సాహపరుస్తారు ఎల్లప్పుడూ ఉత్సాహపరచి అందముగా అచ్చువేయించి చదువరులకు. అందుబాటు చేసిన నా భర్త శ్రీ చలువాది వెంకటసుబ్బరత్నం గారికి అనేక నమస్కారములు. శ్రీరాములవారు వారి మనస్సున నిల్చి కాపాడుగాక.

శ్రీ తంగిరాల సుబ్బారావుగారు తెలుగు సాహిత్యాన్ని విరామము లేకుండా కృషిచేసే ఘనులు. అట్టివారు "రామభక్తి సామ్రాజ్యము"ను ఎంతో శ్రద్ధతో చదివి వారి అభిప్రాయమును చదువరులకు విపులంగా విశదీకరించారు. వారికి నా హృదయపూర్వక నమస్కారములు.

శ్రీరాములవారిని ఎన్నోవిధాల సేవించవచ్చు. ఆ రాములవారి ఘనతను చిత్రరూపంగా చిత్రీకరించుట ఒక భక్తి. నా కుమార్తె చి॥సౌ॥ శోభారాణి మనస్సున శ్రీరాములు నిలిచి చిత్రాలను అందముగా మీకు అందింప చేశారు. శ్రీరాములవారు అభయహస్తులై శోభారాణిని వారి కుటుంబాన్ని ఆశీర్వదించుగాక.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు నా పుస్తకము "రామ భక్తి సామ్రాజ్యము"ను అభినందించి ధన సహాయము చేసినందులకు వారికి నా కృతజ్ఞతలు.

నా మరిది కుమారుడు చి॥ మిట్టపల్లి సుబ్బారావు ఈ పుస్తకమును తయారుచేయుటలో సహాయము చేసినాడు. నా హృదయ పూర్వక ఆశీర్వాదములు. శ్రీ రా ము లు ఈతనిని ఎల్లప్పుడు దీవించుగాక.

చలువాది సరోజినిరత్నం

# 11

# మరోవారం అమృతపానం

శ్రీమతి చలువాది సరోజినిరత్నంగారు గొప్ప రామ భక్తురాలు జాగ్రదవస్థలోనే కాకుండా సుషుప్త్యవస్థలోకూడా ఆమె రామ భక్తితో తన్మయురాలయిపోతూ ఉంటారు. ఏదో చెప్పరాని కవితావేశం ఆమెను ఆవహిస్తూ ఉంటుంది. అటువంటి భక్తి తత్పరతతో కూడిన సమాధ్యవస్థలో వ్రాసిన వందలాది కీర్తనలలో ఇవి కొన్ని.

శ్రీమతి సరోజినిగారు 1985లో "శ్రీరామానంద మోక్ష మార్గం" అనే పేరుతో 108 పాటల్ని రచించారు. తిరిగి 1988లో "శ్రీరామ భజనామృతం" (మొదటి భాగం) అనే పేర 501 కీర్తనలు ప్రచురించారు. మళ్ళీ 1991లో 510 కీర్తనలతో "శ్రీరామ భజనామృతం" (రెండవ భాగాన్ని) ప్రచురించారు. (ఈ రెండవ భాగంలో నేను "భక్తిరస సరోజిని" అనే పేరుతో ఒక విపులమైన పీఠిక వ్రాశాను) ఇప్పుడు తిరిగి "రామ భక్తి సామ్రాజ్యమును" ప్రచురిస్తున్నారు. (1988 నాటికే వీరు 1200 కీర్తనలు వ్రాశారు) ఇందులో వారు వ్రాసిన కీర్తనలలో 1011 నుండి 1586 వరకూ ఉన్న కీర్తనలు చేర్చారు. అన్నమాచార్యునిలాగా ఈమె ప్రతిదినమూ భగవంతుని తన భక్తిగీతాలతోనే పూజ చేస్తారు. కాబట్టి ఈ కీర్తనల సంఖ్య దినదినమూ పెరుగుతూనే ఉంటుంది.

తెలుగుజాతి చరిత్రలో పలువురు భక్తులున్నారు. వారిలో శ్రీ వేంకటేశ్వర భక్తికి అన్నమాచార్యుడు, రామ భక్తికి కంచెర్ల గోపన్న (రామదాసు), త్యాగరాజు ప్రసిద్ధికెక్కినవారు. ఈ ప్రాచీన భక్తుల ప్రభావం శ్రీమతి సరోజినిగారి మీద గాఢంగా ఉంది. "బ్రహ్మ కడిగిన పాదము"ను అన్నమయ్య కీర్తించగా, శ్రీరాముని

పాద మహిమను సరోజినిగారు అనేక కీర్తనలలో స్తుతించారు. అన్నమయ్యలాగే జానపద గేయాల బాణీలను ఉపయోగించి శ్రీరామునిమీద లాలి పాటలు, జోల పాటలు, పవళింపు పాటలు, మంగళహారతులు, విన్నపాలు, మేలుకొలుపులు పుష్కలంగా రచించారు సరోజినిగారు.

రామదాసు కీర్తనల ప్రభావంకూడా సరోజినిగారిమీద ఎక్కువగా కనబడుతుంది. సీతారామ లక్ష్మణులకు రామదాసు చేసిన నగల ప్రసక్తి, భగవంతుడు కష్ట సమయంలో తన్ను రక్షించడం లేదనే నిస్పృహ, దాశరథీ శతక పద్యాల భావాలు ఈ శ్రీరామ భజనామృతంలో అక్కడక్కడ మనకు సాక్షాత్కరిస్తాయి. "శ్రీరామ నీ నామ మెంత రుచిరా" అనే కీర్తన ఛాయలుకూడా కొన్ని కీర్తనలలో ఉన్నాయి.

సరోజినిగారికి రాముడు వివిధ దశలలో దర్శనమిస్తాడు. శిశువుగా, బాలుడుగా, యువకుడుగా, రాజుగా కనబడతాడు. రాముడు తన మొర వినటంలేదనే అనుమానంవస్తే సీత ద్వారానూ, హనుమంతునిద్వారానూ చెప్పించడానికి రామదాసులాగే ఈ భక్తురాలు కూడా ప్రయత్నిస్తారు. "నిధి చాల సుఖమా? నీ సన్నిధి చాలా సుఖమా?" వంటి త్యాగరాజ కీర్తనల ప్రభావంకూడా సరోజినిగారిమీద ఉంది. (సంపద మంచిదా? శ్రీరామస్వామి పూజ మంచిదా?" వంటివి).

ఈ కీర్తనలన్నీ భావాత్మకాలే. భక్తిభావమే అన్నిటా వ్యాప్తి చెంది ఉంటుంది. కథాత్మకమైన కీర్తనలు ఈమె రచనలో లేకపోయినా, రామాయణ కథను మనస్సులో పెట్టుకొని వివిధ సన్ని

వేశాలకు సంబంధించిన కీర్తనలు రచించారు. (శ్రీరాముని అరణ్యవాసాన్ని స్మరించే కీర్తనలుకూడా ఉన్నాయి.)

'భక్తి' అంటే ఆత్మ చైతన్యం. భక్తుడు ఈ చైతన్యంతో తన్నుతాను సంబోధించుకుంటాడు. తన చుట్టూఉన్న ప్రజల్ని మేలు కొలుపుతాడు. తన్నుతాను సంబోధించుకున్నప్పుడు 'మనసా' అనే సంబోధనతోనూ, ప్రజల్ని మేలుకొలిపేటప్పుడు 'మనుజులార!' అనే సంబోధనతోనూ కీర్తనలు ఉంటాయి. సరోజినిగారి కీర్తనలలో ఇటువంటివికూడా ఉన్నాయి.

"సరోజం" అంటే "పద్మం" అని అర్థం. "సరోజిని" అంటే "సరోజాలు (పద్మాలు) ఉన్న సరస్సు" అని అర్థం. కాబట్టి "చలువాది సరోజిని" అంటే "చల్లని పద్మ సరోవరం". ఈ సరోవరంలో ఉన్నవి నీళ్ళు కావు, రామ భక్తి సుధారసం. ఈ చల్లని రామ భక్తి సుధారస సరస్సులో వికసించి, పరిమళాలు వెదజల్లే బంగారు పద్మాలే ఈ కీర్తనలు! పరమ భక్తితో, వేయి శత పత్రాలతో శ్రీరామచంద్రుని పూజించి, ఆతనిని "సరోజాక్షుడు"గా తన కవితా మకుటంలో పదిలపరచుకొన్న "అపర శబరి" శ్రీమతి చలువాది సరోజినిగారు. వీరికీ, వీరి పుణ్యపురుషుడైన డా॥ సి.వి.ఎస్. రత్నంగారికీ, ఇతర కుటుంబ సభ్యులకూ "పవమాన సుతుడు పట్టు పాదారవిందములు" ఆయురారోగ్య సంవత్సరం పరాభివృద్ధిని ప్రసాదించుగాక!

బెంగుళూరు
14-5-1992

తంగిరాల వెంకటసుబ్బారావు

# రామ భక్తి సామ్రాజ్యము

గుహరాజు కడిగిన నీ పుణ్య పాదాలు
నా కెప్పుడు దొరకును శ్రీరామ
ఎట్లా దొరకును రఘురామ
ఎక్కడ దొరకును జయరామ
జయరామ జయరామ ॥గు॥

పవన కుమారుడు పట్టిన పావన పాదాలు ॥నా॥
సీతమ్మ పిసికిన చల్లని నీ పాదాలు ॥నా॥
భక్తులు పూజించు నీ పవిత్ర పాదాలు ॥నా॥
కనికరించు శ్రీరామ
సరోజ పుష్పాలు నీ పాదాల ఉంచాలి ॥నా॥

## 2

ఆనందం ఆనందం శ్రీరాముని సేవించ ఆనందం ॥ఆ॥

రంగు రంగుల కనకాంబర గుచ్ఛాలు కట్టి
శ్రీరాముని పీఠము అలంకరిస్తే ॥ఆ॥

దవనము, మరువము దండిగ చల్లి
శ్రీరాముని నడకతో దారి ఘుమ ఘుమ లాడిన ॥ఆ॥

మల్లె, జాజి మాలలు కట్టి
శ్రీరాముని ఉరమున సొగసున అలంకరిస్తే ॥ఆ॥

సరోజదళాలు శ్రీరాముని పాదాల ఉంచ
కనుల పండుగ కలిగిస్తే ॥ఆ॥

## 3

రాముడు మా రాముడు
మము పాలించేటి మైథిలి నాధుడు ॥రా॥

సీతమ్మ మా సీతమ్మ
మము చల్లగ చూచేటి శ్రీరాముపత్ని ॥రా॥

సీతారాములు చిద్విలాసులు
మేము పూజించే ఆరాధ్య దైవాలు ॥రా॥

సీతారాముల పదముల నెప్పుడు
సరోజాలర్పించి కళ్ళద్దు కొనేము ॥రా॥

## 4

నమస్కారమయ్యా శ్రీరామ నీకు
నమస్కారము మా నమస్కారము ॥న॥

కౌసల్య తనయా కారుణ్య వాలా
కోదండపాణీ కోరికోరి కోటి పూల పూజింతు ॥న॥

దశరథనందన దయామయ దుష్టశిక్షక
దండి దండిగా దండాల పూజింతు ॥న॥

పావనరామా పుణ్యపురుష పట్టాభిరామ
భక్తితో గుప్పెడు పూల పూజింతు ॥న॥

సత్యపాలన సుందరాంగ సర్వేశ్వర
సదా సదా సరోజ పుష్పాల పూజింతు ॥న॥

# 5

కరుణ ఎన్నడు కల్గునో శ్రీరామ నాపై నీకు
కనలేని నిన్ను కరముల జోడించి
అడిగి అడిగి నే అలసిపోతినయ్యా ॥క॥

కరుణామూర్తివని నిన్ను నమ్మితిని
కనికరించి నన్ను కాపాడ రావయ్య ॥క॥

కలవరము తీర్చు కరుణాపయోనిధి
సరోజాలర్పించెద సర్వము నీవేనయ్యా ॥క॥

# 6

భజనలు చేయవె మనసా!
రాముని భజనలు చేయవే మనసా!
మన రాముని భజనలు చేయవే మనసా!
శ్రీరాముని భజనలు చేయవే మనసా! ॥భ॥

కీర్తన పాడవే మనసా!
సంకీర్తన పాడవే మనసా!
మన రాముని కీర్తన పాడవే మనసా!
శ్రీరాముని గుణముల పాడవె మనసా! ॥కీ॥

గజ్జలు కట్టవే మనసా!
తాళముతో నర్తన చేయవే మనసా!
మన రాముని పదములె నర్తనచేసి
సరోజాక్షుని పదముల పట్టవె మనసా! ॥గ॥

# 7

రామయ్య రామయ్య నీవెంతటి వాడవయ్యా
ఎంత పిలిచినాను పలుకనంటావేమి ॥రా॥

ఎన్ని నోములు నోచినాకాని
ఎంత నిన్ను తలచినకాని పలుకనంటావేమి ॥రా॥

ఉడుత ఇసుక రాల్చినందుకే
నీకు దయ కలిగెను కదా
ఎంగిలి పండు ఇవ్వగనే కైవల్య మిచ్చితివే ॥రా॥

నా పిలుపు వినలేవా
నా సరోజ పూజలు చేకొనవా
పలుకవేమి పట్టాభిరామ ॥రా॥

# 8

మరియాద కాదయ్యా శ్రీరామచంద్రా
నీకు మరియాద కాదయ్య ॥మ॥

ఎంత పిలిచినాను కానరావు మరి
ఉలకవు పలుకవు ॥మ॥

నీలమేఘశ్యామ నీరజాక్షా నిన్నే నమ్మినాము
నీ పాదాల పడినాము ॥మ॥

మా మనవి వినవయ్యా మమ్ము ఆదరించు
సరోజ పుష్పాల పల్లకి కట్టేము ॥మ॥

## 9

సీతమ్మ ఓయమ్మ సీతమ్మ మా భాగ్యరాశి
సీతమ్మ మా పుణ్యరాశివమ్మ సీతమ్మ. ॥సీ॥

పంచవటిలోని పక్షులు నీతోటి ఆటలాడేను
సీతమ్మ నిన్ను ఎంతో ఆనందపరిచేను సీతమ్మ ॥సీ॥

కుహు కుహూ అని కోకిలమ్మలు నీతో కలసి పాడేను కదా
సీతమ్మ నిన్ను ఆనందపరిచేను సీతమ్మ ॥సీ॥

నెమళులన్నీ నీతో పురివిప్పి ఆడేను
సీతమ్మ నిన్ను ఆనందపరిచేను సీతమ్మ ॥సీ॥

ప్రకృతి అంతా నీకు సరోజ పుష్పాల పూజలు చేసె కదా!
సీతమ్మ నిన్ను ఆనందపరిచేను సీతమ్మ ॥సీ॥

## 10

నలుగుకు రారా నా రామచంద్రయ్య
నీకు అభ్యంగ స్నానము చేయాలి ॥న॥

కళ్యాణ రాముడవై కళ కళ లాడాలి
సీతమ్మ నిన్ను చూచి మైమరచిపోవాలి ॥న॥

పారాణి పెట్టాలి నీ బుగ్గన చుక్క పెట్టాలి
బాషికాలు కట్టాలి నీ అందము చూడాలి ॥న॥

సరోజ మాలను చేకొన్నది సీతమ్మ నీవు
జానకిని చేపట్టి జగన్నాథుడవు కావాలి ॥న॥

## 11

నీ పవిత్ర పాదముల పూజించ సరోజ పుష్పాల తెచ్చాను
రామయ్య నా పూజలందుకో రామయ్యా ॥నీ॥

అహల్య సీతమ్మలు పట్టిన నీ పవిత్ర పాదాలు
నా కెప్పుడు దొరకును రామయ్యా ॥అ॥

భక్తులంతా పూజించిన నీ పాదాలనే
నే నెన్నుకున్నాను నాకెప్పుడు దొరకును రామయ్యా ॥భ॥

నా మనవి వినవయ్యా రామయ్యా
నా పంట పండించు రామయ్యా ॥నీ॥

## 12

రామా అంటే పలుకనంటావే
అమ్మ సీతమ్మ అంటే పలుకనంటావే ॥రా॥

నేనేమి చేసేది నేనెవరితో చెప్పేది ॥రా॥

పళ్ళెము తెచ్చి మీ కాళ్ళ వద్ద ఉంచి
కడిగి కళ్ళకద్దుకొన కాచి ఉన్నాను ॥రా॥

పూలు తెచ్చి మాలలు కట్టి మీ
మెడలోవేసి అలంకరించ కాచి ఉన్నాను
సరోజాక్షా సుందరాంగ నేనెవరితో చెప్పేది ॥రా॥

# 13

రామ రామ శ్రీరామ రామ రామ జగదభిరామ
యజ్ఞము కాపాడ తాటకిని చంపిన
శ్రీరామ మా బాల రామ ॥రా॥

అహల్యకు శాప విముక్తి చేసిన
శ్రీరామ అయోధ్య రామ ॥రా॥

జానకిని చేపట్టి మహారాజువైన
శ్రీరామ మా జగదభిరామ ॥రా॥

చరణాలు పట్టిన భక్తులకు శరణొసగిన
శ్రీరామ దీనబంధు రామ ॥రా॥

దుష్ట శిక్షణ చేసిన శ్రీరామ సరోజరామ ॥రా॥

# 14

రక్షించువాడే రక్షకుడు
ఆ రక్షకుడు మా రఘువీరుడు ॥ర॥

కనికరించువాడే కరుణాకరుడు
ఆ కరుణాకరుడే మా కౌసల్యా తనయుడు ॥క॥

దయకలవాడే దయామయుడు
ఆ దయామయుడే దశరథ నందనుడు ॥ద॥

పాలించువాడే పాలకుడు
ఆ పాలకుడే మా పట్టాభి రాముడు ॥పా॥

సాష్టాంగాలు చేయరే సర్వపాలకునకు
సరోజాక్షునకు సర్వేశ్వరునకు ॥సా॥

## 15

రామ రామ శ్రీరామ
నన్ను పాలించు శ్రీరామ నా సరోజాక్షా ॥రా॥

నీ పాదములనే ఎన్నాను
రామ గుహరాజు కడుగ పాలించావని ॥రా॥

తీయని పండ్లనే ఎన్నాను
నీకిివ్వ శబరమ్మకు కైవల్యమొసగావని ॥రా॥

నీ చరణాలు పట్టి ఆశపడినాను
విభీషణునకు పట్టమిచ్చావని ॥రా॥

భక్తితో నిన్ను కొలవాలని
తలచాను భక్తుల ప్రేమతో పాలించావని ॥రా॥

## 16

దారి తెలియకున్నదే రామ
నిను చేర సరిఅయిన దారి తెలియకున్నదే ॥దా॥

భక్తితో పూజించిన చాలంటారు
నిను కొనియాడిన చాలంటారు ॥దా॥

నిన్ను భజించిన చాలంటారు
నీ పాదాలు పట్టిన చాలంటారు
దయామయుడ వంటారు
భక్తుల దరిచేర్చుకుంటా వంటారు ॥నీ॥

నీ దరి చేరుదారి తెలియకున్నది
సరోజాక్షా దయచూపు స్వామి ॥దా॥

# 17

రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ ॥రా॥

పాదాలు కడిగేను రామ
నీకు పూలతో పూజలు చేసేను ॥రా॥

పాదాలు కండ్ల కద్దేను రామ
నీ పాదములే పట్టేను ॥రా॥

పాల పాయసము ఇచ్చేను రామ
నీకు పూల మాలలు వేసేను ॥రా॥

మంచి పాటలు పాడేను రామ
నీ పాటలే భజనలు చేసేను ॥రా॥

భక్తిని నిలుపుము రామా
నా మదిలో నీవే నిలుపుము సరోజాక్షా ॥రా॥

# 18

రామ రామ శ్రీరామ ఆనందరామ శ్రీరామ ॥రా॥

ఆశలు పుట్టించకు శ్రీరామ
నిన్ను చేరాలనే ఆశ తీర్చుము శ్రీరామ ॥రా॥

కోర కోర నా కోర్కెను వ్యర్థము చేయకు శ్రీరామ
నిన్ను చేరాలనే ఆశ తీర్చుము శ్రీరామ ॥రా॥

నిన్ను చేరాలనే ఆశే ఆనందము
ఆ ఆనందమే నీవు శ్రీరామ ॥రా॥

సంకటము పట్టించకు శ్రీరామ
నన్ను నీ దరి చేర్చుకో సరోజాక్షా ॥రా॥

## 19

గణ గణ గంటలు గుడిలో మ్రోగగా
నా కాలి గజ్జలు గలగల మనగా
నాట్యము చేసితిని సీతారాముల పాటలు పాడుచు
నాట్యము చేసితిని ॥గ॥

చేతిలో నా చిటికలు తాళము వేయగ
భజనలు చేసితిని
సీతారాముల పాటలు పాడుచు
భజనలు చేసితిని పారవశ్యముతో
భజనలు చేసితిని ॥గ॥

సరోజ మాలలు సీతారాముల మెడలో
మెరయగ తన్మయత్వ మొందితిని
నా సీతారాముల మనమున తలచుచు
తన్మయ మొందితి సర్వమర్పించితిని ॥గ॥

## 20

సీతారాముల రత్నాలరథమును లాగను రారండి ॥సీ॥
పుష్పాల రథమును లాగను రారండి ॥సీ॥
సరోజ పుష్పాల బాటపైన సొగసుగా రథము సాగను ॥సీ॥
బంగరు పీఠముపై సీతారాములు అభయహస్తులై ఉన్నారు ॥సీ॥
కదళీ ఫల నారికేళముల నైవేద్యమివ్వను రారండి ॥సీ॥
సీతారాముల దీవెన పొందను రారండి ॥సీ॥

## 21

కిటకిట లాడిరి జనమంతా
కిలకిల లాడెను జగమంతా ॥కి॥

శ్రీరాముని విజయమును వినిరి జనమంతా
దివ్య తేజము చూసిరి జనమంతా ॥కి॥

అద్భుతపడిరి జనమంతా
ధర్మస్థాపనకు ఆనందపడిరి జనమంతా ॥కి॥

పట్టాభిరాముని పదముల పట్టిరి జనమంతా
సరోజ పుష్పాల చల్లిరి జనమంతా ॥కి॥

## 22

మధురం మధురం నా రాముడు మధురం
నా రామ నామము ఇంకా మధురం ॥మ॥

రాముని తలచుట మధురం
రామా నీ నామము భజించుట ఇంకా మధురం ॥మ॥

రామ రామ అన మధురం
సీతారామ అన ఇంకా మధురం ॥మ॥

సరోజాక్షా అన మధురం
రామా స్వరము నీవే అన ఇంకా మధురం ॥మ॥

## 23

జాగు చేయకు తల్లి మమ్ము బ్రోచుటకు
జానకిదేవి మా జగదోద్ధారిణి ॥జా॥

శ్రీరాముని చేపట్టిన జగన్మాత
చందన తాంబూలాలివిగో స్వీకరించు తల్లి ॥జా॥

నిన్ను పూజించేము పసుపు కుంకుమలతో
మమ్ము కాపాడు మా చల్లని తల్లి ॥జా॥

సర్వమర్పించేము సాష్టాంగాలు చేసేము
సరోజపుష్పాల సదా నిన్ను పూజించేము ॥జా॥

# 24

శ్రీరామ నిన్నేమని పొగడను
నిన్నెట్లారాధించను శ్రీరామ ॥శ్రీ॥

సుగుణాల ఖని అని అననా
భక్తపాలుడ వననా
ధర్మపాలుడవని పొగడనా
సత్యపాలుడవననా ॥శ్రీ॥

నీ పాదాలు పట్టి పాలించమని అననా
నీకు రుచిగల ఫలాలిచ్చి కైవల్య
మడుగనా శ్రీరామా ॥శ్రీ॥

సరోజాలర్పించెద నా కలత తీర్చు రామా ॥శ్రీ॥

# 25

కళకళలాడే కమలదళాక్షి
కానవా మమ్ము కనికరించవా ॥క॥

భోగభాగ్యముల మేము అడుగలేదు
మము బ్రోచిన బాలమ్మ భూపుత్రి నీవు ॥క॥

వనితలందరమూకూడి పూజింతుము
నీ పాదాలు మా ప్రార్థనలందుకో వైదేహి తల్లి ॥క॥
సర్వమర్పించేము సదా నిన్ను కొలిచేము
సౌభాగ్యమొసగుమా సరోజాక్షి తల్లి ॥క॥

## 26

కథ వినరండి సీతాన్వేషణ చేసిన
శ్రీరామ భక్త హనుమాన కథ వినరండి ॥క॥

ఆకాశమునకు లంఘించెను సీతను చూచెను
లంకను కాల్చి సీతకు చూడామణి నిచ్చిన ॥క॥

వారధి కట్టెను వారధి దాటెను
వానరులందర చేర్చి రాక్షసుల వధించిన ॥క॥

సంజీవి తెచ్చెను లక్ష్మణుని కాపాడి
శ్రీరామచంద్రుని మన్నన పొందిన ॥క॥

శ్రీరామ జయ శ్రీరామ సరోజాక్షా శ్రీరామ
అని భజనలు చేసిన భక్త హనుమానుని ॥క॥

## 27

రెండక్షరముల రామ నామము
పలుక పలుక పరవశము కల్గును
వినగ వినగ ఆనందము కల్గునుగా ॥రెం॥

రామనామ మహిమ తెలియండి
జపించి జపించి జన్మ తరింప చేయండి ॥రెం॥

సీతారామ సీతారామ అనరండి
అనరండి అనగ అనగ ఆనందము కల్గి
సరోజాక్షుని కనరండి ॥రెం॥

## 28

రామ రామ శ్రీరామ
రామ రామ రామచంద్ర ॥రా॥

రామ రామ రాఘుకుల తిలక
రామ రామ రామచంద్ర ॥రా॥

రామ రామ సూర్యపుత్ర
రామ రామ సీతాపతి ॥రా॥

రామ రామ కల్యాణ రామ
రామ రామ కారుణ్య రామ ॥రా॥

రామ రామ ధర్మపాల
రామ రామ సత్యపాల
రామ రామ భక్తపాల
రామ రామ పావనమూర్తి ॥రా॥

రామ రామ నిర్మలాకార
రామ రామ సరోజాక్ష ॥రా॥

## 29

గుహరాజును బ్రోచావు
శబరమ్మను బ్రోచావు
నన్నట్లు బ్రోచిన బాలునే రామ ॥గు॥

తాపసుల బ్రోచావు భక్తుల పాలించావు
నీ పాదాలు పట్టాను దయామయ రామ ॥గు॥

నిన్ను వేడ నాశక్తి చాలలేదు రామ
నన్ను కరుణించి దారిచూపు రామ ॥గు॥

నీవే నాకన్నీ అని నిన్నే నమ్మాను రామ
సరోజాక్షా నన్నెప్పుడు విడువకుమయ్యా ॥గు॥

# 30

సరోజాక్షి సుందరాంగి సీతమ్మ తల్లి
మము బాగుగా బ్రోచేటి మా భాగ్యరాశి ॥స॥

కమలదళాక్షి కనకాంగి కౌసల్య కోడలా
మాపై కరుణచూపు మా కల్పవల్లి ॥స॥

పద్మ దళాక్షి పరమపావని పట్టపురాణి
నీ పాదాలు పట్టేము విడువక పూజించేము ॥ప॥

జగన్మోహిణి జగదోద్ధారిణి జానకిదేవి
జాగు చేయకు తల్లి మాపై జాగుచేయకుమా ॥స॥

# 31

రామ రామ శ్రీరామ నిన్నేమని తలవను శ్రీరామ ॥రా॥

మనమున శ్రీరాముని తలవగనే
పొగడ రాగము పొంగును ॥రా॥

మనమున శ్రీరాముని కొలవగనే
సుంగధ సుమమాలె కనపడుగా ॥రా॥

మనమున రాముని ధ్యానించగనే
దివ్యనర్తనము సాగునుగా ॥రా॥

శ్రీరాముని తలచి ధ్యానించి కొలవను
సరోజపుష్పాలే కావలెగా ॥రా॥

## 32

రామ రామ శ్రీరామ
రామ రామ సీతారామ ॥రా॥

పకపక నవ్విరి సీతారాములు
పక్షులన్ని కిలకిల లాడగ ॥రా॥

గానము చేసిరి సీతారాములు
కోకిలమ్మలు కుహూ కుహూ అన ॥రా॥

నాట్యమాడిరి సీతారాములు నెమళులు
అన్ని పురివిప్పి ఆడగ ॥రా॥

పంచవటిలోని సీతారాములు ఆనందపడిరి
హాస్యగాన నాట్యాలతో ॥రా॥

సరోజాక్షుల ఆనందమేగా
మహాప్రజలకు మంగళకరమౌను ॥రా॥

## 33

నన్ను వీడడు నన్ను వీడడు
భక్తపాలుడు రామచంద్రుడు ॥న॥

శబరితల్లిని విడిచెనా చిన్న ఉడుతను విడిచెనా
భక్తపాలుడు శ్రీరాముడు ॥న॥

గుహరాజును కౌగిలించెను
హనుమంతుని కౌగిలించెను
భక్త పాలుడు రాముడు ॥న॥
నేను నమ్మిన రాముడు
నా పాలి దైవము రాముడు
నేనెల్లవేళల పూజ చేసెడి
సరోజాక్షుడు రాముడు ॥న॥

## 34

రామ రామ శ్రీరామ నీవు
దయగలవాడవు శ్రీరామ ॥రా॥

కైకేయి కోరిక తీర్చావు శ్రీరామ
భరతునికి పాదుకలిచ్చావు శ్రీరామ ॥రా॥

నీవెంత దయగలవాడవు శ్రీరామ
నాపై దయచూపు మా శ్రీరామ ॥రా॥

సుగ్రీవుని కలత తీర్చావు శ్రీరామ
అంగదుని యువరాజు చేశావు శ్రీరామ ॥రా॥

నేనెంత నీ దయకు శ్రీరామ
నిన్నే నమ్మానుకదా శ్రీరామ ॥రా॥

## 35

నీ పాదాలే పట్టేను నీ పాదాలే కడిగేను
నీ పాదాలే పూజించేను పాలించవా శ్రీరామ ॥నీ॥

నిన్నే తలచేను నిన్నే ధ్యానించేను
నిన్నే స్మరించేను నన్నాదుకోవా శ్రీరామ ॥నీ॥

నిన్నే నమ్మాను నీవే నా దైవమన్నాను
నిన్నేమి విడువనయ్యా నన్నాదరించవా శ్రీరామ ॥నీ॥
నీ చరణాలు పట్టేను శరణని అడిగేను
సర్వము నీవనేను సంరక్షించవా సరోజాక్షా ॥నీ॥

# 36

కనికరించమని కరములు జోడించ
కరుణ చూపవేమి కౌసల్యాతనయా ॥క॥
దీన దయాళుడవే నీవు దివ్యతేజ
దయ చూపుము మాపైన దశరథనందన ॥క॥
పురుషోత్తమా పుణ్యపురుషా
పావనమూర్తీ పట్టాభిరామా ॥క॥
సర్వము నీకే తెలుసు కదా సుందరాకారా
సంరక్షించవా సరోజాక్షా ॥క॥

# 37

నీ కనుల తేజస్సు నీ రూపు వర్చస్సు
మా కనుల చూడనివ్వవా శ్రీరామ
నిన్ను వినయంతోవేడేము శ్రీరామ ॥నీ॥
నిన్ను వేడేము నీ దయ కోరేము
కౌసల్య తనయా కరుణామయా ॥నీ॥
నీవెంత నీ కోరిక ఎంత అని
చులుకన చేయకు తండ్రీ
నీ పాదాలు పట్టి వేడేము స్వామి ॥నీ॥
నిన్ను వీడక ఇంక ఎవరిని వేడేము
నీవు శాంతమూర్తివే సరోజాక్షుడవే ॥నీ॥

# 38

ఒక్కసారి నీ కనులు తెరచిన బాలయ్యా
శ్రీరామ మా పాపాలు హరించును ॥ఒక॥

ఒక మాట ఒక బాణము ఒక దారావృతుడని
పేరొందిన శ్రీరామా ॥ఒక॥

నీ పాదాలపై వ్రాలేము
నీ పాదాలే పూజించేము
నీ పాదాలు పట్టి విడువము ॥ఒక॥

చంద్రవదన శ్రీరామ సుందరాకారా శ్రీరామా
ఒక్కసారి నీ కనులు తెరువుము సరోజాక్షా ॥ఒక॥

రామ రామ శ్రీరామ
రామ రామ సీతారామ ॥రా॥

ప్రభువుకు ఇవ్వరే పంచభక్ష్య పరమన్నాలు
అమ్మకు ఇవ్వరే ఆణిముత్యాల మాల ॥రా॥

శ్రీరాముని కివ్వరే శ్రీగంధపు పీఠము
సీతమ్మ కివ్వరే సరోజాల పీఠము ॥రా॥

కమలాక్షుని కివ్వరే కనకపు సింహాసనము
జానకమ్మ కివ్వరే జాజిపూల పల్లకి ॥రా॥

అయోధ్యాపతి కివ్వరే అగరుధూప
నైవేద్యాలు అయోధ్యారాణి కివ్వరే
ఆనంద హారతి ॥రా॥

## 39

నీ చరణాలు మనమున నిలువగనే
మనసెంతో ఉప్పొంగి పోవునుగా
ఉప్పొంగి పోవునుగా శ్రీరామ ॥నీ॥

నీ పాదాలు పట్టిన అహల్యను తలవగాను
నీ శరణు కోరిన విభీషణుని తలవగాను
నీ చరణాలే మనమున నిలుచునుగా ॥నీ॥

నా కెప్పుడు కలుగునో ఈ అదృష్టము
దశరథ తనయ ఈ దీనురాలిని దయ చూడుమయ్యా ॥నీ॥

నీకు సాష్టాంగాలే నా పెన్నిధి సరోజాక్షా
నిన్ను నమ్మిన నన్ను మరువకు రామా ॥నీ॥

## 40

రామ దయ చూడరా
నిన్ను నమ్మిన మాపై దయ చూడరా
శ్రీరామ దయ చూడరా
దశరథపుత్ర మాపై దయ చూడరా
కౌసల్య తనయ దయ చూడరా ॥రా॥

దయచూడమని నిన్ను ఎంతని వేడేము
రామా ఎంతవేడిన కాని పలుక
కున్నావేమి మా రామ ॥రా॥

సూర్యవంశపుత్రా మాపై దయచూడవా
సరోజపుష్పాల పూజిత దయచూడవా ॥రా॥

# 41

దండాలయ్యా రామ దండాలయ్యా శ్రీరామ దండలయ్యా
రఘురామ దండాలయ్యా మా రామ దండాలయ్యా ॥దం॥

దండాలు పెట్టేము నీకు దండాలు పెట్టేము
దరిచేర్చుకోకున్న ఇంకా పెట్టేము ॥దం॥

దండాలయ్యా సీతాపతి
దండాలయ్యా జానకి రామ
దండాలయ్యా వైదేహి ప్రియ ॥దం॥

దండాలయ్యా మా రామ దండాలయ్యా ॥దం॥

దండాలు విడువము నీకు పెట్టే దండాలు విడువము
దరిచేర్చుకోకున్న వైదేహితో చెప్పేము ॥దం॥

దండాలయ్యా రామ దండాలయ్యా శ్రీరామ
దండాలయ్యా సూర్యరామ దండాలయ్యా
మా సరోజాక్షా దండాలయ్యా ॥దం॥

# 42

చందమామను చూచేము పున్నమినాడు
నిండుగా మా రాముని చూచేము ఎల్లపుడు నిండుగా ॥చం॥

నిండు మాట నిండు మనసు నిండు రూపము నా రాముడు ॥చం॥

నా రాముడే భక్తపాలుడు సత్యపాలుడు సన్మార్గపాలకుడు ॥చం॥

చందమామ చల్లనిది నా రాముడు చల్లనివాడు
అందరిని చల్లగా చూచే సరోజాక్షుడు శ్రీరాముడు ॥చం॥

## 43

రామ రామ జయ రామ రామ శ్రీరామ॥
కౌసల్యతల్లి ॥ఏమి భాగ్యమమ్మా నీది॥
కొడుకుకు గోరుముద్దలు పెట్టి
మొలను గజ్జలు కట్టి మురిసిపోవ ॥ఏ॥రా॥

వైదేహి ఏమి భాగ్యమమ్మా నీది
వామహస్తము పట్టి
అర్ధాంగిగా శ్రీరాముని ఆనందపరచ ॥ఏ॥

హనుమా ఏమి భాగ్యము నీది
హృదయములో దాచుకొని
పాదాలు విడువక సరోజాల పూజించ ॥ఏ॥రా॥

## 44

నా అమ్మ సీతమ్మ నా అయ్య శ్రీరాములు
నా పిలుపుకు పలికే నావారు సీతారాములు ॥నా॥

సీతారాములు సీతారాములు మామంచివారు
నా సీతారాములు ॥నా॥

నా వారు నా వారు నే నమ్మినవారు
నే చేసేను కోటి నమస్కారములు ॥నా॥

సీతమ్మ వినకున్న రామయ్యతో చెప్పేను
రామయ్య వినకున్న సీతమ్మను అడిగేను ॥నా॥

నా వారు నా వారు నే నమ్మినవారు
నే చేతును కోటి సరోజాల పూజ ॥నా॥

## 45

లాలి ఊగేను శ్రీరామచంద్రుడు
పడతలందరు లాలి పాటలు పాడ లాలిలాలి ॥లా॥

జో జో జో జో జో జో జగమేలు రామ
నిద్రలో నీ కిలకిల నవ్వులు చూడాలి లాలిలాలి ॥లా॥

నీ బుగ్గలు నులిమేరు నీకు ముద్దులు పెట్టేరు
నీ బుగ్గలు కందకమునుపే నిద్రపో స్వామి ॥లా॥

ఘుమ ఘుమ లాడేను నీ తొట్టి అంతా మల్లెలతో
పడతులు వీచేరు నీకు సరోజపుష్పాల ॥లా॥

## 46

శ్రీరాముని భజించిన దొరకును ముక్తిమార్గం॥
రాముని భజించవే మనసా
రఘురాముని స్మరించవే మనసా ॥శ్రీ॥

రామ రామ అన దొరకు భక్తి మార్గము
పరమానంద సౌభాగ్యము ॥రా॥శ్రీ॥

రామ రామ శ్రీరామ
రామ రామ జగదభిరామ
రామ రామ జయ రామ
రామ రామ జానకిరామ యనవే మనసా ॥రా॥శ్రీ॥

సరోజాక్షా నీవే మాకు నీవేనయ్యా
దిక్కయ్యా యన దొరకు
పరమానంద సౌభాగ్యము ॥రా॥

## 47

కరుణించుము కరుణించుము కరుణాకటాక్షా
కరుణించుము కరుణించుము కౌసల్యా తనయ ॥క॥

దయచూడుము దయచూడుము మము ధర్మపాల
దయచూడుము దయచూడుము దశరథతనయ ॥ద॥

మము ఏలుకో మము ఏలుకో ఏకపత్నీవ్రత
సర్వపాలక సర్వపాలక సదా సరోజాక్షా ॥మ॥

## 48

దయామయుడు దయామయుడు
దశరథనందనుడు
వేనోళ్ళ పొగడాలి భక్తితో కొలవాలి
మా దశరథరాముని ॥ద॥

కరుణామయుడు కరుణామయుడు
కౌసల్యా తనయుడు
వేనోళ్ళ పొగడాలి భక్తితో కొలవాలి
మా కౌసల్యా రాముని ॥క॥

శాంతమూర్తి శాంతమూర్తి శ్యామసుందరుడు
వేనోళ్ళ పొగడాలి భక్తితో కొలవాలి
మా శ్యామసుందరుని ॥శాం॥

సత్యపాలుడు సత్యపాలుడు సరోజాక్షుడు
వేనోళ్ళ పొగడాలి భక్తితో కొలవాలి
మా సరోజాక్షుని ॥స॥

# 49

సురసుర లాడడు సూర్యవంశజుడు
శుద్ధమైనవాడు మా శ్రీరామచంద్రుడు ॥సు॥

రుసరుస లాడడు రఘువంశజుడు
శాంతస్వభావుడు మా శ్రీరామ చంద్రుడు ॥సు॥

విస విస లాడడు వీరాధి వీరుడు
వినయము కలవాడు మా శ్రీరామ చంద్రుడు ॥సు॥

సరసర చేయునుగా సత్య ధర్మ పాలన
సరోజపుష్పాల పూజించాలి మా శ్రీరామ చంద్రుని ॥సు॥

# 50

నీవు సీతమ్మను కనుగొన
శబరి నీకు దారి చూపెనే శ్రీరామ
ఆ శబరి నీకు భక్తురాలాయెగా శ్రీరామ ॥నీ॥

నీవు వారధికట్ట
చిన్న ఉడుత ఇసుక రాల్చెనే శ్రీరామ
ఆ ఉడుత నీకు భక్తుడాయెనే శ్రీరామ ॥నీ॥

నీ తమ్ముడు మూర్ఛపోవ
వాయునందనుడు సంజీవి తెచ్చెనే శ్రీరామ
ఆ అంజనేయుడు నీ భక్తుడాయనే శ్రీరామ ॥నీ॥

నిన్ను పూజించను ఎందరో ఎన్నో చేశారు
శ్రీరామ నీకు సరోజ పుష్పాలిచ్చెద
నీ భక్తురాలిగా నన్నేలుకో శ్రీరామ ॥నీ॥

# 51

రామా నీ స్మరణే నా స్మరణ కదా రామా॥
నిన్ను స్మరించ నా తనువు పులకించు రామ ॥రా॥

నిన్ను కన నా కనులు వేచి ఉండు
నిన్ను స్మరించ నా మది ఉప్పొంగు ॥రా॥

నీ పిలుపు విన నా చెవులు కాచి ఉండు
నీ పాట పాడరాగా నాలుక తపించు రామ ॥రా॥

నిన్ను స్మరించి స్మరించి సంతృప్తి
పొంద కటాక్షించు సరోజాక్షా ॥రా॥

# 52

రామ రామ జయ రామ రామ రామ కళ్యాణ రామ ॥రా॥

కుశల మడిగె కౌశికుని కోసలాపతి భక్తితో
కౌశికు డడిగె రామ లక్ష్మణుల యజ్ఞము కాపాడ ॥రా॥

దశరధుడు సంకోచపడె ముద్దులారని బిడ్డలపంప
వశిష్టుడు పలికె శుభమగునని ॥రా॥

వెడలిరి రామలక్ష్మణులు కోదండముపట్టి కౌశికునితో
చంపిరి తాటక సుబాహువుల ముక్తి నొసగిరి అహల్యకు ॥రా॥

సరోజాక్షుడు శివుని విల్లు విరచి సీతను చేపట్టె
కౌశికుడు దీవించె రామలక్ష్మణుల లోకకళ్యాణ మగునని ॥రా॥

# 53

దండు బయలుదేరె దండిదండిగా
వారధి కట్టను రామ రామ యనుచు బయలు దేరే
దండి దండిగా రాళ్ళ చెట్టు చేకొని
రామ రామ అనుచు దండు బయలుదేరె ॥దం॥
రామ రామ అనుచు ఉడుత పొర్లే
ఇసుకలో వారధి కట్టను పొర్లె ఇసుకలో ॥దం॥
భక్తపాలుడు సరోజాక్షుడు నిమిరెను
చేతితో భక్తి తెలుప జనులకు ॥దం॥

# 54

శ్రీరాముని కన ఏమి వైభోగము ఏమి ఆనందము ॥శ్రీ॥
జిగ జిగ మెరిసే ముత్యాలమాల శ్రీరాముని ఉరమున
తులసి మాలతో ॥శ్రీ॥
అభయహస్త తేజస్సు శ్రీరాముని ముఖ వర్చస్సులోని కళతో ॥శ్రీ॥
శ్రీరాముని పవిత్ర పాదములు సరోజ పుష్పాల అలంకరించిన
శోభతో ॥శ్రీ॥

# 55

రఘుకుల తిలక రఘువంశ సుధ శ్రీ రఘురామ
మా ఇంటికి రావయ్య మమ్మేలవయ్య ॥ర॥
ఏలుకోవా ఏలుకోవా అంటే పలుకకున్నావే
ఇంకేమని అడిగేము ఇనకుల తిలక ॥ర॥
దయామయుడవు ధర్మపాలుడవు
నీ దయ మాపై చల్లవయ్యా కొంత ॥ర॥

# 56

రాముని సేవించరే మా శ్రీరాముని సేవించరే
పూలు పండ్లు పాలు ఇచ్చి భక్తి శ్రద్ధతో
సీతమ్మను సేవించరే మా జానకమ్మను సేవించరే
పసుపు కుంకుమ గంధము నిచ్చి భక్తి శ్రద్ధతో ॥సీ॥
సీతారాముల నెప్పుడు భక్తిశ్రద్ధతో సేవించ
తలచిన కార్యములన్ని సౌభాగ్యముగ చేకూరు ॥రా॥
సరోజాక్షులే కదా మనకు దారి తెన్నులు చూపువారు ॥రా॥సీ॥

# 57

నిత్యము నిను పూజించ నిత్యమల్లెలు తెచ్చాను
నీ మెడ నిండుగా వేసి కనుల కాంచ ॥ని॥
నా కనులు నిన్ను చూడ తపించుచున్నవి
కావుమయ్య నన్ను కౌసల్య తనయ ॥ని॥
కావు కావు అన కాకాసురుని కాచిన కోదండరామ
నన్ను కావగ నీకు కష్టమేమి స్వామి ॥ని॥
సరోజాక్షుడవయ్యా నీవు సత్యపాలకుడవు
నా చపలత తీర్చేది నీవేకదయ్యా ॥ని॥

# 58

శ్రీరాముని పదములే పట్టాలిగాని
వెఱ్ఱిగ ధ్యానింప నాకేమి దొరకు ॥శ్రీ॥
శ్రీరాముని స్మరణలే చేయాలికాని
వెఱ్ఱిగ తలచిన నా కేమి దొరకు ॥శ్రీ॥
శ్రీరాముని పాటలే పాడాలిగాని
వెఱ్ఱి వెఱ్ఱిగ పూజించ నాకేమి దొరకు ॥శ్రీ॥

## 59

రామ రామ రామయ్య
నీవే దిక్కు మాకయ్య ॥రా॥
నిన్నే మేము పూజించేము
నిన్ను విడువలేమయ్యా ॥రా॥
పూలు పండ్లు తెచ్చామయ్యా పాదముల పట్టేమయ్యా
పాటలెన్నో పాడేమయ్యా ఆనందమే పొందేమయ్యా ॥రా॥
రామ రామ అనేమయ్యా పరవశించి పోయేమయ్యా
కరుణ చూపను రావేమయ్యా సరోజాక్షా అనేమయ్యా ॥రా॥

## 60

వేయి నోళ్ళతో వెర్రిగా పొగడలేను
భక్తితో నీకు కీర్తన పాడెద స్వీకరించు
మా శ్రీరామ నన్ను స్వీకరించు మా రఘురామ ॥వే॥
తందనాలతో నర్తన చేయలేను
భక్తితో నిన్ను భజన చేసెద స్వీకరించుమా
నన్ను స్వీకరించుమా రఘురామ ॥తం॥
భక్తితో నీకు సరోజ పుష్పాల పల్లకి కట్టెద
స్వీకరించుమా శ్రీరామ నన్ను
స్వీకరించుమా రఘురామా ॥భ॥

## 61

చల్లని గాలి వీచెను చక్కటి నిద్రవచ్చెను
ఆ నిద్రలో సీతారాములు కనగలిగె నా మది
ఏమి ఆనందము ఏమి ఆనందము॥

ఆ నిద్రలో సీతారాముల భజనలే విని నా మది
పదముల పట్టెను నా మది ॥ఏ॥
ఆ నిద్రలో పండ్లు పూలను కనెను నా మది
సరోజ దళాలు సీతారాముల పదముల ఉంచెను నా మది ॥ఏ॥

# 62

నీ పదములపై నన్ను ఉంచ లాభమేమి రామ
నీవు కనులు తెరువకున్న లాభమేమి ॥నీ॥
నీ కెన్నో పనులున్నవి కాని నీకు
చేతకానిదేమున్నది శ్రీరామ ॥నీ॥
నీ పదముల పట్టాను పదముల పూజించాను
నీ పదముల నమ్మాను నీ పదముల విడువలేను రామ ॥నీ॥
సరోజాక్షా శ్రీరామ సర్వమర్పించాను
నీ కనులుతెరచి కావుమయ్యా ॥నీ॥

# 63

పండ్లంటే నీకు ఎంతో ఇష్టము రామ
నీ వంటే నాకు ఇంకా ఇష్టము ॥పం॥
నా ఇష్టము తీరేదెట్లా రామ
నిన్ను చేరేదెట్లా రామ ॥పం॥
భక్తులు ఎందరో స్తుతించిరి నిన్ను పలువిధముల
నన్నుకూడ రామ సంస్తుతి చేయనివ్వు ॥పం॥
నీ కిష్టమైన సరోజాలు తెచ్చాను
నీవు చేకొననిదే విడిచేదిలేదు ॥పం॥

## 64

లాలయ్య లాలి శ్రీరామ లాలి
చిరునవ్వు లొలికేటి చిన్నయ్య లాలి ॥లా॥
లాలయ్య లాలి రఘువీర లాలి
రవిచంద్ర నయనాల రామయ్య లాలి ॥లా॥
లాలయ్య లాలి రణధీర లాలి
పక పక నవ్వేటి పరమాత్మ లాలి ॥లా॥
లాలయ్య లాలి అయోధ్యాపతి లాలి
అందాల ముద్దుల బుజ్జయ్య లాలి ॥లా॥
లాలయ్య లాలి సరోజాక్ష లాలి
చక్కని చుక్క మా శ్రీరామ లాలి ॥లా॥

## 65

ఎట్లా నిన్ను కొలిచేదెట్లా తలచేదెట్లా
శ్రీరామ నీ పదముల పట్టేదెట్లా తెలుపుము ॥ఎ॥
శక్తి నివ్వు బుద్ధి నివ్వు నీ పదముల పట్టను భక్తి నివ్వు ॥ఎ॥
శ్రీరామ జయరామ జానకి రామ జగదభిరామ జగదోద్ధారా ॥ఎ॥
నీవే దిక్కు నీవే మాకు నీ పాదముల పూజింప
సరోజాలను తెచ్చానయ్యా ॥ఎ॥

## 66

ఎట్లా పిలువను రామా నిన్నెట్లా పిలువను శ్రీరామ
ధర్మపాలుడవననా నిన్ను దయామయుడవననా ॥ఎ॥
కరుణాకరుడవననా నిన్ను కరుణామయుడవననా ॥ఎ॥
పాపనమూర్తివననా నిన్ను భక్తపాలుడవననా ॥ఎ॥
సర్వపాలుడవననా నిన్ను సరోజపూజితుడవననా ॥ఎ॥

## 67

రాముని వారము శ్రీరాముని పూజించు వారము ||రా||
పూజలు చేకొని పుడమి నేలు మా రాముని
పూజించు వారము ||రా||
పదముల పూజింపగ పరమపద మొసగు
రాముని పూజించు వారము ||రా||
సర్వమర్పింపగ సంతసపడిన
శ్రీరాముని పూజించు వారము ||రా||
సరోజ పుష్పాల పీఠముపై నున్న
రాముని పూజించు వారము ||రా||

## 68

పూవులు పూచెను
అవి ఘుమ ఘుమ లాడెను
సీతారాముల పదములను ఉంచను ఆశ కలిగెను
రామ రామ శ్రీరామ రామ రామ సీతారామ ||రా||
గంధము తీసితిని
అది ఘుమ ఘుమ లాడెను
సీతారాముల నలంకరించను ఆశ కలిగెను ||రా||
పండ్లను కోసితిని
అవి తీయగ నుండును
సీతారాములకు నైవేద్యమివ్వను ఆశ కలిగెను ||రా||
సరోజ పుష్పాల మాలలు కట్టితిని
అది కళ కళ లాడెను
సీతారాముల మెడలో దాల్చను ఆశ కలిగెను ||రా||

## 69

రాముని చరితము వినరండి
శ్రీరాముని చరిత్రము వినరండి ॥రా॥

పునర్వసు నక్షత్రాన పుట్టెను రాముడు
పుడమిని చక్కగ ఏలను ॥రా॥

ఇక్ష్వాకుల యందు ఇంపుగ పుట్టెను
ఇలను ఏలి ధర్మస్థాపన చేయగ ॥రా॥

విశ్వామిత్రుని యజ్ఞము కాచెను
దుష్టుల శిక్షించి శిష్టుల రక్షింప ॥రా॥

శివువిల్లు విరచెను
జానకిని పెండ్లాడ లోక కల్యాణము జరుగ ॥రా॥

వెడలెను కారడవులకు
కైకేయి వరముల శిరసావహించి సత్యపాలనచేయ ॥రా॥

దుష్టశిక్షణ చేసి శిష్టుల రక్షించి
భక్తపాలన చేసె పరమాత్ముడు ॥రా॥

సీత నపహరించిన పది తలల రావణుని
సంహరించె వానరుల స్నేహముతో ॥రా॥

ధర్మస్థాపనకు మెచ్చి దేవతలు చల్లిరి
సరోజ పుష్పాలు శ్రీరామచంద్రునిపై ॥రా॥

## 70

చిగురాకు పచ్చని చీరెను కట్టి
వంగపండు రవికెను తొడిగి
సీతమ్మ వచ్చెను శ్రీరాముని కడకు
సిగ్గులొలుకుచు శృంగారముగా ॥సీ॥

సిగలో పూవులు ముడిచెను తల్లి
పెద్ద కళ్ళకు దిద్దెను సన్నని కాటుక ॥సీ॥
బొట్టు పెట్టెను రూపాయంత
పచ్చటి పసుపు పూసెను నును పైన పాదాలకు ॥సీ॥
హంసనడకల సౌభాగ్యవతి సీతమ్మను
చూడరే సరోజమాలను చేకొని ఉన్నది ॥సీ॥

# 71

శ్రీరామ నీ పాదములే మాకు కావాలి
గట్టిగ పట్టి పూజలు చేయను ॥శ్రీ॥
అహల్య పట్టి పరమ పదము సాధించిన ॥శ్రీ॥
సీతమ్మ పట్టి సౌభాగ్యము సాధించిన ॥శ్రీ॥
కపివీరుడు పట్టి నిన్ను గట్టిగ కట్టేసుకున్న ॥శ్రీ॥
విభీషణుడు పట్టి రాజ్యము సంపాదించిన ॥శ్రీ॥
భక్తులందరు పట్టి విడువక పూజించు ॥శ్రీ॥
సరోజ పుష్పాలు తెచ్చాము శిరస్సు వంచి
నీ పాదముల నిడ

# 72

వదలను శ్రీరామ నిన్ను వదలను ॥వ॥
నిన్ను ఎవరు వదిలేరు నీ తోడు అమృతము ॥వ॥
అహల్య శబరులు వదిలిరా హనుమంతు
సుగ్రీవులు వదిలిరా విభీషణుడు వదిలెనా
రామా మఱి ఎవరు వదిలారు ॥వ॥
నీ తోడుకై తపించే నన్ను నీవు వదలకు సరోజాక్షా ॥వ॥

# 73

రామ రామ శ్రీరామ రామ రామ సీతారామా ॥రా॥

గంపలను నిండా గబగబ పూలను తెచ్చిరి
సీతారాముల గది అలంకరించిరి ॥రా॥

సీతారాములు శృంగారముగా సిగ్గులొలుకుచు
చేతులు పట్టుక వచ్చిరి ॥రా॥

శ్రీరామచంద్రుడు పవళించె సరోజ పాన్పుపై
సీతమ్మ పాదాలు ఒత్తగా ॥రా॥

సీతారాములు తలచిరి భక్తుల సేవల
సీతారాముల తలపే భక్తులకు దీవెన కాగా ॥రా॥

# 74

చప్పట్లు కొట్టేము చిందులు వేసేము
రామ రామ శ్రీరామ అనుచు ఆనందముగా ॥చ॥

రాగాలు తీసేము గొంతెత్తి పాడేము
రామ రామ శ్రీరామ అనుచు ఆనందంతో ॥చ॥

చిటికెలు వేసేము తాళాలు వేసేము రామ
రామ శ్రీరామ అనుచు ఆనందంతో ॥చ॥

మా ఆనందం చూచి రాముడు మెచ్చను
మా రామునిపై మేము సరోజాలు చల్లేము ॥చ॥

## 75

రాముని నమ్మండి
జయరాముని తలవండి
శ్రీరాముని కొలవండి ॥రా॥

నమ్మిన వారిని తనలో చేర్చుకునే ॥రా॥

తలచి తలచి తన్మయ మొందను ॥రా॥

రాముని కొలవండి
కొలచి కొలచి కైవల్యము కోరను ॥రా॥

సరోజ పుష్పాల పూజలు చేసి చేసి
స్వర్గానందము పొందను ॥రా॥

## 76

రామ రామ అనుచు రాముని చేరుట
ఎన్నటికో శ్రీరాముని తెలియుట ఎన్నిటికో ॥రా॥

నిన్ను నమ్మిన వారము నీ వారమే మేమని
శ్రీరామునికి తెలియుట ఎన్నటికో
మా భాగ్యము పండుట ఎన్నిటికో ॥రా॥

మా భాగ్యదేవత శ్రీరాముడే నని నమ్మిన
వారము సరోజపుష్పాల పూజించువారము ॥రా॥

## 77

రామ రామ అను మంత్రమే తారక మంత్రము ॥రా॥

రామ రామ అని పలుకరే మనుజులారా
శ్రీరాముని మనసున తలవరే మనుజులార ॥రా॥

జయ జయ రామ అని పలుకరే మనుజులార
శ్రీరామ రామ యని పలుకరే మనుజులారా
రఘురామ యని పలుకరే మనుజులారా
సరోజాక్ష యని పలుకరే మనుజులారా
శ్రీరాముని మనస్సున తలవరే మనుజులార ॥రా॥

## 78

ఏమిరుచిరా నిను కనవలెనను
ఆశ ఏమి రుచిరా ॥ఏ॥
పండ్లు పాలు తేనె కన్న ఎంతో రుచిరా
శ్రీరామ ఎంతో రుచిరా ॥ఏ॥
నీ నామము పలుక ఎంతో రుచిరా
పలికి పలికి పాటగా పాడిన నా రామ ॥ఏ॥
నీ పాదాల సరోజాలుంచ ఏమిరుచిరా
రామ ఏమి ఆనందంరా ॥ఏ॥

## 79

కోపగించకు రామా నన్ను కోపగించకు
కౌసల్య రాముడవని నీ కాళ్ళు పట్టేను ॥కో॥
దండించకు రామ నన్ను దండించకు
దశరథ తనయుడవని దండాలే పెట్టేను ॥కో॥
ఆదరించుమా నన్ను ఆదరించవా
అయోధ్య రాముడవని ఆనందపడినాను ॥కో॥
సంరక్షించవా రామ నన్ను సంరక్షించవా
సత్యసంధుడవని నిన్ను సరోజాల పూజించాను ॥కో॥

# 80

శ్రీరామచంద్రా పవళింపు సేవకై
సరోజాలు తెచ్చాను నీ పట్టుపాన్పుపై చల్లాను
ఘుమ ఘుమ లాడుతున్నది కళకళ లాడుతున్నది ॥శ్రీ॥

సీతమ్మ నీకై కాచున్నది
శృంగారముగా అలంకరించుకున్నది
నీ కొరకై వేచున్నది ॥శ్రీ॥

పడుతులంతా నీకు జోలలు పాడేరు
భక్తులంతా నీ పాదాలు పట్టేరు

పవళింపు సేవకు రామయ్యా
శ్రీరామ దయచూపవయ్యా మామీద ॥శ్రీ॥

# 81

రాముడమ్మ రాముడు పాలబుగ్గల రాముడు
కౌసల్య లాలించు లావణ్య రాముడు ॥రా॥

రాముడమ్మ రాముడు శాంతమూర్తి రాముడు
దశరథ రాజునకు ముద్దుబిడ్డ రాముడు

రాముడమ్మ రాముడు శృంగార రాముడు
సీతమ్మ పూజించు పావన రాముడు

రాముడమ్మ రాముడు సర్వపాలక రాముడు
భక్తులు పూజించు సరోజాక్ష రాముడు ॥రా॥

# 82

సంపద మంచిదా శ్రీరామస్వామి పూజ మంచిదా
తెలుసుకోవలె మనసా బాగా తెలుసుకోవలె మనసా ॥సం॥

పాలు చక్కెర మంచిదా శ్రీరామ పాదసేవ మంచిదా
తెలుసుకోవలె మనసా బాగా తెలుసుకోవలె మనసా ॥సం॥

కమలదళాక్షుని కరుణ చాలు మనసా
సర్వసంపదలు కల్గు, సరోజాక్షుని కృపతో మనసా ॥సం॥

# 83

ఆలింగనముతో ఆంజనేయుని ఆదరించిన శ్రీరామ
నీకు మ్రొక్కెనువేయి మొక్కులు నన్నాదరించు శ్రీరామ ॥ఆ॥

తీయని పండ్లు స్వీకరించి శబరమ్మకు
కైవల్య మిచ్చిన శ్రీరామ నీకు మ్రొక్కెను
వేయి మొక్కులు నన్నాదరించు శ్రీరామ ॥ఆ॥

సర్వజనుల సంరక్షించు సరోజాక్షా శ్రీరామ
నీకు మ్రొక్కెను వేయి మొక్కులు నన్నాదరించు శ్రీరామ ॥ఆ॥

# 84

వేచి ఉండెదనే వేచి ఉండెద
సీతమ్మ వచ్చును సీతమ్మ వచ్చును
నా తల్లి వచ్చునని ॥వే॥

వాకిట గడపకు పసుపు కుంకుమ
అలంకారముగా దిద్దితిని ॥వే॥

వాకిలి ముంగిట మురిపముగా
అందమైన ముగ్గులు వేసితిని ॥వే॥

సరోజ పుష్పాల మాలలు కట్టి
వేచి ఉండెదనే వేచి ఉండెద
నా తల్లి వచ్చును నన్నాదరించునని ॥వే॥

# 85

రావా రామయ్య మా ఇంటికి
సీతమ్మతోకూడి మా ఇంటికి ॥రా॥

నీవు వచ్చావంటే పూజలు చేసేను
పాటలు పాడేను నీ పాదాలు పట్టేను ॥రా॥

సీతమ్మకు ఇచ్చేను సంపంగి పూలు
సౌభాగ్యమిమ్మని చల్లగా అడిగేను ॥రా॥

నా పూజలు అందుకోవా సీతారామయ్యా
మీ కొరకు అమర్చాను సరోజాల పీఠము ॥రా॥

# 86

శ్రీరాముని పదములు పట్టండి
రఘురాముని భజనలు చేయండి ॥శ్రీ॥

పట్టాభిరాముని పదములు పట్టిన
పరమపదమే దొరకునట ॥శ్రీ॥

కరముల జోడించి కౌసల్యారాముని
వేడిన కైవల్యమే దొరకునట ॥శ్రీ॥

భక్తపాలుని భజనలు చేసిన
సౌభాగ్యము కలుగునట ॥శ్రీ॥

## 87

కంచు కొండల మధ్య కుమిలి పోతున్నాము
కదిలించు మా మదిని శ్రీరామచంద్ర ॥కం॥

కనులు తెరిపించే కరుణామయుడవు
మూర్ఖులకు కూడా భక్తి నేర్పిన వాడవు ॥కం॥

మా మదిలోన నిలువుము వైధిలినాథా
మమ్మెప్పుడు వీడకు మా పుణ్యమూర్తి ॥కం॥

నీ పాదాల ఉంచేము సరోజాలెన్నో
సాష్టాంగాలు చేసి సర్వమర్పించేము ॥కం॥

## 88

రామ రామ శ్రీరామ
మా పూజలందుకో శ్రీరామ ॥శ్రీ॥

కోటి పూల పూజలు కౌసల్యారామ
కోరికోరి పూజలు కరుణామయ ॥రా॥

దండాలయ్యా నీకు దండాలయ్యా
దండిదండిగా నీకు దండాలయ్యా ॥రా॥

పాదాలు కడిగేము పావనమూర్తి
ఆ జలాలు తలదాల్చేము శ్రీరామచంద్ర ॥రా॥

సదా సదా నిన్ను పూజించేము సరోజాక్షా
సర్వవేళల మమ్ము కాపాడు రామా ॥రా॥

## 89

సీతమ్మకు నమస్కారము
పవన కుమారునికి నమస్కారము ॥సీ॥

లక్ష్మణస్వామికి నమస్కారము
శ్రీరామచంద్రునకు నమస్కారము ॥ల॥

శ్రీరామునికి నమస్కారము
శ్రీరాముని వారందరికి నమస్కారము ॥శ్రీ॥

శ్రీరామ భక్తులకు నమస్కారము
శ్రీరామచంద్రునకు నమస్కారము ॥శ్రీ॥

సరోజాక్షునకు నమస్కారము
సర్వమంగళకరునకు నమస్కారము ॥స॥

## 90

కృప చూపవా శ్రీరామచంద్రా
నిన్ను నమ్మిన నాపై కృపచూపవా ॥కృ॥
నిన్ను కీర్తించే నాపై కృప చూపవా ॥కృ॥
నీ పాదాలు పట్టిన నాపై కృప చూపవా ॥కృ॥
నీవే దయకలవాడన్న నాపై కృప చూపవా ॥కృ॥
వేనోళ్ళ నిన్ను వేడే నాపై కృప చూపవా ॥కృ॥
ఎల్లప్పుడు నిన్ను తలచే నాపై కృప చూపవా ॥కృ॥
నీకు సర్వము అర్పించిన నాపై కృప చూపవా ॥కృ॥
కృప చూపవా సరోజాక్షా కృప చూపవా
కరుణాకరా కృప చూపవా ॥కృ॥

# 91

రఘురామునికి భజనలు చేసి భక్తిని కోరండి
శ్రీరాముని పూజలు చేసి పురుషార్థము కోరండి ॥ర॥

రఘురామునికి పాటలు పాడి పారవశ్యము పొందండి
శ్రీరామునికి పదములుపట్టి పరమపద కోరండి ॥ర॥

రఘురామునికి సరోజాలర్పించి సంతోషము పొందండి
శ్రీరాముడు సర్వమొసగునని తెలియండి ॥ర॥

# 92

పద్మాలు తెచ్చాను
నీ పాదపద్మముల పూజించి
పరమపదము కోర
॥రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ॥
కలువపూలు తెచ్చాను
నీ కరముల నిడి
నే కైవల్యము నిను కోర ॥రా॥

తామరలు తెచ్చాను
తన్మయతతో నీ కర్పించి
తనివితీర నీ స్మరణలు కోర ॥రా॥

సరోజాలు తెచ్చాను
సంతోషముగా సమర్పించి
స్వర్గానందము నిన్ను కోర ॥రా॥

# 93

పలుకమంటే పలుకవే శ్రీరామా
నా పలుకు నీకు వినపడదా ॥ప॥

నే చేసిన నేరమేమయ్యా
నా తప్పులు మన్నించవా శ్రీరామ ॥ప॥

నీ వెంతో ఘనుడవనుకొంటి
నిన్నే నమ్మితినయ్య రామ ॥ప॥

నేరములుంటే మన్నించు
సరోజ పుష్పాల పూజలు చేసెద ॥ప॥

# 94

వినరమ్మ వినరమ్మ సీతమ్మ కథను
సీతమ్మ కథను మా సీతమ్మ కథను ॥వి॥

ఆశపడె మా తల్లి బంగరు లేడి కావాలని
ఏనాడు ఎరుగని కోరిక ॥వి॥

శ్రీరాముడు వెడలె విల్లమ్ములతో
సీతమ్మ కోర్కె తీర్చగను ॥వి॥

గంతులు వేసె గంతులు వేసె మాయలేడి
కారడవులకు। శ్రీరామునికి చిక్కక ॥వి॥

హా సీతా హా లక్ష్మణా అని నేల వ్రాలెను
మారీచుడు శ్రీరాముని బాణమునకు ॥వి॥

సీతమ్మ చిక్కుకొనె కష్టాలలో
సరోజాక్షుడు దుఃఖించె సీతమ్మను కానక ॥వి॥



పాట నెం. 94 చిత్రం

# 95

రామ రామ శ్రీరామ నీవేనయ్యా మాకయ్యా
నీ పాటలు పాడి పరవశించెద శ్రీరామా
నీ పాటలు విని పరమపద మొసగుమా శ్రీరామా ॥రా॥

నీ పాటల నాట్యము చేసి ఆనందమొందెద శ్రీరామా
నా ఆనందము చూచి అభయమివ్వు మా శ్రీరామా ॥రా॥

నీ నామస్మరణలు చేసి సంతసమొందెద శ్రీరామ
నా సంతసము చూసి స్వర్గానంద మివ్వవా శ్రీరామ ॥రా॥

నీకు సరోజ పుష్పాల పూజలు చేసి పుణ్యమొందెద శ్రీరామ
నా పూజలందుకొని నన్ను నీలో చేర్చుకో శ్రీరామా ॥రా॥

# 96

కావుమమ్మా మమ్ము కమలదళాక్షి
కౌసల్య కోడలా ॥కా॥

జాగు చేయకు మమ్ము కాపాడు
జానకీదేవమ్మా జనకరాజ పుత్రి ॥జా॥

దరిచేరాము తల్లి నిన్ను దయామయవని
దశరథ కోడలా దరణిజ ॥ద॥

చేర్చుకోవమ్మ నీలో
చల్లగా మా తల్లి చంద్రవదన ॥చే॥

సరోజాక్షి సుందరాంగి సూర్యవంశపురాణి
సాష్టాంగాలు తల్లి ॥స॥

## 97

అలసితినయ్యా అయోధ్య రామ
నిన్ను వేడి వేడి వేదనాయెనయ్యా ॥అ॥

ఈ వేదనకు దారి చూపవయ్యా
రామచంద్రా నిన్ను వేడేను దీనతతో ॥ఈ॥

రామచంద్ర రఘువీర రావయ్యా
నా మనవి వినవయ్యా శ్రీరామ ॥రా॥

దారి తెలియకున్నదయ్యా సరోజాక్షా
సర్వపాల నా పాలి దైవమా ॥దా॥

## 98

సీతారాముల కళ్యాణం చూడను ఎంతో వైభోగం ॥సీ॥
ఆకాశమంతట పందిరినిండా రంగురంగుల పుష్పాలంకరణ ॥సీ॥

ముత్యాల ముగ్గులు రత్నాల పీఠము
వైఢూర్యాలతో మెరపులు మెరయ ॥సీ॥

ఏమి ఘుమఘుమలు ఏమి అలంకరణ
చూడను రెండు కళ్ళు చాలవు ॥సీ॥

శ్రీరాముని చేతిలోని సరోజమాల
సీతమ్మ చేతితో మల్లెపూమాల ॥సీ॥

దేవతలంతా దిగ్భ్రమ చెందగ
మాలలు మార్చిరి సీతారాములు ॥సీ॥

సీతారాముల కళ్యాణమే
లోక కళ్యాణము ఆనంద వైభోగము ॥సీ॥

# 99

నీగుణముల పాడగను నా కలమున
పలికించు రామా నే మైమరచేను
నీ గుణముల పాడి ॥నీ॥

రామ రామ శ్రీరామ రామ రామ సీతారామ
అని పాడగ నా మనము ఉప్పొంగునయ్యా శ్రీరామ ॥నీ॥

నిన్ను కొలవగ నా కరములు కదలించు
రామ నే మైమరచేను నిన్ను నా కరముల కొలచి శ్రీరామ ॥నీ॥

నిన్ను సరోజాక్షా అని స్మరించ
నా మనమున నిలుపుము శ్రీరామ
నే మైమరచేను నిన్ను స్మరించి ॥నీ॥

# 100

శ్రీరామ నిన్ను ఎట్లా పూజించిన
దయకల్గును ఎట్లా కొలిచిన దయకల్గును ॥శ్రీ॥

పాదాలు కడిగేమా పాదాలు పట్టేమా
పాదాలు కళ్ళద్దేమా పాదాలు పూజించేమా ॥శ్రీ॥

శ్రీరామా తీయని పండ్లు ఇచ్చేమా
సుగంధ పుష్పాల పూజించేమా
భక్తితో ప్రార్థన చేసేమా ॥శ్రీ॥

ఏమి అర్థముకాని అంధులము
దారి చూపవా దయామయా
సంరక్షించు సరోజాక్షా ॥శ్రీ॥

## 101

రామ నామము దివ్య నామము
మమ్ము తరింపచేయు ఆనంద నామము ॥రా॥

రామ రామ శ్రీరామ అని పలుక పలుక
తరింపచేయు ఈ ఆనంద నామము దివ్య నామము ॥రా॥

ఆనంద నామము అయోధ్య రామ నామము
అందరిని ఆనందపరచు దివ్య నామము ॥రా॥

సర్వవేళల స్మరింపన్ స్వర్గానందము కలుగు
ఈ ఆనంద నామము దివ్య నామము శ్రీరామ నామము ॥రా॥

## 102

గలగల గజ్జలు మ్రోగినంతనే
నాట్యము రక్తి కట్టదు మనసా
చిందులు వేసి గట్టిగ అరచిన
భజనలు కావు మనసా ॥గ॥

భక్తిభావము ధ్యానము నిలకడ కలిగినకాని
భక్తి కుదరదు మనసా ॥గ॥

సరోజాక్షునికి సర్వమర్పించి
స్మరణలు చేసినగాని
మదిలో నిలువడు మనసా ॥గ॥

## 103

దేవ దేవ దివ్యతేజా దశరథ తనయా శ్రీరామా
దండాలు అందుకో మా దండాలు అందుకోవయ్యా ॥దే॥

దీనతతో దండాలు పెట్టేము నీ పాదాలే పట్టేము ॥దే॥
దశరథ తనయుడవని ధైర్యముగా ఉన్నాము
నిన్నే నమ్మామయ్యా ॥దే॥
దండాలు పెట్టేము అందుకోవయ్యా
మా సరోజాలు అందుకోవయ్యా ॥దే॥

# 104

దివ్యతేజుడు మా దశరథ తనయుడు
ధర్మపాలుడు మా శ్రీరామచంద్రుడు ॥ది॥
వీరాధివీరుడు మా వైదేహిప్రియుడు
సత్యపాలుడు మా శ్రీరామచంద్రుడు ॥ది॥
కరుణామూర్తి మా కౌసల్య తనయుడు
భక్తపాలుడు మా పురాణ పురుషుడు ॥ది॥
సర్వపాలుడు మా సరోజాక్షుడు సదాసదా
పూజించేము మా శ్రీరామచంద్రమూర్తిని ॥ది॥

# 105

వెదకితి శ్రీరామచంద్రుని వెదకితి
కరుణాకరుడని వెదకితి ॥వె॥
కరముల జోడించి వేడుకొనిన
కరుణ కల్గునని వెదకితి ॥వె॥
పాటలు పాడి భజనలు చేసి పాదాలు పట్టిన
కరుణ కల్గునని వెదకితి ॥వె॥
వెదకితి వెదకితి సరోజ పుష్పాల పూజించి
ఫలము కోర వెదకితి ॥వె॥

## 106

పద్మదళాక్షుని పాదపద్మముల పూజింతమా
పడతులారా పాదముల కడిగి పూజింతమా ॥ప॥

ఎన్నోరకాల పూలను తెచ్చి
ఎన్నోరకాల నైవేద్యాలిచ్చి ॥ప॥

పద్మదళాక్షా ఆజానుబాహు
నీలమేఘా నిర్వికారా అని పాడి ॥ప॥

ఎన్నోవిధాల పూజలుచేసి
సరోజాక్షుని దీవెన పొందను ॥ప॥

## 107

నా మనసే నీ మందిరమై రామా
ఆ మందిరమున నిన్ను నిలిపిన
ఆ ఆనందము ఎట్లుండునో రామా ఎట్లుండునో ॥నా॥

ఆ మందిరమున నిను కొలిచిన
నిన్ను కొలుచుటే నా కొలువైన
నా ఆనందము ఎట్లుండునో రామా ఎట్లుండునో ॥నా॥

నిన్ను కోటి పూల కొలచి
ఆ కోటి పూలన్నీ
నా సరోజ మాలలైన రామా
నా మది ఎట్లుండునో రామా ఎట్లుండునో ॥నా॥

## 108

ఈ దీనురాలి చిన్న కోర్కె వినరాదాయె
రామ నీకు వినరాదాయె
నేనేమి చేతునయ్యా ॥ఈ॥

నా మదిన నిన్ను నిలువుమంటి
ఇంక ఏమి కోరలేదు ॥ఈ॥

దీన రక్షకుడవట శరణొసగువాడవట
ఇంత ఘటికుడవే నీవు ॥ఈ॥

శ్రీరామ అని మొరబెట్టితి
సరోజాక్షా అని వేడుకొంటి ॥ఈ॥

## 109

నీ పాద కమలములనే కోరేను
నన్ను కరుణించవా కరుణాపయోనిధీ ॥నీ॥

అహల్య పూజించిన
నీ పాదామృతాలనే కోరేను ॥నీ॥

గుహరాజు విడువక పట్టిన
నీ అమృత పాదాలనే కోరేను ॥నీ॥

విభీషణుడు శరణని పట్టిన
నీ పవిత్ర పాదాలనే కోరేను ॥నీ॥

భక్తులంతా పరవశించి సరోజ పుష్పాల పూజించు
నీ పుణ్య పాదాలనే కోరేను ॥నీ॥

# 110

సీతారాములు కిలకిల గలగల నవ్విరి
ఆనందం పొంగగ ॥సీ॥

శ్రీగంధము పూసె సీతమ్మ తల్లి
శ్రీరామ చంద్రునకు ॥సీ॥

శ్రీరామచంద్రుడు పెద్ద కుంకుమబొట్టు
పెట్టె తల్లికి ॥సీ॥

వింజామరలు వీచె సీతమ్మతల్లి
శ్రీరామచంద్రునకు ॥సీ॥

తలలో మల్లెలు ముడిచే
శ్రీరామచంద్రుడు సీతమ్మకు ॥సీ॥

ఏమి ఆనందము ఏమి శోభ సరోజాక్షుల
శృంగారశోభ లోక కల్యాణము ॥సీ॥

# 111

సుగుణాలవాలుడు సుందరాకారుడు
సూర్యవంశజుడు మా సీతాపతి ॥సు॥

మేము కోరువాడు మమ్మేలువాడు
మేమెప్పుడు పూజించు మైథిలినాథుడు ॥సు॥

దయకలవాడు దయామయుడు
దశకంఠుని దనుమార్చిన దశరథ నందనుడు ॥సు॥

సర్వకాల పూజితుడు సర్వమంగళకరుడు
ఎల్లప్పుడు పూజించు సరోజాక్షుడు ॥సు॥

# 112

రామా ఓ శ్రీరామా నీ నామ స్మరణ
ఏమి రుచిరా రామా ఎంత రుచిరా
స్మరణ చేయగ చేయగ కల్గుకదా పరవశము ॥రా॥

రామరామ శ్రీరామ రామరామ జయరామ
రామరామ సీతారామా అన ఏమి రుచిరా
రామ ఎంత రుచిరా ॥రా॥

పరవశమొంద పరవశమొంద కానగుదువే సరోజాక్షా ॥రా॥

# 113

రామరామ శ్రీరామ జానకిరామ శ్రీరామ ॥రా॥

జగమెల్ల ఏలేటి జగన్నాధునకు నా మీద
దయరాదు ఏలనో ॥రా॥జ॥

తప్పులు చేసినవారి కెల్లరకు ప్రేమతో
దండన లిచ్చునుగా ॥రా॥

క్షమియించి ముక్తిని ఇచ్చునుగా ప్రేమతో
లాలించి పాలించునుగా ॥రా॥

నా మీద ఏలనో దయరాకున్నది నే చేసిన
నే చేసిన తప్పులు ఏమిటో రామా ॥రా॥

పదములు పట్టేను సరోజాలర్పించేను
శ్రీరామా రాముని పాటలే పాడేను ॥రా॥

# 114

రామరామ యని అనరాదా శ్రీరాముని
మనస్సున నిలుపరాదా ॥రా॥

రామరామ యని శ్రీరామ రామ యని జానకి
రామయని జగదభి రామయని జయజయ
రామయని విడువక రామరామ యని ఎప్పుడు
రామరామ యని మనస్సున నిలుపగరాదా
సరోజాక్షునికి మంగళం పాడగరాదా ॥రా॥

# 115

రఘుకుల తిలక రఘువంశోద్ధారా
రా రావయ్యా మా ఇంటికి ॥ర॥

సరోజపుష్పాల పీఠమమర్చాను ఆసనముపై
సీతమ్మతో కూర్చుండ ॥ర॥

మా కోరిక తీర్చి మమ్ము కాపాడ ॥రారా॥

పంచభక్షాలెన్నో చేసి ఉంచాము
భక్షించి మమ్ము పావనము చేయ ॥రారా॥

మంగళహారతి ముదముతో నిచ్చేము
స్వీకరించి మమ్ము ఆనందపరచ ॥రారా॥

మా ఆతిథ్యముతో నీవు ఆనందమొందాలి
నీ ఆనందమే మాకు ఆశీర్వాదము కావాలి ॥రారా॥

# 116

పగడాలు చెక్కినట్టి బంగారపు
ఊయలలో నీలమేఘుడు పవళించె
ఊయలలు ఊపరమ్మా జోలలు పాడరమ్మా ॥ప॥

కౌసల్యతోటి ముద్దులాడి ముద్దులాడి
అలసినాడు నీలమేఘుడు ॥ఊ॥ప॥

నిద్రలోన నవ్వుతాడు ఆ తల్లిచూసి
మురిసిపోవగ ॥ఊ॥ప॥

మంచి గంధము ఘుమ ఘుమ లాడ
సరోజ పుష్పాల పాన్పుపై నీలమేఘుడు పవళించె ॥ఊ॥ప॥

# 117

చింతలు ఏలనే మనసా శ్రీరామచంద్రుడు
మన చెంతనే ఉండగ చింతలు ఏలనే మనసా ॥చిం॥
చింతలు తీర్చే చిద్విలాసుడు
మనలను విడువడు మనసా నమ్ముము మనసా ॥చిం॥

రామ రామ శ్రీరామా అని విడువక
తలచిన మనలను వీడడు మనసా ॥చిం॥

మనమున నిండుగ నిలుపవే శ్రీరామ
నామము మనసా చింతలు పొందకే మనసా ॥చిం॥

శ్రీరాముని చకచక చేరవే మనసా
సరోజాక్షుని నమ్మి చింతలు వీడవే మనసా ॥చిం॥

# 118

నిన్ను కనులార చూడ ఆశాయెనయ్యా
శ్రీరామ ఆ భాగ్యము నా కెన్నడు కలుగునో
ఎన్నడు కలుగునో ॥ని॥

నా ఆశ తీరు దారి ఏది రామా
నాకా దారి తెల్పు దయామయా ॥ని॥

నిన్ను వేడేనయ్యా నిన్ను కొలిచేనయ్యా
నీ చరణదాసురాలిని దయచూపు నాపై దయామయా ॥ని॥

సరోజాలతో మాలలల్లి ఉంచానయ్యా
ఆ భాగ్యమెప్పుడు ఇస్తావయ్యా శ్రీరామచంద్ర ॥ని॥

# 119

కాపాడు రామ కాపాడు నన్ను
కాపాడు రామా శ్రీరామ ॥కా॥

నీ పదములు పట్టుట నా వంతు
నీ పద ధూళి నా కిచ్చుట నీ వంతు ॥కా॥

నిన్ను స్మరించుట నా వంతు
నన్ను రక్షించుట నీ వంతు ॥కా॥

నిను పూజించుట నా వంతు
నాకా ఫలము నొసగుట నీ వంతు ॥కా॥

సరోజాలొసగుట నా వంతు
నన్ను నీలో చేర్చుకొనుట నీ వంతు ॥కా॥

## 120

ఇంతకన్న నేనేమి చేతును శ్రీరామా
నిన్ను పూజించుటకన్న నేనేమి చేతును ॥ఇం॥

పూలు తెస్తును మాల కట్టుదు పండ్లు
తెస్తును రుచిచూచి కాచి ఉందును ॥ఇం॥

సరోజాలు తెస్తును నీకు పీఠమమర్తును
హారతిస్తును నిన్నే నమ్మి ఉందును ॥ఇం॥

## 121

పదములు పట్టండి శ్రీరామచంద్రుని
పదములు పట్టి పావనము కారండి ॥ప॥

కరములు జోడించండి కరముల జోడించి
కృపానిధిని కైవల్యము కోరండి ॥ప॥

పాటలు పాడండి పాటలు పాడి
పావనమూర్తిని పరమ పదమును కోరండి ॥పా॥

సాష్టాంగాలు చేయండి సాష్టాంగాలు చేసి
సరోజాక్షునికి సర్వము అర్పించండి ॥సా॥

## 122

శ్రీరామచంద్రుడు నాపై దయలేకున్నాడోయమ్మ
నేనెవరికి చెప్పుదు నోయమ్మ ॥శ్రీ॥

సీతమ్మతో చెప్పుదామంటే ఆమె వినదాయె
రాముని పదములు ఒత్తుటే సరిపోయె ॥శ్రీ॥

పవనకుమారుని హృదయములో దాగిన
శ్రీరామచంద్రుడే నా దైవమని నమ్మాను ॥శ్రీ॥
సరోజ పుష్పాలు సీతమ్మకు ఇచ్చేను
నా మొర వినితల్లి శ్రీరామునికి చెప్పునేమో ॥శ్రీ॥

## 123

రామయ్య రాముడు మా అయ్య రాముడు
మా అయ్య రాముడు మము పాలించు రాముడు ॥రా॥
కారుణ్య రాముడు మా కౌసల్య రాముడు ॥రా॥
సత్యపాలకుడు మా సీతా ప్రియుడు ॥రా॥
భక్తుల పాలించు రాముడు మా పురాణ
పురుషుడు, పిలవగానే ఓ అనువాడు
మా అయ్య రాముడు ॥రా॥

## 124

ఊరేగింపు వచ్చింది ఊరంతా కళకళ
లాడింది కిలకిల నవ్వింది ॥ఊ॥
సీతారాములు హనుమంతునితో పూల
పల్లకిలో వచ్చుచున్నారు ॥ఊ॥
పడతులంతా నాట్యమాడి పాటలుపాడి
పూలను జల్లి హారతి పట్టగ ॥ఊ॥
రత్నకంబళులపైన సరోజాలు చల్లగ
ఆ శోభను చూచి సాష్టాంగాలు చేయను ॥ఊ॥

## 125

ఊయలలూగేను చిన్నారి రాముడు
కౌసల్యా తల్లి ఊయలలూపగ
నీలమేఘపు ఉరము మీదను
చెంగల్వ పూమాల జిగజిగ మెరయగ ॥ఊ॥

నీలమేఘపు మొలను గజ్జెలు కళకళ
లాడుచు ఘల్లు ఘల్లు మనగ ॥ఊ॥

జోజో జోజో జోజోజోజో జోలలు పాడి
జోకొట్టి రాముని నిద్ర పుచ్చగ ॥ఊ॥

సరసర లేచేను సరోజాక్షుడు
భక్తులంతా కాపాడమని కల రాగా ॥ఊ॥

## 126

రామ మంత్రము ఏమి మంత్రము
పలుక పలుక పలుకరించు పట్టాభిరామ మంత్రము ॥రా॥

రామ రామ రామ అనగ తీయగనుండు
కలకండ, చక్కెర, పాయసముకన్న తీయగనుండు ॥రా॥

ఏమి మంత్రము శ్రీరామ మంత్రము
ఎంత పలికిన అంత తీపి శ్రీరామ మంత్రము ॥రా॥

ఏమి మంత్రము సరోజాక్ష మంత్రము
సర్వవేళల సంతోషము నిచ్చు
సరోజాక్షు మంత్రము సరోజాక్షు మంత్రము ॥రా॥

## 127

రాముడు కనపడునో నాకు కనపడునో
ఎప్పుడు కనపడునో ఎట్లా కనపడునో
నీలమేఘుడు కళకళ లాడునో మిలమిల
లాడునో అజానుబాహుడు అభయహస్తుడో
విల్లు ధరించి ఉండునో ॥రా॥

సీతమ్మతో కనపడునో అంజనీసుతునితో
కనపడునో కోదండపాణిగా కనపడునో
కౌసల్య తనయుడుగా కనపడునో ॥రా॥

నా రాముని నేనెట్లు పూజింతునో
ఎట్లు కొనియాడుదునో సరోజాలే
ఇస్తునో సాష్టాంగాలే చేతునో ॥రా॥

## 128

రామ రామ సీతారామాని మనసార అనగలనే
కాని ఇంకేమి తెలుసు నాకు రామ ॥రా॥

వజ్ర వైఢూర్య కిరీటమివ్వలేను రామా
మనసార రామరామ సీతారామా అనగలనేగాని ॥రా॥

ముత్యాల మాలలు ఇవ్వలేను రామా
భక్తితో మల్లె మాలలు సమర్పించేను రామా ॥రా॥

సీతమ్మకు కాళందెలు చేయలేను రామా
అమ్మ పాదాలపై సరోజాలు మనసార చల్లేను రామ ॥రా॥

## 129

రాముని తలవవే మనసా
శ్రీరాముని పూజించవే మనసా ॥రా॥

కరుణను కోరవే మనసా
పాద కమలాలు పట్టవే మనసా ॥రా॥

రామ రామని భజించవే మనసా
శ్రీరాముని మనసార కనవే మనసా ॥రా॥

పరమ పదము పొందవే మనసా
సరోజ పుష్పాల పూజించవే మనసా ॥రా॥

దివ్య ప్రభువును ధ్యానించవే మనసా
దివ్యజ్ఞానము పొందవే మనసా ॥రా॥

## 130

నిన్ను నమ్మిన నాకు ఈ వేదన ఏమిటి
రామయ్యా ఈ తపన ఏమిటి రామయ్యా ॥ని॥

రామ రామ అన్న శాంతి చేకూరంట
చింత తీర్చు నాదు సీతామనోహరా ॥ని॥

అనాధరక్షక ఆపద్బాంధవా అయోధ్యరామ
అందుకో నా వందనాలు ॥ని॥

సరోజాక్ష రామా సమ్మతించు రామ
సదా స్మరించేను నిన్ను, సంరక్షించు రామ ॥ని॥

## 131

రాముని చరిత్రము వినరండి శ్రీరాముని
భజనలు పాడండి ||రా||

ఆంజనేయుని అడుగు జాడల నడవండి
శ్రీరాముని భజనలు పాడండి ||రా||

తోడునీడైన లక్ష్మణ స్వామిని తలవండి
శ్రీరాముని భజనలు పాడండి ||రా||

భరతుని భ్రాతృప్రేమను మనమున నిలపండి
శ్రీరాముని భజనలు పాడండి ||రా||

శ్రీరాముని చరితము పుణ్యకావ్యము
విడువక పలకండి సరోజాక్షుని పూజించండి ||రా||

## 132

కౌసల్య తనయుడు కోసలాధిపతి
కల్యాణరాముడు కాంతా మనోహరుడు ||కౌ||

వీరాధి వీరుడు కోదండపాణి తాటక
సంహారుడు దశరథనందనుడు ||వీ||

నా పాలి దైవము నే నమ్మినవాడు
నన్ను పాలించు నా శ్రీరామచంద్రుడు ||నా||

భక్తుల పాలించు పావనమూర్తి పాదాలు
పూజించాలి సరోజపుష్పాల ||భ||

# 133

రామా శ్రీరామ నిన్ను తలచిన ఏమి
ఆనందం నిన్ను స్మరించ ఎంత ఆనందం ॥రా॥

నిన్ను కనులారా కనిన ఆ ఆనందం వర్ణించ
నగునా రామా ఆ భాగ్యము నాకెప్పుడుకల్గు ఓ రామా ॥ని॥

నా పిలుపు విననగునా రామా నా ఆశ తీరునా రామా
ఆ ఆనంద భాగ్యము నాకు ఎప్పుడు ఓ రామా ॥నీ॥

ఈ తపన తీర్ప నన్నాదరించవా సరోజాక్షా
నీ స్మరణ విడువక స్మరింప చేయవా రామా ॥రా॥

# 134

రాముడొస్తాడు మా రాముడొస్తాడు
సీతమ్మతో కూడి రాముడొస్తాడు ॥రా॥

పూలు తారండి సీతారాములకు
మంచి మంచి పూలు తారండి ॥రా॥

పండ్లు తారండి సీతారాములకు
నైవేద్యమివ్వను రుచిగల పండ్లు తారండి ॥రా॥

నమస్కారాలు చేయండి సాష్టాంగ నమస్కారాలు
చేయండి సీతారాముల దీవెనలు పొందండి ॥రా॥

మాలలు వేయండి సరోజ పుష్పాల మాలలు
వేయండి సీతారాముల కనికరం పొందండి ॥రా॥

## 135

సన్మార్గము సత్యపాలనే శ్రీరామచంద్రుడు
శ్రీరామునే కొలవండి సత్యమే పలకండి ॥స॥

దయామయుడు ధర్మప్రభువే శ్రీరామచంద్రుడు
శ్రీరామునే స్మరించండి ధర్మమునే పాలించండి ॥ద॥

న్యాయమూర్తి నిర్వికారుడే శ్రీరామచంద్రుడు
శ్రీరామునే తలవండి న్యాయంగా ప్రవర్తించండి ॥న్యా॥

సత్య న్యాయ ధర్మమే మన శ్రీరామచంద్రుడు
సరోజాల పూజించండి ॥స॥

## 136

సృతి కలపండి రాగతాళ సృతి కలపండి ॥సృ॥

రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ అని
శ్రీరాగంతో పాటలుపాడి భజనలు చేయను ॥సృ॥

సీతారామ శ్రీరామ సీతారామ శ్రీరామ అని
తాళముతోటి భజనలు చేసి పాటలు పాడను ॥సృ॥

జయ జయ రామ జానకిరామ జగదోద్ధార
అని రాగముతీసి అందరితో కలసి పాడ ॥సృ॥

రాగ తాళ సృతితో కలసిన భజనే
సరోజాక్షుని చేరుదారని తెలియండి ॥సృ॥

# 137

కలలోనైనా కనపడవే శ్రీరామ
కరుణామయుడవు కాదా కౌసల్య తనయుడవు కాదా ॥క॥

కాచి కాచి నీకై కనులు కాయలు కాచెను
రామా కరుణించవా రామా ॥రా॥

కమలదళాక్షా వీర కపి పూజిత
జానకి ప్రియ జటాయు పూజిత ॥క॥

కరముల జోడించేను నీ పద కమలముల
పట్టేను సరోజాలుంచేను నీ పదకమలముల ॥క॥

# 138

పాహిమాం శ్రీరామచంద్ర పాహిమాం ॥పా॥
సుగుణాలవాల గుడాఖనిరాయ ॥పా॥
సూర్యవంశజ శౌర్యపుత్ర ॥పా॥
రఘుకులతిలక రఘువీర ॥పా॥
రావణ సంహార రఘువంశోద్ధార ॥పా॥
అజానుబాహు అరవిందలోచన ॥పా॥
అయోధ్యపాల ఆపద్బాంధవ ॥పా॥
ప్రతిదిన పూజిత ప్రజోద్ధార ॥పా॥
ప్రణమాం శ్రీరామ ప్రణమాం ॥పా॥
సరోజాక్షా రామ సర్వేశ్వర రామ ॥పా॥
సాష్టాంగాలు రామ సాష్టాంగాలు ॥పా॥

# 139

నా పూజలో లోపమేమి శ్రీరామ
నా భక్తిలో కొరత ఏమి
నాకు ఎరుక చేయవా నన్నేలు రామా ॥నా॥

నన్నేలు నన్నేలని ఎంత మొరపెట్టినా
నీకు వినరాదాయె నీ కొరత నాకు తెలియదాయె ॥నా॥

జాలిపడి నా జన్మ తరింపచేయవా
జగదోద్ధారా చరణాలుపట్టి శరణని వేడేను
నన్ను సంరక్షించవా సరోజాక్షా ॥నా॥

# 140

రాముని చెంతను సీతమ్మ సీతారాముల
చెంతను సౌమిత్రి ఆ రాముని పదముల
వ్రాలెను మారుతి ఏమి ఆనందము ఈ శోభను
తలచిన నా మదికి ఏమి ఆనందము ॥రా॥

నా మదిలో సీతారాములు నిలిచిరి
రామ రామ శ్రీరామ రామ రామ సీతారామ అని
స్మరణలు చేయుచు భజనలు
చేయగ పరవశించె నా మది ॥నా॥

నన్ను విడువడు నా సరోజాక్షుడు నా మదిలో
నిలుతురు నా సీతారాములు ॥రా॥స॥

# 141

పవళించు పట్టాభిరామ శృంగారముగా
సీతమ్మ వచ్చేను ॥ప॥

పట్టు పాన్పుపైన మల్లెలు చల్లారు
ఘుమ ఘుమలాడుచు శోభ నిచ్చేను ॥ప॥

మంచి నిద్రపోవయ్యా మైథిలినాధా
పాదాలు పట్టేను సీతమ్మతల్లి ॥ప॥

భక్తులంతా నీకు వింజామరలు వీచేరు
సంరక్షించు మమ్ము సరోజాక్షా ॥ప॥

# 142

ఘల్లు ఘల్లున గజ్జలు కట్టి నాట్యము
ఆడేను నా రాముని చెంత పదములు
పాడేను భక్తితోటి భజనలు చేసేను ॥ఘ॥

మంచి పండ్లు నైవేద్య మిచ్చేను
మంచి గంధము చక్కగ పూసేను
మల్లెపూల నా రాముని పూజలు చేసేను ॥మం॥

సరోజ పుష్పాల మాలలు వేసేను
సదా సదా స్మరణలు చేసేను
నా శ్రీరామచంద్రునికి సాష్టాంగాలే చేసేను ॥స॥

# 143

రామ రామ శ్రీరామ అని భజించరే
భజించి భజించి తరించరే
సీతారాముల విడువక కొలవరే ॥రా॥

శ్రీరాముని స్మరించ కల్గునే స్వర్గానందం
శ్రీరాముని సరోజాల పూజించరే ॥రా॥

పూజించి పూజించి తన్మయమొందరే
ఆ తన్మయములో స్వర్గానందమున్నది తెలుసుకొనరే ॥రా॥

# 144

రామ శ్రీరామ రఘురామ జయరామ ॥రా॥
రామ శ్రీరామ జానకిరామ జయరామ ॥రా॥
రామ శ్రీరామ మైథిలినాథా శ్రీరామ ॥రా॥
రామ శ్రీరామ వైదేహిప్రియ శ్రీరామ ॥రా॥
రామ శ్రీరామ భూపుత్రి పతి శ్రీరామ ॥రా॥
రామ శ్రీరామ కల్యాణరామ శ్రీరామ ॥రా॥
రామ శ్రీరామ సరోజాక్షిప్రియ శ్రీరామ ॥రా॥

# 145

రామ జయరామా జయ జయ రామా జయరామ ॥రా॥
భక్తులు పూజించిన నీ పాదములే మా పెన్నిధి ॥రా॥
నీ కరుణ చూపులే మాకు దీవెనలయ్యా ॥రా॥
నిను పూజించుటే మాకు పరమానందము ॥రా॥
నీవే తండ్రివి నీవే తల్లివి అన్నియు నీవే ॥రా॥
నిను నమ్ముటే మా ధ్యేయము సర్వము నీవే సరోజాక్షా ॥ని॥

## 146

గుహుడు పూజించిన నీ పాదాల నే
పూజించరాదా రామా ఆ భాగ్యమెప్పుడు
నా కబ్బునో శ్రీరామా ॥గు॥

శబరమ్మ పండ్లు నీకు తినిపించి నిన్ను
మైమరపింప చేసినది ఆ భాగ్యమెప్పుడు
నా కబ్బునో శ్రీరామా ॥శ॥

భక్తులందరూ నిన్ను పరవశింపచేసిరే
రామా సర్వదా నిన్ను తలచే నాకు
ఆ భాగ్యమెప్పుడు అబ్బునో సరోజాక్షా ॥భ॥

## 147

రామ రామ రామ రామ రామ రామ
రామ రామ రామయ్య రామ ॥రా॥

కౌసల్య రామ కల్యాణ రామ
కోదండ రామ కరుణామూర్తి ॥రా॥

దశరథ తనయ దానవమర్దన మమ్ము
దయతో చూడుము దయామయా ॥రా॥

రఘుకుల తిలక రామయ్య రామ
రక్షించ రావయ్య రామయ్య రామ ॥రా॥

సూర్యవంశజ సుగుణాలవాల సంరక్షించు
మమ్ము సరోజాక్ష రామ ॥రా॥

## 148

నిన్నేమని కొలవను నిన్నెట్లా పొగడను శ్రీరామ ॥ని॥

జననమొందితివి పుణ్యపురుషుడుగా
దశరథరాజు శోఖము తీర్చ ॥ని॥

ముద్దుబిడ్డవైతివి కౌసల్యతల్లి భాగ్యముపండి ॥ని॥

శృంగార రాముడైతివి సీతమ్మతల్లి పూజలు ఫలించ ॥ని॥

భక్తపాలుడైతివి భక్తుల మొరలు విని
పరమపద మొసగి ॥ని॥

నా మొరలు విని నన్ను కాపాడుమా
సర్వవేళల పూజించేను సరోజాక్షా ॥ని॥

## 149

ముదముతో నిన్ను మందారపూల పూజింతుమయ్యా
మన్నించయ్యా మము మన్నించయ్యా ॥ము॥

పరవశించి నిన్ను పలుమారు పూజింతుమయ్యా
మన్నించయ్యా మము మన్నించయ్యా ॥ప॥

ధ్యానించి నీకు తులసి మాలలు వేసేమయ్యా
మన్నించయ్యా మమ్ము మన్నించయ్యా ॥ధ్యా॥

భక్తించి కీర్తించి నిన్ను కమలాల పూజించేమయ్యా
మన్నించయ్య మమ్ము మన్నించయ్యా ॥భ॥

స్మరించి నిన్ను సరోజ పుష్పాల పూజించేమయ్యా
మన్నించయ్యా మమ్ము మన్నించయ్యా ॥స్మ॥

# 150

రాముని భజించరే శ్రీరాముని ధ్యానించరే
రాముని భజించి ధ్యానించి స్మరించి
మోక్షము పొందను ॥రా॥

రాముని కీర్తించరే శ్రీరాముని స్తోత్రించరే ॥రా॥

రాముని కీర్తించి స్తోత్రించి పూజించి
మోక్షము పొందను ॥రా॥

రాముని పూజించరే శ్రీరాముని
పరిపరి విధాల పూజించరే ॥రా॥

రాముని పూజించి సరోజదళాలు అర్పణచేసి
మోక్షము పొందను ॥రా॥

# 151

రాముని వెదికేమా శ్రీరాముని పదముల
పట్టను దశరథరాముని వెదికేమా ॥రా॥

భక్తితోటి పాటలు పాడి
చిటికెలు వేస్తూ భజనలు చేస్తూ ॥రా॥

పరవశముతో నర్తన చేస్తూ ఎల్లవేళల
విడువక స్మరణలు చేసి ॥రా॥

తీయ తీయని పండ్లను ఒసగి శ్రీరాముని
పాదాల సరోజాలర్పణ చేసి ॥రా॥

# 152

రామ రామ శ్రీరామ సుగుణాలవాల శ్రీరామ ॥రా॥

రామా నీవు దయకలవాడవే శ్రీరామా
మమ్మేలుకో దయామయ ॥రా॥

రామా నీవు కరుణామయుడవు కాదా
శ్రీరామా మమ్ము కనికరించవా కరుణామయా ॥రా॥

రామా నీవు భక్తపాలుడవే శ్రీరామా
మమ్ము పాలించవా భక్తపాలా ॥రా॥

రామా నీవు సర్వపాలుడవే శ్రీరామా
మమ్ము సదా పాలించవా సరోజాక్షా ॥రా॥

# 153

నిన్నే నే నమ్మినానయ్య రామయ్య
రామా నిన్నే నే నమ్మినానయ్య ॥ని॥
నీవే నా పెన్నిధని నీవే నావాడవని ॥ని॥
కనికరముతో కోరికలు తీర్చి కాపాడుదువని ॥ని॥
నీవే నా దైవమని నా వేదనను పాలించేవని ॥ని॥
సరోజాల పూజచేయ సంతసించి సంరక్షింతువని ॥ని॥

# 154

వరాలొసగే వరమాలక్ష్మి హారతి మంగళహారతి ॥వ॥
కనికరముచూపే కనకాంగి హారతి మంగళహారతి ॥క॥
దీవెనలొసగే దివ్యతేజస్విని హారతి మంగళహారతి ॥దీ॥
సదాసంతోషమొసగే సరోజాక్షి హారతి మంగళహారతి ॥స॥

## 155

పలికించు పలికించు నాచేత నీ నామము
రామా పలికి పలికి నేను పరవశమొందగ

వినిపించు వినిపించు నా చెవులకు
నీ నామము రామా విని విని నేను విశ్మయమొందగ ॥వి॥

పాడించు పాడించు నాచే నీ పాటలు పాడి
పాడి నేను తన్మయమొందగ ॥పా॥

తెలిపించు తెలిపించు రామా నీ స్మరణను
మించిన పెన్నిధి లేదని సరోజాక్షా ॥తె॥

## 156

రామ శ్రీరామ రామ రామ శ్రీరామ ॥రా॥

నీ పాదాలు పట్టుటే మా పని మము
పాలించుటే నీ వంతుకదా రామా ॥రా॥

నీ కరుణను కోరుటే మా పని మము
కరుణించుటే నీ వంతు కదా రామా ॥రా॥

నీ శరణు కోరుటే మా పని మాకు
శరణొసగుటే నీ వంతు కదా రామా ॥రా॥

నీ గుణముల పాడుటే మా పని
మమ్ము నీలో చేర్చుకొనుటే నీ వంతు కదా రామా ॥రా॥

నీకు సరోజా లొసగుట మా పని మమ్ము
సంరక్షించుట నీ వంతు కదా రామా ॥రా॥

# 157

శ్రీరాముని చరితము ఇంపైనది వినరండి
ఆశగా వినరండి ॥శ్రీ॥

ఋషుల కాపాడ బాల్యముననే రాక్షస
సంహారము చేసె శ్రీరాముడు ॥శ్రీ॥

సీతమ్మను చేపట్టె శ్రీరామచంద్రుడు
జగమెల్ల ఏలను ॥శ్రీ॥

కోటి ఋషుల కాపాడ సత్యపాలుడై
కోదండము పట్టను మా రాముడు ॥శ్రీ॥

దుష్ట శిక్షణ చేసి శిష్టుల రక్షించె
భక్తపాలుడై మా రాముడు ॥శ్రీ॥

సీతారాముల పూజించరే కోటి సరోజాల
ఎల్లప్పుడు సీతారాముల ॥శ్రీ॥

# 158

సప్తస్వరముల నీ పాటలు పాడి నిన్ను పొగడ
నా మనము శోభిల్లునుగా రామా శోభిల్లునుగా ॥స॥

రాగ తాళ భావముతో నీ పాటలు భజనలుచేయ
నా మనము శోభిల్లునుగా రామా శోభిల్లునుగా ॥రా॥

సర్వమర్పించి సరోజ పుష్పాల పూజలు చేయ
నా మనము శోభిల్లునుగా రామా
నా మనము శోభిల్లునుగా ॥స॥

# 159

నగుమోము నీ నగుమోము నా కెన్నడు
దొరుకును రామా నీవే దొరవని నమ్మిన నాకు నీ ॥న॥

నవ్వు నవ్వుతా సీతమ్మతో నవ్వు నవ్వుతా
నీ సుందర రూపము నా కెన్నడు దొరకును రామా ॥న॥

కిలకిల నవ్వుతూ భక్తుల పాలించే
నీ కిలకిల నవ్వు నా కెప్పుడు దొరకును రామా ॥న॥

చిరునవ్వు నవ్వే చంద్రవదనము చూచి
సరోజాలర్పించి సర్వమర్పించ కాచి ఉన్న నాకు ॥న॥

# 160

శ్రీరామచంద్రుడంటాను మా రాముని
అయోధ్యపాలుడంటాను ॥శ్రీ॥

సీతామనోహరుడంటాను మా రాముని
శృంగార రాముడంటాను ॥శ్రీ॥

తాపస రక్షకుడంటాను మా రాముని
కోదండపాణంటాను ॥శ్రీ॥

లక్ష్మణ ప్రియుడంటాను మా రాముని
లావణ్య రాముడంటాను ॥శ్రీ॥

సరోజాక్షుడంటాను మా రాముని
సంరక్షకుడంటాను ॥శ్రీ॥

# 161

ఏమిటి రామయ్య నీవు పలుకరావు మమ్మేలరావు ॥ఏ॥

ఏమౌను పలికిన నీ సొమ్ము పోవునా ॥ఏ॥

నీ పలుకే బంగారమని నీ పిలుపే మా
పెన్నిధని నమ్మి ఉన్నామయ్యా ॥ఏ॥

ఏమేమో తలచాము సరోజాల తెచ్చి ఉంచాము ॥ఏ॥

# 162

రామయ్య రాముడు శ్రీరామచంద్రుడు
రమ్మంటే ఆ అను మా అయ్య రాముడు ॥రా॥

సరోజాలిస్తాను సర్వమే అర్పిస్తా సదా నిన్ను
పూజిస్తా రమ్మంటే ఆ అను మా అయ్య రాముడు ॥రా॥

శబరమ్మకు పలికెనే అహల్యకు పలికెనే
నా మొరలు వినేను రమ్మంటే ఆ అను మా అయ్య రాముడు ॥రా॥

# 163

రామా నీ మహిమ తెలియ నా తరమా
రామా శ్రీరామ ఓ రామ ॥రా॥

కరుణించ కోరేను దయతో చూడ వేడేను ॥రా॥

శరణు రామా అనేను పాదాలే పూజించేను ॥రా॥

శబరికిచ్చిన ముక్తి అడిగేను
ఆంజనేయుని కిచ్చిన స్థాన మడిగేను ॥రా॥

శరణన్న నన్ను నీలో చేర్చుకో
సరోజ పుష్పాలు సమర్పించేను ॥రా॥

## 164

రామ రామ శ్రీరామ అంతా నీవే శ్రీరామ ॥రా॥

కండ్లులేని కబోధి కానరాక గుంటలో పడతాడు ॥క॥

కండ్లున్న మందమతి రామ రామ అనలేక
గుటకలు మింగ్రుతాడు ॥రా॥

ఏమి తెలియని వెర్రివాడు నిన్ను తెలియకనే
రామ రామ అంటాడు ॥ఏ॥

అన్ని తెలిసిన తిక్కవాడు సరోజాక్షుని
తెలియక తికమక ఔతాడు ॥రా॥

ఇది నిజము ఇది నిజము శ్రీరామా ఇది నిజము ॥రా॥

## 165

మేలుకో శ్రీరామ మేలుకోవయ్యా
సూర్యోదయమాయెను సుగుణాలవాల మేలుకోవయ్యా ॥మే॥

మేళ తాళములతోటి మేలుకొలుపు పాడేరు
స్వాగతమిచ్చేరు నీకు సరోజపుష్పాల మేలుకోవయ్య ॥మే॥

పాద పూజలు చేసేరు నీకు పాటలే పాడేరు
వినమని ఎన్నో విన్నపాలు చేసేరు మేలుకోవయ్య స్వామి ॥మే॥

పరమపావనుడవని నిన్ను పొగడి పొగడి పాడేరు
పాపముల బాపి పరమపద మొసగ కోరేరు మేలుకోవయ్యా ॥మే॥

# 166

కొక్కొరోకోయని కోడికూసె
సుప్రభాతము పాడరే శ్రీరామునకు
సుప్రభాతము పాడరే మగువలారా
సుప్రభాతము పాడరే ।కొ॥
కనకాంగితో కూడి కొలువు చేయవచ్చునట ॥సు॥
వాకిలలికి ముగ్గువేసి దారి అంతా సరోజాలు చల్లి ॥సు॥
భక్తుల విన్నపాలు విని శ్రీరాముడు మనల దీవించునంట ॥సు॥

# 167

రామ రామ శ్రీరామ మా ఆరాధనలందుకో శ్రీరామ ॥రా॥
దీపారాధన చేసేము రామా నీ దీవెనలే మేము కోరేము ॥రా॥
కర్పూరహారతి నిచ్చేము రామా నీ కరుణనే మేము కోరేము ॥రా॥
మంగళహారతి చేసేము రామా నీ మన్ననలే మేము కోరేము ॥రా॥
సరోజాల నిన్ను ఆరాధించేము రామ సర్వము నీకేఅర్పించేము ॥రా॥

# 168

రంగు రంగుల రాట్నాలము మేము శ్రీరామ ॥ర॥
ఆడిస్తే ఆడేము నీవు పాడిస్తే పాడేము
నీట ముంచినా మునిగేము పాలముంచినా మునిగేము ॥రం॥
దండాలేమో పెట్టేము దండించినా నీ దండన
స్వీకరించేము క్షమించినా నీ ప్రేమను పొందేము ॥రం॥
సరోజాలేమో అర్పించేము సంరక్షించినా
నీవే మాకు మము శిక్షించినా నీవే కదా శ్రీరామ ॥రం॥

## 169

కనుగొంటినయ్యా రామా నీవే నావాడవని
కనుగొంటినయ్యా కరుణానిధివని కనుగొంటినయ్యా ॥క॥

నీ పాదాలే నా పెన్నిధని కనుగొంటినయ్యా
రామా పరమపావనుడవని కనుగొంటినయ్యా కనుగొంటి ॥క॥

ఆంజనేయుని భక్తిసాధనే నా ధేయమని
కనుగొంటి రామా కనుగొంటినయ్యా కనుగొంటి స్వామి ॥క॥

రామా నీ స్మరణే నా సర్వస్వమని కనుగొంటి
సరోజాక్షా కరుణించు కరుణాకరా కరుణించు రామా ॥క॥

## 170

దుఃఖమును దూరము చేయను
రామ మంత్రమే మనుజా తెలుసుకో రామ మంత్రమే ॥దుః॥

కష్టముల కడతేర్చను రామ మంత్రమే మనుజా
తెలుసుకో శ్రీరామ మంత్రమే మనుజా ॥క॥

కలతలు తీర్చ మనస్సును కడుగను
శ్రీరామ మంత్రమే మనుజా తెలుసుకో రామ మంత్రమే ॥క॥

పావనమైన రామ మంత్రమే పరమపదమొసగును
తెలుసుకో మనుజా శ్రీరామ మంత్రమే ॥పా॥

సర్వవేళల సర్వావస్థల సరోజాక్షుని తలవవే
మనుజా సరోజాక్షుని తలవవే మనుజా ॥స॥

## 171

రామ రామ శ్రీరామ మా పెన్నిధివయ్యా శ్రీరామ ॥రా॥

రాముని సన్నిధి మా రాముని సన్నిధి నే
కోరే సన్నిధి మా పెన్నిధి ॥రా॥

రాముని భజన మా రాముని భజన నే
చేసే భజన మా రామ భజన ॥రా॥

రాముని ప్రార్థన మా రాముని ప్రార్థన నే
ప్రార్థించ ఫలమిచ్చు నా ప్రార్థన ॥రా॥

రాముని పూజ మా రాముని పూజ
సరోజాల పూజించ సర్వమొసగు నా పూజ ॥రా॥

## 172

నిను వీడక వేడేను వినయముతో
శ్రీరామచంద్ర మా రామచంద్ర ॥ని॥

నిను చూచే కనులు నా కివ్వు రామా
నీ పిలుపు వినే చెవులు నా కివ్వవయ్యా ॥ని॥

నిను భజించే భక్తి నా కివ్వు రామా
నిను కీర్తించే స్వరము నా కివ్వవయ్యా ॥ని॥

నీ స్మరణలే నాలో నిలుపుము రామా
నిను మరి మరి వేడేను కరుణించు సరోజాక్షా ॥ని॥

# 173

ఆదర్శ పురుషుడు అయోధ్యరాముడు
శ్రీరాముని భజనలు చేయండి
భక్తితో పూజలు చేయండి ॥ఆ॥

సత్యపాలుడు సూర్యవంశజుడు
శ్రీరాముని కీర్తన చేయండి భక్తితో కొలవండి ॥స॥

ధర్మపాలుడు దశరథ తనయుడు
శ్రీరాముని భజనలు చేయండి
భక్తితో పూజలు చేయండి ॥ధ॥

సర్వజ్ఞుడు సీతాపతి శ్రీరాముని
కీర్తన చేయండి భక్తితో కొలవండి ॥స॥

సర్వమంగళుడు సరోజాక్షుడు
శ్రీరాముని భజనలు చేయండి
కీరన పాడి సర్వము కోరండి ॥స॥

# 174

రామ రామ శరణు శ్రీరామ శరణు
జయ జయ రామ శరణు జగదభిరామ శరణు ॥రా॥
కౌసల్యా తనయ శరణు కారుణ్యా రామ శరణు ॥కౌ॥
దశరథ తనయ శరణు దయామయ శరణు ॥రా॥
పద్మనాభా శరణు పట్టాభిరామ శరణు ॥రా॥
సత్యపాల శరణు సీతాపతి శరణు ॥రా॥
సదా పూజిత శరణు సరోజాక్షా శరణు ॥రా॥

## 175

దశకంఠుని దునుమాడ్చిన దశరథ తనయా
రారా మమ్మేల సమయమాయెను రారా
దయామయా దాశరధి రారా రారా ॥ద॥

కోటి ఋషుల కాపాడిన కౌసల్య తనయా రారా
మమ్మేల సమయమాయెను రారా
కరుణామయ కౌసల్య తనయ రారా రారా ॥కో॥

భక్తుల పాలించిన భక్తశిరోమణి రారా
మమ్మేల సమయమాయెను పావనమూర్తి
పట్టాభి రామా రారా రారా ॥భ॥

సర్వము తెలిసిన సరోజాక్షా రారా
మమ్మేల సమయమాయెను రారా
సూర్యవంశజ సత్యపాల రారా రారా ॥స॥

## 176

శరణు మా అయ్య శరణు మా రామా
విభీషణునకు శరణొసగిన శ్రీరామా శరణు ॥శ॥

శ్రీరామ శరణు మా రామ శరణు శరణు
కోరేవారికి శరణొసగు శ్రీరామ శరణు ॥శ॥

శరణు కోరేవారికి అభయమిచ్చే రామా
నా కోర్కె తీర్చయ్య నే నీకు శరణాగతి రామా ॥శ॥

శరణొసగు రామయ్య నీ చరణాలు పూజించేను
సరోజ పుష్పాలొసగి సాష్టాంగాలు చేసేను ॥శ॥

# 177

శ్రీరాముని తెలుసుకొన చక్కని మార్గాలు ఉన్నవి
తెలుసుకో మనసా రాజమార్గాలున్నవి కనుగొను మనసా ॥శ్రీ॥

భజనలుచేసిన తెలుసు మనసార రాముని
తలచిన తెలుసు రాముని భక్తితో కీర్తించిన
తెలుసుకదా మనసా తెలుసు కదా ॥శ్రీ॥

శ్రీరాముని తెలుసుకొన స్మరణను మించిన
మార్గము లేదు సరోజాల పూజను మించిన
మార్గము లేదు తెలుసుకో మనసా ॥శ్రీ॥

# 178

శ్రీ గణేశ శరణం గణనాయక శరణం
విఘ్నేశ్వర శరణం వినాయక శరణం
శరణం శరణం అగ్రపూజిత శరణం
గౌరి తనయ శరణం సురగణ సేవిత శరణం॥

ఏకదంత శరణం లంబోధర శరణం
శరణం శరణం అగ్రనాయక శరణం॥

మోదక ప్రియ శరణం మూషిక వాహన శరణం
బిల్వ పూజిత శరణం సరోజ పూజిత శరణం
శరణం శరణం అగ్రపూజిత శరణం॥

# 179

రాముని నమ్మండి రఘునాధుని నమ్మండి ॥రా॥
రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ ॥రా॥
నీవే నా దైవము నిన్నే నే నమ్మాను అని ॥రా॥
నీ పాదాలు పట్టాను నీ పాదధూళి నా తల దాల్చాను ॥రా॥
రాముని నమ్మిన చింతలు లేవు
రాముని నమ్మిన శాంతి కల్గని ॥రా॥
రాముని పూజించ ఆనందమే కదా
సరోజా లర్పించ స్వర్గానందమే కదా ॥రా॥

# 180

రామా సీతారామా నన్ను బ్రోవ జాగేల ॥రా॥
నీ పాదాలు పట్టి పూజించ పావనమౌనని నమ్మినాను ॥రా॥
సీతారామా జానకిరామా శృంగార రామా
నన్ను బ్రోవమని వేడిన నాపై ॥రా॥
సరోజాలే నీ కిష్టమని నమ్మి నీ కర్పించ కాచున్నాను ॥రా॥

# 181

శ్రీరామ నిన్ను చూడను నా కాశాయెనయ్యా
నేనేమి చేతును రామా ॥శ్రీ॥
పిలిచిన పలుకవు కనపడవు
ఎంత వెదకినా అర్థము కాకున్నది ॥శ్రీ॥

రామా నీవే నావాడవని మనసార
తలచేను భజించేను కొనియాడేను వేడేను ॥శ్రీ॥

నిన్ను నమ్మాను సరోజాక్షా నీవే నా దైవమని
కరుణించి నా ఆశ తీర్చు రామా ॥శ్రీ॥

# 182

శబరమ్మ పిలిచిన పలికావే రామా
నే పిలిచిన ఏల వినరాదు రామ ॥శ॥

గుహరాజు నీ పాదాలు పట్టిన ఒప్పావే రామ
నా చేతులు చేసిన పాపము ఏమి రామ ॥గు॥

హనుమంతుని హృదయంలో దాగావే రామ
ఆ అదృష్టము నా కెప్పుడు కల్గు రామ ॥హ॥

నీ పాదాలనే సదా తలచే నాపై దయ చూపవా
సరోజాక్షుడివే నీకు మ్రొక్కెను వేయి మ్రొక్కులు ॥నీ॥

# 183

రంగవల్లులు దిద్దరే శ్రీరాముని సీతారాముని
మా రాముని పీఠమునకు ॥రం॥

బంగారు పీఠమునకు ముత్యములు అలంకరించి
కెంపులు బొట్టుపెట్టి నవరత్నాలు చుట్టుకట్టి ॥రం॥

ధగధగ మెరయుచుండ సీతారాములు కూర్చుండ
కృపాసాగరులకు సాష్టాంగాలు చేయ ॥రం॥

భక్తుల పాలించువారికి సరోజాలు అర్పించి
సర్వపాలక మమ్ము సంరక్షించమని కోరి కోరి ॥రం॥

## 184

రామ రామ రామ రామ ఏమిటయ్య
రామ రామ నన్ను ఏలవయ్యా రామ రామ
నీ భక్తురాలినే రామ రామ నన్ను మరువకు రామ రామ ॥రా॥

మల్లెలెన్నో తెచ్చా రామ నిన్ను విడువక
పూజచేతు నన్ను ఏలవయ్యా రామ రామ ॥రా॥

సంపంగలు తెచ్చా రామా సీతమ్మ జడలో
ముడువను నన్ను ఏలవయ్యా రామ రామ ॥రా॥

సరోజాలు తెచ్చా రామా మీ పాదాలు పూజించ
నన్ను మరువక ఏలవయ్యా రామ రామ ॥రా॥

## 185

దండాలు పెట్టిన దయచూడవా రామా
కోదండరామా అని కొలువవలెనా ॥దం॥

పదములు పట్టిన పాలించవా రామా
పట్టాభిరామా అని పాడవలెనా ॥ప॥

పూజలు చేసిన ఫలమొసగవా రామా
నిన్ను పుణ్యమూర్తి అని పిలువవలెనా ॥పూ॥

సాష్టాంగాలు చేసిన సంరక్షించవా రామా
సరోజాక్షా అని సర్వమర్పించ వలెనా ॥సా॥

## 186

వెదక వెదక నాకు లభ్యమాయెను శ్రీరామ
నామము లభ్యమాయెను నే తరించు
నామము లభ్యమాయెను ॥వె॥

రఘునందనుని నామము రమ్యమైన నామము
పలుక పలుక నన్ను పలుకరించు దివ్యమైన
నామము లభ్యమాయెను ॥వె॥

సీతాపతి నామము సుందరమైన నామము
స్మరించ స్మరించ నన్ను మైమరపించు
సరోజాక్షుని నామము ॥వె॥

## 187

అమృతం నే నెన్నుకొన్న శ్రీరామ భజనామృతం ॥అ॥
సాధనచేసి సాధనచేసి అనుభవించ
శ్రీరామభజన అమృతం ॥అ॥

రామ రామ శ్రీరామ రామ రామ
సీతారామ అన అమృతం ॥అ॥

రామ రామ జయరామ రామ రామ
జగదభిరామ అన అమృతం ॥అ॥

రామ రామ కౌసల్యరామ రామ రామ
కల్యాణ రామ అన అమృతం ॥అ॥

జై జై జై జై జానకిరామ జై జై జై జై
సరోజాక్షా అన అమృతం ॥అ॥

# 188

పండంటి శ్రీరామ నామము ఏమి రుచియో
పలుక పలుక ఎంత రుచియో ॥పం॥
అతిరసముకన్న మధురమైన శ్రీరామ నామము
ఏమి రుచియో పలుక పలుక ఎంత రుచియో ॥అ॥
రుచి చూచినకాని తెలియదు శ్రీరామనామ రుచి
ఏమి రుచియో పలుక పలుక ఎంత రుచియో ।పం॥
సరోజాక్షుని తలవ తలవ తెలుసు శ్రీరామనామ రుచి
ఏమి రుచియో పలుక పలుక ఎంత రుచియో ॥స॥

# 189

నీ సృష్టిసంతా చూడలేను రామా నేను
నీవు నా మదిలో నిలచిన నిన్ను చూడవచ్చుకదా ॥నీ॥
దయచూడుము నాపై రామా
ఈ చిన్న ఉపకారము చేయవయ్యా ॥నీ॥
రామ రామ అని తలచ తలచ
నా వెర్రి తలపుల మరపు చెయ్యి ॥నీ॥
నీ స్మరణ విడువక నా మదిని నిలిపి
స్వామి నన్ను సమ్మతించుము సరోజాక్షా ॥నీ॥

# 190

రాముడే మా రాముడు అనంతకోటిని
పాలించు అయోధ్య రాముడే మా రాముడు ॥రా॥
సత్యమును పాలించ అరణ్యములపాలై
సీతను అపహరించిన రావణుని చంపిన రాముడు ॥రా॥

ఎందరో భక్తులను పాలించి అందరిచే
పాదసేవ లందుకొని ప్రేమతో అభయమిచ్చిన రాముడు ॥రా॥

మల్లె జాజి సంపంగి సరోజాల పూజలందుకొని
సదా మమ్ము సంరక్షించు మా పూజ్య రాముడు ॥రా॥

# 191

నన్ను బ్రోవ నీకు భారమా సీతాపతి
నీ చరణాల నమ్మిన ॥న॥

ఎందరో భక్తుల బ్రోచినావు వారి భారము
కన్న నా భక్త పరిపాల ॥న॥

నీ చరణాల పూజించు చరణదాసిని
మైథిలి నాథా కరుణాకరా ॥న॥

నా పూజలందుకో సరోజాక్షా
నీ భక్తులలో నన్ను చేర్చుకోవా ॥న॥

# 192

మైథిలినాథుని మనస్సున నిల్పిన నా
మనస్సుకు పరమానందము కాదా ॥మై॥

కౌసల్యరాముని కొలువును తలచిన
నా కనులకు పండగకాదా పరమానందమే కాదా ॥మై॥

పరమపావనుని భజనలు వినిన చెవులకు
పండుగకాదా నా చెవులకు పరమానందమే కాదా ॥మై॥

సరోజాక్షుని స్మరణలు చేసిన
నా రోమ రోమమునకు పండుగకాదా స్వర్గానందమేకాదా ॥మై॥

# 193

రాగముతోటి భజనలు పాడిన
భక్తి పొంగును శ్రీరాముడు తెలియును ॥రా॥

రామ రామ శ్రీరామ రామ, రామ శ్రీరామా అని ॥రా॥

తధిగిణతోం తధిగిణతోం అని నర్తనచేస్తూ
భజనలు చేసిన రాముడు తెలియును ॥రా॥

చప్పట్లుకొట్టి తన్మయముతో భజనలు పాడిన
భక్తి పొంగును శ్రీరాముడు తెలియును ॥రా॥

రామ రామ శ్రీరామ నీవే మాకు సరోజాక్షని ॥రా॥

# 194

జానకిదేవమ్మ జాగేల చేతువే
శ్రీరామునితో చెప్పి మాకు వరము లిప్పించ ॥జా॥

జిగజిగ మెరిసేటి చీరెలు కట్టింతు
జాజిపూల నీకు తలలో ముడిపింతు ॥జా॥

సీతాదేవమ్మ శ్రీరాముపత్ని సౌమిత్రి
పూజిత నిన్ను మించిన దైవము లేదమ్మ మాకు ॥జా॥

సరోజాలమాల సంతోషముతో వేసేము
సాష్టాంగాలు చేసి మమ్ము సంరక్షించ కోరేము ॥జా॥

## 195

రామచంద్రులు నాపై అలిగెనేమోకదా
నే చేసిన తప్పేమో తెలియదాయెనాకు ॥రా॥

తప్పులెంచడు రాముడు కరుణామూర్తి కదా
నే చేసిన తప్పేమో తెలియదాయె నాకు ॥రా॥

నాపై దయ చూపని సీతమ్మా చెప్పమ్మా
సరోజాలెన్నో తెచ్చి నీ పాదాల ఉంచేను ॥రా॥

సీతారాములే నా ఇష్ట దైవాలని ఎంచాను
నే చేసిన తప్పేమో తెలియదాయె కదా ॥రా॥

## 196

రామ రామ శ్రీరామ రామ రామ సీతారామ ॥రా॥

సూర్యపుత్రుని పూజింతు సరోజపుష్పాల
సీతమ్మను పూజింతు సదా సుగంధపూల ॥రా॥

రఘురాముని పూజింతు రమ్యమైన పూల
రామ పత్నిని పూజింతు రంగు రంగుల పూల ॥రా॥

మహీపాలుని పూజింతు మల్లె జాజులతోడ
కౌసల్య కోడల పూజింతు కుంకుమ పసుపుతోడ ॥రా॥

జగదోద్ధారుని పూజింతు నేను జ్ఞానము ప్రసాదించ
జానకిదేవిని పూజింతు నేను జన్మ తరించ ॥రా॥

## 197

గజ్జలు గలగల మ్రోగేనమ్మ
నా రామచంద్రుడు పరుగున వచ్చేనమ్మ ॥గ॥

గోరు ముద్దలు తినేనమ్మ
పాల బుగ్గల నేను ముద్దు పెట్టేనమ్మ ॥గ॥

కౌసల్యతల్లి నీ భాగ్యమేమమ్మ
నీలమేఘునితోటి దోబూచులాడగను ॥గ॥

సరోజాల పాన్పుపై జోజో నా తండ్రి
భక్తులంతా నీకై కాచుంటారు స్వామి ॥గ॥

## 198

కలగంటిని కలగంటిని సీతారాముల
శృంగార శోభను కలగంటిని ॥క॥

సీతమ్మతల్లి శ్రీరామచంద్రుని
పదముల పట్టుట కలగంటిని ॥క॥

శ్రీరామచంద్రుడు సీతమ్మతల్లి తలలో
పూలు ముడుచుట కలగంటిని ॥క॥

శ్రీరామచంద్రుడు సీతమ్మతల్లికి
పండ్లు తినిపించగ కలగంటి ॥క॥

సీతారాములు ప్రేమతో భక్తుల
కోర్కెలు తీర్చుట కలగంటిని ॥క॥

సీతారాముల సరోజ పుష్పాల
బంతులాడునట్లు కలగంటిని ॥క॥

## 199

రామా నీ పదములే కావాలి
నా కింకేమివద్దు ॥రా॥

పదముల పట్టేను ఆనందపడేను
పదముల పూజించి పావనమౌదును ॥రా॥

పాదధూళి తలదాల్చేను తృప్తితో
తన్మయమొందేను రామ శ్రీరామ ॥రా॥

పాదాలు కడిగేను సరోజాలర్పించేను
సంతోషముతో సర్వమర్పించేను ॥రా॥

## 200

పావనమూర్తి పదముల పట్టరే
మన పాపము హరించు ॥పా॥

రాముని పాదముల పట్టరే
శ్రీరాముని చరణాల పట్టరే ॥పా॥

పాద సరోజముల గట్టిగ పట్టరే
విడవక పట్టరే ॥పా॥

పుణ్యమూర్తి పట్టాభిరామ
నీ పాదకమలములు మావేనని ॥పా॥

పట్టరే గట్టిగపట్టి నా పాపాల
హరించమని కోరరే ॥పా॥

## 201

సుగుణాలవాల సూర్యవంశ పుత్ర
చక్కని చుక్క శ్రీరామచంద్ర ॥సు॥

రఘుకుల తిలక రఘువంశోద్ధార
రాజీవలోచన శ్రీరామచంద్ర ॥ర॥

అరవిందలోచన అయోధ్య రాజ
ఆనందదాయక శ్రీరామచంద్ర ॥సు॥

నీకు సాష్టాంగాలయ్య సాష్టాంగాలు
సరోజ పుష్పాల సాష్టాంగాలు ॥నీ॥

## 202

అడవి పాలైనావు ఆటవికుల కాచావు
అభయహస్తుడవై అలరారినావు ॥అ॥

నీవేమి ఘనుడవు శ్రీరామ
నీ వెంత ఘనుడవు శ్రీరామ ॥నీ॥

కోదండము పట్టావు కోటి ఋషుల కాచావు
కరుణామూర్తివని కొనియాడబడినావు ॥నీ॥

కైక వరముల తలదాల్చి ధర్మపాలనచేసి
దయామయుడవని పేరొందినావు ॥నీ॥

సదా నిన్ను స్మరించు వరము నాకివ్వు
సరోజాక్షా ధర్మపాలక కరుణామూర్తి అభయహస్త ॥నా॥

# 203

అంజనేయుని ఆలింగనము చేసితివి
ఆ భాగ్యము నా కెప్పుడు కల్గు రామా ॥అం॥

వెర్రివెర్రిగా వింతకోరిక కోరలేదు రామా
మనసార నమ్మి భక్తిశ్రద్ధతో కోరేను రామా ॥అం॥

నీ దయ నాపై ఎప్పుడు కల్గునోకదా
నా ఆశ ఎప్పుడు తీరునో రామా ॥అం॥

సంరక్షక సరోజాక్షా సర్వము తెలిసిన
దేవ సాష్టాంగ నమస్కారము ॥అం॥

# 204

వెదకి వెదకి వేడి వేడి నీ స్మరణ
నిల్పుకొంటి నా మదిలో ఇంక నను
కరుణించుట నీ భారమే కదయ్య ॥వె॥

రామ రామ శ్రీరామ కరుణామయ అని
అనుభవించితి ఆనందం ఇంక నను
కరుణించుట నీ భారమే కదయ్యా ॥రా॥

నిను స్మరించి నిను కీర్తించి భజించి
పరమానంద మొందితి రామా ఇంక నసు
కరుణించుట నీ భారమే కదయ్య ॥రా॥

నను కరుణించుట నీకు భారమా
సరోజాక్షా భక్త పరిపాల దయామయ
కరుణా కటాక్షా ॥రా॥

## 205

ఒంటరిగా ఉయ్యాల లూగేమయ్యా
రామా సీతమ్మ వచ్చేను కాచుండవయ్యా ॥ఒం॥

జడలల్లి పూలు ముడిచి పాపటబొట్టు
చెవులకు జుంకీలుపెట్టి ముక్కుపుడక పెట్టి
రానున్నది రామ ॥ఒం॥

సరిగంచు పట్టుచీరె చక్కగాకట్టి
సరిగపూల రవిక సొంపుగా తొడిగి
నడుముకు వడ్డాణ్ణముతో రానున్నది శ్రీరామ ॥ఒం॥

పాదాల పసుపు పూసి పారాణి పెట్టి
కాలందెలు ఘల్లుఘల్లు మన సీతమ్మ
వయ్యారముగా వచ్చేను ॥ఒం॥

మీ ఇరువురి శృంగారమే భక్తుల
శృంగారము కావుమయ్య మమ్ము
సరోజాక్షా సాష్టాంగాలు మీకు ॥ఒం॥

## 206

ముళ్ళపందిరి మీద ఎక్కిన ముళ్ళు తగులును మనసా
మల్లెపందిరి మీద ఎక్కిన ఘుమఘుమ లాడును మనసా ॥ము॥

మంచి ఏదో తెలుసుకొని మసలవలయును మనసా
మనసార సరోజాక్షుని స్మరణచేసి
సౌఖ్యము పొందుము మనసా ॥ము॥

# 207

సీతారాముల కల్యాణోత్సవము చేయుదమా
ఘనముగ పల్లకి కట్టుదమా ॥సీ॥

ఘుమ ఘుమలాడే మల్లెలు తెచ్చి
సీతారాములు మెచ్చగ పల్లకి కట్టుదమా ॥సీ॥

పల్లకి కళకళలాడ కనకాంబరముల
మాలలు కట్టి పల్లకి అలంకరించుదమా ॥సీ॥

మామిడి తోరణాలు తులసీ మాలలు
శుభము కలుగ పల్లకిచుట్టు కట్టుదమా ॥సీ॥

ధగధగ మెరయ ముత్యాల వైఢూర్యాల
సరములు కట్టి కన్నులపండుగ చేయుదమా ॥సీ॥

సీతారాముల పాద సరోజాల సర్వమర్పించి
ఘనముగ స్వాగత మిచ్చెదమా ॥సీ॥

# 208

శ్రీరామచంద్రప్రభో నీ కిచ్చేనయ్యా పంచదార పాయసము
నా కివ్వవయ్యా నీ పాద కమలాలు పూజించ ॥శ్రీ॥

సీతమ్మతల్లీ నీ కిచ్చేనమ్మా చందవంక తలలో ముడువ
నా కివ్వమ్మా నీ చరణ కమలాలు సదా పూజించ ॥సీ॥

మీ పాదాలు పూజించ సరోజపుష్పాలు ఎన్నో
తెచ్చి ఉంచాను మీ పవిత్ర పాదాలు పూజించి
కనులద్ద నా కనులు కాచున్నాయి స్వామి ॥శ్రీ॥

## 209

రామ రామ శ్రీరామ జైజై రామ జానకిరామ
దశరథరామ శ్రీరామ జైజై రామ జానకిరామ
కౌసల్యతనయ శ్రీరామ జైజై రామ జానకిరామ
విశ్వామిత్ర ప్రియ శ్రీరామ జైజై రామ జానకిరామ
తాటక సంహార శ్రీరామ జైజై రామ జానకిరామ
అహల్య పూజిత శ్రీరామ జైజై రామ జానకిరామ
మారీచ సంహార శ్రీరామ జైజై రామ జానకిరామ
జటాయు పూజిత శ్రీరామ జైజై రామ జానకిరామ
వాలి సంహార శ్రీరామ జైజై రామ జానకిరామ
హనుమంతు పూజిత శ్రీరామ జైజై రామ జానకిరామ
రావణ సంహార శ్రీరామ జైజై రామ జానకిరామ
సరోజ పూజిత శ్రీరామ జైజై రామ జానకిరామ

## 210

పంచభక్ష్యముల ఇవ్వలేను రామ నీకు నేను
నీ పాదాలు పట్టేను రామ ॥పం॥

అమ్మకు సరిగా చీరెలు ఇవ్వలేను
రామ నేను అమ్మ చరణాలపై వ్రాలేను రామ ॥అ॥

పట్టుపాన్పు ఇవ్వలేను రామ నీకు నేను
నీ పవిత్ర నామము నిలిపేను నా మది రామ ॥ప॥

అమ్మకు ఆభరణాలు చేయించలేను
రామ నేను సరోజపుష్పాలర్పించేను చరణాల రామ ॥అ॥

## 211

సీతమ్మ మాయమ్మ వయ్యారి భామ
నీ శృంగారము కానివ్వు రాముడొచ్చేను ॥సీ॥

నీలమేఘుడమ్మ ఆజానుబాహుడు
భక్తుల పాలించు పావనమూర్తి వచ్చేను
సింహాసనముపై శ్రీరాముని ప్రక్కను కూర్చుండు
శోభను చూడ భక్తులు కాచున్నారు
శృంగారము కానివ్వుతల్లి ॥సీ॥

సరోజాక్షుడమ్మ సుందరాకారుడు సత్యపాలన
చేయు శ్రీరామచంద్రుడు వచ్చేను ॥సీ॥

## 212

రామ రామని అనరండి శ్రీరాముని మనమున తలవండి ॥రా॥

రామ రామన జిహ్వాకు పండుగ
శ్రీరాముని తలచిన మనస్సుకు పండుగ ॥రా॥

రాముని స్మరించ పరమానందము
శ్రీరాముని కనిన కనులకు పండుగ ॥రా॥

రాముని భజించ చేతులకు పండుగ
శ్రీరాముని కీర్తించ గొంతుకు పండుగ ॥రా॥

రాముని పదములు పట్టిన స్వర్గానందము
సరోజాక్షుని పూజించ వెలలేని ఆనందము ॥రా॥

## 213

భద్రాద్రిపై భద్రముగా కొలువైనాడు పట్టాభిరాముడు
రండి రండి తండోప తండములుగా పోదాము రండి ॥రం॥

విన్నపాలు విన్నవించి దీవెనలు పొందను
పరుగు పరుగున పోదాము రండి ॥రం॥భ॥

భజనలు కీర్తనలు స్మరణలు చేస్తూ
భక్తితో రాముని చేర పోదాము రండి ॥రం॥

మన రాముడు మన విన్నపాలు మన్నించునని
నమ్మి ఆశతో పోదాము రండి ॥రం॥

సరోజపుష్పాలు సమర్పించి సాష్టాంగాలు
వేయ గబగబ పోదాము రండి ॥రం॥భ॥

## 214

ఏమి ఈ శోభ ఎంత ఈ శోభ సీతారాముల శృంగారశోభ ॥ఏ॥

కౌసల్యతనయుడు కాంతామణి సీతమ్మకు
కాటుక దిద్దగ నాకు కనులపండగాయెను ॥ఏ॥

సీతారాములు బంతులాటతో కిలకిల నవ్వగ
నా కన్నులు మిలమిల లాడెను ॥ఏ॥

శ్రీరామచంద్రుడు సీతమ్మ పాదాల పారాణి
దిద్దగ నా కన్నుల ఆనందబాష్పాలు రాలెను ॥ఏ॥

సరోజాక్షుల శృంగార శోభను నా కనులార
చూడ నా కలలు పండెను నా పంట పండెను ॥ఏ॥

# 215

రామయ్య లాలి రఘురామయ్య లాలి
మా అమ్మను, ఊపేను ఊగయ్య లాలి ॥రా॥

నాలుగు గొలుసులకు నవరత్నాలు కట్టాను
హంసతూలికా తల్పమువేసి ఉంచాను ॥రా॥

పవళించు మా అయ్య పూలపాన్పుపైన
భక్తుల పాలించు చక్కని కలలు కంటూ ॥రా॥

ప్రొద్దున లేవగానే నీకు స్వాగతమిచ్చేరు
సరోజపుష్పాలిచ్చి నీకు సర్వమర్పించేరు ॥రా॥

# 216

రామ రామ శ్రీరామ పరమపావన శ్రీరామ ॥రా॥

గుహరాజు నీకు ఆతిధ్యమొసగి
పవిత్రుడాయెగా శ్రీరామ ॥రా॥

శబరిదేవి నీకు పండ్లు తినిపించి
పునీతురాలాయెగా శ్రీరామ ॥రా॥

పవనకుమారుడు నీ పదములపట్టి
పావనుడాయెగా శ్రీరామ ॥రా॥

విభీషణుడు నీ శరణుకోరి
పుణ్యాత్ముడాయెగా శ్రీరామ ॥రా॥

నా సరోజపుష్పాలు చేకొని నన్ను
నన్ను పవిత్రురాలుగా చేయవా శ్రీరామ ॥రా॥

## 217

రాగ తాళమున నీ కీర్తన నేను భక్తితో పాడేను
శ్రీరామ నీవు నాకేమిస్తువు రఘురామా శ్రీరామ ॥రా॥

కౌసల్యారామ కల్యాణరామ మాపాలి
దైవమా దయానిధి ॥రా॥

దశరథ తనయా దీనబంధు మము
కరుణించవా కరుణానిధి ॥రా॥

సర్వము తెలిసిన సర్వమంగళ మము
సదా సంరక్షించు సరోజాక్షా ॥రా॥

## 218

చింతలు ఏలనే మనసా శాంతిని పొందవే మనసా ॥చిం॥
దివ్యమైన శ్రీరామనామ సంకీర్తనలుండగ ॥చిం॥
శ్రీరాముని కొలవను భక్తను చక్కని దారి ఉండగ ॥చిం॥
స్మరణలు చేయగ చేయగ సరోజాక్షుడు సాక్షాత్కరించును ॥చిం॥

## 219

సరస్వతి భారతి భగవతి నమస్కారం
చదువులరాణి పుస్తకపాణి వీణాధారి నమస్కారం
పద్మలోచని పద్మాసని పద్మపూజిత నమస్కారం
సుందరాంగి సరోజాక్షి సంరక్షించు సరస్వతి॥

## 220

తెలిసి తెలియక తప్పులెన్నో చేసేము రామయ్యా
మము దండించక దరిచేర్చుకో రామయ్యా ॥తె॥

కావరముతో కనులు కానక తప్పులు చేసేము రామయ్యా
కనికరించి కౌగిలించుకో రామయ్యా ॥తె॥

మంచి చెడు తెలియని మూర్ఖులము రామయ్యా
మా మూర్ఖత పోగొట్టి మమ్మాదుకో రామయ్యా ॥తె॥

నిన్ను మా మనమున నిల్పుకొన చేతకానివారము రామయ్యా
మా మనమున సాక్షాత్కరించు సరోజాక్షా ॥తె॥

## 221

రామయ్యను మరువక కొలవండి
శ్రీరామయ్యను మరువక కొలవండి
మనల పాలించు రామయ్యను మరువక కొలవండి
నీవే మా దైవమని నమ్మి మరువక కొలవండి
నీవే మా దైవమని నమ్మి మరువక కొలవండి
ఎల్లవేళల విడువక కొలవండి
రామయ్యను మరువక కొలవండి
ఎల్లవేళల విడువక కొలవండి
రామయ్యను మరువక కొలవండి
సరోజపుష్పాలొసగి మరువక కొలవండి ॥రా॥

## 222

నీవు భక్తుల పాలించువాడవని నమ్మి
నే నిన్ను భక్తితో భజింతు శ్రీరామ ఓ రామ ॥నీ॥

నిన్ను స్మరించ స్మరించ సాక్షాత్కరింతువని
నమ్మి నేను నిన్ను సదాస్మరింతు శ్రీరామ ఓ శ్రీరామ ॥నీ॥

నిన్ను పొగడి కీర్తించ కనికరింతువని నమ్మి
నే నిన్ను ఎల్లవేళల కీర్తింతు శ్రీరామ ఓ రామ ॥నీ॥

నిన్ను ప్రార్థించి పూజించ పాపాలు హరించునని
నమ్మి నే సరోజాల పూజింతు శ్రీరామ ఓ రామ ॥నీ॥

## 223

రామ రామ శ్రీరామ సర్వము నీవే శ్రీరామ ॥రా॥
పలుకు పలుకు రామా అంటే పలుకునా రాముడు

భక్తితో తీయని పండ్లు తినిపించినగాని పలుకునా ॥ప॥రా॥
రావా రావా రామయ్య అంటే వచ్చునా రాముడు ॥రా॥
ప్రేమతో ఆతిధ్యమొసగి ఆరాధించినగాని వచ్చునా ॥రా॥
నీ పదములు కావాలి రామా అన్న ఇచ్చునా రాముడు
భక్తితో శరణుకోరి శరణాగతుడైనగాని ఇచ్చునా ॥రా॥
ప్రేమతో నన్ను నిమురవా రామా అన్న నిమురునా
రాముడు వెలలేని ఆశతో సేవచేసినగాని నిమురునా ॥రా॥
సర్వము నీకే సరోజాక్షా అన్న చేకొనునా రాముడు
భక్తి ప్రేమతో సర్వము అర్పించిన చేకొనుగాని ॥రా॥

## 224

శ్రీరామ నీచెంత చేరను దారి చూపవా
కరుణాకరా దారి చూపవా ॥శ్రీ॥

నిన్ను కాక ఇంకెవరిని అడిగేది దారి
చూపవా కరుణాకరా దారి చూపవా ॥శ్రీ॥

రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ
నీవే నాకు కరుణాకరా దారి చూపవా ॥శ్రీ॥

నన్ను మరవకు రామా నాపై దయచూపు
సరోజాక్షా కరుణాకరా దయచూపు ॥శ్రీ॥

## 225

ముత్యాల సరముల రథమునుకట్టి మైథిలినాథుని
కూర్చుండబెట్టి ప్రక్కన వైదేహిదేవితో
రథోత్సవము జరుపుదమా శ్రీరాముని దీవెన
పొందను దివ్యముగా రథోత్సవము జరుపుదమా ॥ము॥

భక్తి పారవశ్యమున పాటలు పాడుచు తన్మయతతో
భజనలు చేస్తూ సరోజపుష్పాల మాలలు వేసి
విడువక స్మరణలు చేస్తూ బంగారు గొలుసుల పట్టుకొని
రథమును ముందుకు లాగుదుమా
శ్రీరాముని దీవెన పొందను లాగుదుమా ॥ము॥

## 226

పావనమూర్తివి రామా నీవు నీ పదముల
పట్టేను రామా నేను నీ పదములే పట్టేను ॥పా॥

కరుణామూర్తివి రామా నీవు నీ కాళ్ళు కడిగి
కళ్ళ అద్దేను రామ నేను నీ కాళ్ళు కడిగి కళ్ళద్దేను రామా ॥క॥

చల్లనివాడవు రామా నీవు నీ చరణాల పూజించేను
రామ నేను నీ చరణాలే పూజించేను రామా ॥చ॥

సర్వపాలకుడవు రామ నీవు నే సాష్టాంగాలు చేసేను
రామ నీకు నే సరోజాలే అర్పించేను రామ ॥స॥

## 227

మొర వినవయ్యా శ్రీరామ నా మొర వినవయ్య
గలగల నీ పాద గజ్జెల సవ్వడి విని మురిపెముతో
నీ తల్లి ముద్దిడి పునీతురాలైన నీ చిన్న పాదాలే
నే నమ్మిన పాదాలు ॥మొ॥

తాటకను చంపి వీరుడవైరాగా నీ పదముల
చూచి దశరథుడు ఆనందపడిన నీ దివ్యపాదాలే
నే నమ్మిన పాదాలు ॥మొ॥

నా మొర వినవయ్యా శ్రీరామా నా మొరవినవయ్యా
నీ దివ్యపాదాలు నన్ను పూజించనివ్వు
సరోజాలు తెచ్చి కాచున్నాను ॥మొ॥

## 228

నిన్ను కానలేక అగ్నిపర్వతముగా పొంగుతున్నది
నా మది నీ చల్లని చూపుల చల్లార్చవా శ్రీరామ ॥ని॥

ఎక్కడున్నావయ్యా నేనేమి చేతునయ్యా
దయచూపవయ్యా దయామయా ॥ని॥

దీనులకు దిక్కు నీవేకదా శ్రీరామ ఓ
పరంధామ ఓ దాశరథీ ॥ని॥

ఎందు వెదకిన దొరికేవు సరోజాక్షా నా
సంకటము దీర్చి సంరక్షించు రామా ॥ని॥

## 229

తెలుసునా ఓ చెల్లెమ్మా తెలుసునా
నా రాముని మహిమ నీకు తెలుసునా ॥తె॥

భక్తులపాలిట కల్పతరువే ఓ చెల్లెమ్మా
మా రాముడు తెలుసుకో ఓ చెల్లెమ్మా తెలుసుకో ॥తె॥

సత్య న్యాయ ధర్మముల పాలించు సర్వేశ్వరుడు
మా రాముడు ఓ చెల్లెమ్మా తెలుసుకో ॥తె॥

సకలము తెలిసిన సర్వేశ్వరుడే మా సరోజాక్షుడు
తెలుసుకో ఓ చెల్లెమ్మా సాష్టాంగాలువెయ్యి
ఓ చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా ॥తె॥

## 230

కన్నుల పండుగాయెను నా శ్రీరామచంద్రుని
నా కలలో కనగా కన్నుల పండుగాయెను ॥క॥

నీలమేఘుని కోదండముపట్టి సీతమ్మతో
ఉండగా నా కన్నుల పండుగాయెను ॥క॥

నీలమేఘుని ఉరమున హారము జిగజిగ
మెరయ నా కన్నులు ధగధగ మెరసెను ॥క॥

శ్రీరాముని పాదాలు సరోజాల నిండి ఉండగ
మనసార పాదాలు కళ్ళద్ద నా కనుల పండుగాయెను ॥క॥

## 231

కలవరమెందుకు మనసా కనికరముతో
నిను కాపాడు కౌసల్య తనయుడు కావలి ఉండగ ॥క॥

కమలదళాక్షుని కరముల జోడించి
కాపాడ వేడుము మనసా ॥క॥

శ్రీరామచంద్రుడు సత్యపాలుడు
ధర్మపాలుడు భక్తపాలుడు లోకోద్ధారుడు ॥క॥

సరోజాక్షుని సర్వమర్పించి సాష్టాంగాలు
చేసి సదా కాపాడ వేడుము మనసా ॥క॥

## 232

శ్రీరాముడు పవళించె సీతమ్మ తొడమీద
కోకిలలు మధుర స్వరమున జోలలు పాడగ ॥శ్రీ॥

వృక్షములన్నీ వింజామరలు వీచె విశ్వమేలే
రామడు విశ్రాంతిగా పవళించ ॥శ్రీ॥

పుష్పములన్నీ పూచె సుగంధ వాసనలు
వెదజల్ల శ్రీరాముడు పవళించె పరవశించి ॥శ్రీ॥

సరోజాలన్నీ శ్రీరామునికి ఛత్రముగా
నిలిచె భక్తపాలునికి పరమానందము కలుగ ॥శ్రీ॥

# 233

రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ ॥రా॥
కౌసల్య లాలూచె కమలదళాక్షునకు ॥కౌ॥
దశరథుడు ముద్దాడె సత్యపాలుని ॥రా॥
సీతమ్మ పాదాలు ఒత్తె పరమపావనుని ॥రా॥
గుహరాజు పొగడె గుణఖని రాయుని ॥రా॥
శబరమ్మ పూజించె శాంతమూర్తిని ॥రా॥
హనుమంతుడు హృదయములో దాచె శ్రీరామచంద్రుని ॥రా॥
భక్తులంతా కొనియాడిరి కరుణాకరుని ॥రా॥
పూజించరే సదా ఎన్నో సరోజపుష్పాల ॥రా॥

# 234

జోజో జోగయ్య రామా జోకొట్టి నీకు జోల పాడేము లాలి
లాలి లాలి శ్యామలాంగా లాలి లాలమ్మ లాలి
కమలదళాక్షా సుందరాంగా ఆజానుబాహ సూర్యవంశజ ॥లా॥

భక్తులందరూ నీకు జోలపాడేరు
జోరుగా నిద్రపో సరోజాక్ష రామ ॥లా॥

## 235

తీయని పండ్లు నీకు తినిపించేము
రామా తీర్చవయ్యా మము నీ భక్తులుగా ॥తీ॥

నేతి భక్షాలు నీకు నైవేద్యమిచ్చేము
రామా నిల్పించవయ్యా మమ్ము నీ భక్తులుగా ॥నే॥

దండిగా నీకు దండాలు పెట్టేము
రామా దిద్దవయ్యా మమ్ము నీ భక్తులుగా ॥తీ॥

సాష్టాంగాలు పెట్టేము సరోజాలర్పించేము
రామా సరిగా దిద్ది మమ్ము సంరక్షించు స్వామి ॥సా॥

## 236

అశోకవనము నందుండి నీ భక్తుడు
ఆంజనేయునకు అగ్నిబాధ కలుగకుండా
కాచినావే సీతమ్మ తల్లి ॥అ॥

మమ్ము కావవా కమలదళాక్షి
కరుణాలవాల కౌసల్య కోడల ॥అ॥

సరోజాక్షి సుందరాంగి శ్రీరామపత్ని
భక్తుల కాచిన కనకాంగి సదా కాచు
మమ్ము నీకు సదా మ్రొక్కేము తల్లి ॥అ॥

## 237

రామ రామ నమోనమః సీతారామ నమోనమః
రామ రామ నమోనమః శ్రీరామ నమోనమః
సీతాదేవి నమోనమః శ్రీదేవి నమోనమః

పట్టాభిరామ నమోనమః పట్టపురాణి నమోనమః
అయోధ్యరామ నమోనమః అమ్మ సీతా నమోనమః
భక్తపాల నమోనమః భాగ్యరాశి నమోనమః
కన్నతండ్రి నమోనమః మా కన్నతల్లి నమోనమః
సర్వపాలన నమోనమః సరోజాక్షి నమోనమః

## 238

రఘునాధుని చేరరే చేతుల నిండా రంగు
రంగుల పూలతో పాదపద్మముల నిడ ॥ర॥

బుట్టల నిండా పండ్లు తట్టల నిండా భక్షాలు పాలు
నెయ్యి పెరుగు తేనె చక్కెర పంచామృతము చేకొని ॥ర॥

భక్తి పారవశ్యముతో భజన తన్మయత్వముతో
కీర్తించుచూ ఆనందముతో సర్వమర్పించ ॥ర॥

ధూప దీప కర్పూరహారతి చేసి సీతారాముల
సరోజపుష్పాల మాలలర్పించి కరుణకోర ॥ర॥

## 239

హారతి గైకొనుమా దశరథ తనయా
కోటి భక్తుల హారతి కరుణతో గైకొనుమా
కౌసల్యతనయ కోదండరామ ॥హా॥

కర్పూరహారతి కనికరముతో
గైకొనుమా మైథిలిప్రియ మమ్మేలుకోవా ॥హా॥

సర్వజనులు పాడేరు సర్వమంగళమని
సమ్మతించు మమ్ము సరోజాక్షా శ్రీరామా ॥హా॥

## 240

శాంతికి మార్గము శ్రీరామ మంత్రము
భక్తులు నమ్మిన ఈ రాజమార్గము ॥శాం॥

తెలియండి రామ రామయని పలకండి ॥తె॥

సందులు గొందులు పోకండి రాజమార్గములో
శ్రీరాముని కలవండి ॥తె॥

శ్రీరాముని మించిన దైవము లేదు
రామ మంత్రాన్ని మించిన మంత్రము లేదు ॥తె॥

సరోజాక్షుని కొలవండి సదా సదా
రామ రామ అవి పలకండి ॥తె॥

## 241

ఆంజనేయుడు శ్రీరాముని బంటు
శ్రీరాముని తోడు సౌమిత్రి ॥ఆం॥

వీరి అడుగుజాడల నడవండి
శ్రీరాముని సేవలు చేయండి ॥వీ॥

ఆంజనేయుడు సీత జాడ కనుగొనె
లక్ష్మణస్వామి శ్రీరాముని వీడక సేవచేసి ॥వీ॥

శ్రీరాముని సేవయే స్వర్గానందము
సాష్టాంగాలు చేసి సరోజాలర్పించండి ॥వీ॥

# 242

తల్లి సీతమ్మ ఓరకంట చూచె శ్రీరామచంద్రుని
సుందరవదనము నందన వనమున ॥త॥

ఏమి ఆనందము తల్లికి ఎంత ఆనందము ॥ఏ॥

పరుగు పరుగున వెళ్ళె గౌరమ్మ
కడకు రామచంద్రుడే తన భర్తగా ఆశీర్వదించమని ॥ఏ॥

సఖులతో చెప్పుకొనె తన ఆనందము వర్ణించి వర్ణించి ॥ఏ॥

సరోజాక్షి ఆనందమే భక్తులకు ఆశీర్వాదము ॥ఏ॥

# 243

భూపుత్రిని పూజించిన పుణ్యమెంతో కల్గును
సీతమ్మను పూజించిన చింతలన్నీ తీరును ॥భూ॥

॥సీతమ్మ సీతమ్మ మా పాలి దైవమా సీతమ్మ ॥సీ॥

జానకమ్మను పూజించిన జ్ఞానమెంతో కల్గును
సీతమ్మను పూజించిన చింతలన్నీ తీరును ॥సీ॥

మైథిలమ్మను పూజించిన మనశ్శాంతి కల్గును
సీతమ్మను పూజించిన చింతలన్నీ తీరును ॥సీ॥

వైదేహిని పూజించిన విజ్ఞానము కల్గును
సీతమ్మను పూజించిన చింతలన్నీ తీరును ॥సీ॥

సరోజాక్షిని పూజించిన స్వర్గానందమే కల్గును
సీతమ్మను పూజించిన చింతలన్ని తీరును ॥సీ॥

## 244

పలుకు పలుకున రామా అంటే పరవశమొందునుగా
రామా పరవశమొందునుగా నా మది పరవశమొందునుగా ॥ప॥

పలుకు పలుకునా సీతారామా అంటే
చింతలు తీరునుగా రామా చింతలు తీరునుగా
నా మది చింతలు తీరునుగా ॥ప॥

పలుకు పలుకున సరోజాక్షా అంటే
స్వర్గానందమేగా రామా స్వర్గానందమేగా
నాకు సర్వము చేకూరునుగా ॥ప॥

## 245

సన్నజాజులు పూచె ఘుమ ఘుమ లాడుచు
ఆ పూలు రామ పాదాల ఉంచ నా మదికి
కలిగె పరమానందము ॥స॥

గంగగోవు గుమ్మపాలు పిండె శ్రీరామునికై
ఆ పాలు పాయసము వండ నా మది
నిండె పరమానందముతో ॥గం॥

తేనెటీగలు తెచ్చె మకరందము శ్రీరామునికై
ఆ తేనె నైవేద్య మివ్వ నా మది
పొంగె పరమానందముతో ॥తే॥

సృష్టియంతా నీవేనని తెలియ
సరోజాక్షా సర్వము నీ కర్పించేను నను
దీవించు పరమానందముతో రామా ॥సృ॥

## 246

క్షణికమైన ఈ జన్మకై తాపత్రయ మేలనే
మనసా శ్రీరాముని తలవవే మనసా ॥క్ష॥

శ్రీరామ స్మరణ చేయ
తాపత్రయము తీరునే మనసా ॥క్ష॥

ఓ రామాయనమః అని తలచి తలచి
తాపత్రయము తీర్చుకో మనసా ॥క్ష॥

సరోజాక్షునికి సర్వమర్పించి
స్వర్గానందం పొందవే మనసా ॥క్ష॥

## 247

శ్రీరామచంద్రుని అరణ్యవాసము
సీతారాముల ఆనందవాసము ॥శ్రీ॥

ప్రకృతితోటి సరసాలాడిరి
శృంగారముతో కిలకిల లాడిరి ॥శ్రీ॥

పూలన్ని తెచ్చిరి బంతులు కట్టిరి
ఆనందముగా బంతులాడిరి ॥శ్రీ॥

కోకిలతో పాటలు పాడిరి
చిలకలతో నగువులాట లాడిరి ॥శ్రీ॥

భక్తులు సరోజపుష్పాల పూజించ
ఆనందమొంది అభయమిచ్చిరి ॥శ్రీ॥

# 248

రామ రామ శ్రీరామ శ్రీరామ శ్రీరామ
నీవేనయ్య శ్రీరామ మము కన్నతండ్రివి నీవేను ॥రా॥
నీవేనయ్య శ్రీరామ మము పాలించు దైవము నీవేను ॥రా॥
నీవేనయ్యా శ్రీరామ మము కనికరించేది నీవేను ॥రా॥
నీవేనయ్యా శ్రీరామ సరోజపుష్పాల పూజించునది నిన్నేను ॥రా॥

# 249

సీతమ్మ వెడలె శ్రీరామునితో కారడవులకు
శ్రీరామునిపై ఉన్న ప్రేమ భక్తితో ॥సీ॥

లక్ష్మణస్వామి వెడలె శ్రీరామునితో కారడవులకు
అన్నపై ఉన్న ప్రేమ భక్తితో తోడునీడగా ॥ల॥

ఋషులందరూ చేరిరి శ్రీరాముని కారడవులలో
భక్తి శ్రద్ధతో శ్రీరాముని పూజించ ॥ఋ॥

భక్తి ప్రేమ శ్రద్దతో పూజలే శ్రీరాముని చేరు
మార్గాలు తెలుసుకొనండి సరోజాక్షుని ॥భ॥

# 250

లక్ష్మణస్వామి వల్కలధారియై రామా నీకు పర్ణశాల
ఏర్పరచె పంచవటిలో నీమీది భాతృ ప్రేమతో ॥ల॥

సీతమ్మ నీ చేబట్టి నీతో అరణ్యము వచ్చే
నిన్ను తన పూజ్య పురుషుడుగా ఎంచి ॥సీ॥

శ్రీరామ అందరి సేవలు అందుకున్నావే
ప్రేమతో నా సరోజపుష్పాలు చేకొనవా రామా ॥శ్రీ॥

## 251

చిటపట చినుకులు రాలెను
పరుగున శ్రీరాముని సీతమ్మ హత్తుకొనెను
సీతమ్మ ఒరిగె శ్రీరాముని ఒడిలో ॥చి॥

ముసిముసిగా నవ్వెను చిలకమ్మలు
పురివిప్పి ఆడెను నెమళులన్నీ ॥చి॥

జోలలు పాడెను కోకిలలు
వింజామరలు వీచెను హంసలు ॥చి॥

సుఖముగ నిద్రించిరి సీతారాములు
దేవతలు చల్లిరి సరోజాలు ॥సు॥

## 252

శ్రీరామా నిన్ను భక్తితో పూజించు
భాగవతులకు నమస్కారము ॥శ్రీ॥

శ్రీరామా నిన్ను భక్తితో సేవించిన
పామరులకు నమస్కారము ॥శ్రీ॥

శ్రీరామా నీవే దైవమని నమ్మి కొనియాడిన
వారికి నమస్కారము ॥శ్రీ॥

నీకు నమస్కారము నిను కొలిచే
వారందరికి నమస్కారము ॥నీ॥

సరోజాక్షా నిన్ను నమ్మిన నా కోటి
నమస్కారాలు స్వీకరించు ॥స॥

## 253

కలముతో నీ పాటలు నే రాశేను శ్రీరామ
అవి భావముతో వ్రాయించేది నీవేకదా ॥క॥

గొంతెత్తి నీ పాటలు భజనలు చేసేను
శ్రీరామ భక్తితో భజింప చేయించేది నీవేకదా ॥గొం॥

నీవు నా దైవమని నే తలచేను శ్రీరామ
నీ నామ స్మరణలు నా మనమున నిలిపేది నీవేకదా ॥నీ॥

ఎన్నో మెట్లెక్కేను నిను చేరాలని సరోజాక్షా
నన్ను నీలో చేర్చుకొనగలిగేది నీవేకదా ॥ఎ॥

## 254

శ్రీరామ జయ జయ రామ జయ జయ రామ శ్రీరామ ॥శ్రీ॥

సీతమ్మ కూర్చుండె బంగారు పీఠముపై
చెలువలారా రండి అమ్మను శృంగారించను
శ్రీరాముడు వచ్చేను రారండి ॥సీ॥

పసుపు కుంకుమలు పనుగు జవ్వాజులు
మంచి గంధము పన్నీరు మల్లె జాజి
సంపెంగలు రత్న వైఢూర్యాలు కెంపులు పచ్చలు
అలంకరించను రారండి అమ్మను అలంకరించను ॥సీ॥

శ్రీరాముడు వచ్చేను అమ్మను చూడను
ఓర చూపులు చూచి మురిసిపోయేను
అమ్మ తలచేను తన పతి పుణ్యపురుషుడని
సరోజాక్షుల సంభోగమే లోక కల్యాణము ॥సీ॥

# 255

సీతమ్మ ఓ సీతమ్మ మా పుణ్యరాశి సీతమ్మ
సీతమ్మకు జడబిళ్ళ చేయించాలని ఉంది
నా చేతనౌనా చేతులెత్తి మ్రొక్కగలనేగాని ॥సీ॥

సీతమ్మకు ముక్కుపుడక చేయించాలని ఉంది
నా చేతనౌనా నా తల్లికి మొల్లలు అర్పించగలనేగాని ॥సీ॥

సీతమ్మ చేతికి గాజులు తొడిగించాలని ఉంది
నా చేతనౌనా నా తల్లిని మనసార కొలవగలనేగాని ॥సీ॥

సీతమ్మ నడుముకు వడ్డాణము చేయించాలని ఉంది
నా చేతనౌనా నా తల్లికి వందనాలు పెట్టగలనేగాని ॥సీ॥

సీతమ్మ పాదాలకు పట్టిగొలుసులు చేయించాలని ఉంది
నా చేతనౌనా తల్లి పాదాల సరోజాల పూజింతునేగాని ॥సీ॥

# 256

సీతారాముల గుడిలో గంటలు గణగణ
మ్రోగెను నా కాలి గజ్జలు గలగల లాడెను ॥సీ॥

సీతారాముల భజనలు తన్మయముతోనే
నర్తన చేసితి నా రాముని కనుల గాంచితి ॥సీ॥

నా గొంతులో శ్రీరామ శబ్దము గణగణ
మ్రోగెను పరవశించి భజన చేసితి ॥సీ॥

సీతారాముల సరోజమాలలు కనుల గాంచితి
సర్వమర్పించి సాష్టాంగము చేసితి ॥సీ॥

## 257

లాలి పాడండి అమ్మలారా లాలి పాడండి
శ్రీరామచంద్రునకు మీరు లాలి పాడండి ॥లా॥

ముద్దులొలుకు మురిపాల రాముడు పాలుత్రాగి
నిద్రకొచ్చాడు నీలమేఘుడు ॥లా॥

నిద్రలోన నవ్వేడు రాముడు ఆ నవ్వులే
మనకు దీవెనలౌను తెలియండి ॥లా॥

సరోజాక్షునకు జోకొట్టి జోలపాడి
తన్మయమొందను భక్తితో పాడండి ॥లా॥

## 258

అభయహస్త రాముడు అయోధ్యరాముడు
రామ పాద స్పర్శ కలుగగానే రాతి నాతి
ఆయెను పాదపూజ చేసి అహల్య పునీతురాలాయెను ॥అ॥

రాముని పాదముల కడిగి గుహుడు
పడవ దాటించెను ఆతిథ్యము స్వీకరించి
గుహుని స్వర్గానందపరచెను ॥అ॥

రామ పాదధూళి తల దాల్చి శబరి
తీయని పండ్లిచ్చెను ఎంగిలి పండ్లు తిని
రాముడు మోక్షమిచ్చె శబరికి ॥అ॥

శ్రీరాముని పాదాలు కడిగి సరోజాల
పూజించి భక్తులారా పొందరే
స్వర్గానందము పరమానందము ॥అ॥

## 259

ఏమి పూలాలంకరణ సీతారాముల పూలాలంకరణ ॥ఏ॥

మల్లెపూమాలలు మెరసె మైథిలినాధుని మెడలో
సన్నజాజులు మెరసె సీతమ్మ జడలో
పొన్న పూమాల మెరసె పట్టపురాణి మెడలో
సరోజదళాలు మెరసె శ్రీరాముని పాదాల ॥ఏ॥

రంగు రంగుల పూలు సుగంధ పూలు సీతారాముల
అలంకరణకు నే తెచ్చిన పూలు ॥రం॥

## 260

సమయమాయె సాకేత రామా భక్తులబ్రోవ ॥స॥

లేచిరావయ్యా దయామయ
సీతమ్మ నిను విడుచులేవయ్యా ॥స॥

భక్తులంతా నీ పాదాల పూజించ
సరోజపుష్పాల కాచున్నారు ॥స॥

నీవు బ్రోవకున్న మమ్ము బ్రోచువారెవరు
గబగబ రావయ్యా కరుణామయ ॥స॥

## 261

రామ రామని భజన చేయండి శ్రీరాముని మదిని తలవండి ॥రా॥
రామనామములోనఉంది అంతులేని ఆనంద మహిమ ॥రా॥
భజనలోనే భక్తిఉంది భక్తిలోనే భక్తిమార్గము తెలుసుకొనరండి ॥రా॥
సంతసముతో సరోజాక్షుని సర్వవేళల స్మరణ చేయండి ॥రా॥

## 262

సీతారాముల ఆనందశోభ అరణ్యశోభ ॥సీ॥

కోకిలలు శృతి కలిపె చిటికలు చిటికలు
వేసి భజనలు పాడ ॥సీ॥

గజ్జలు కట్టి నెమళులు నాట్యమాడె
సీతారాములు ఆనందమొంద ॥సీ॥

ఋషులందరు సరోజాలర్పించి పావనరామ
పుణ్యపురుష అని భజించిరి ॥సీ॥

## 263

సీతారాముల కల్యాణము చూడను
చూడను ముచ్చట ఔను ॥సీ॥

దివ్యతేజమున ప్రకాశించెను పెండ్లి
పీఠమున శ్రీరామచంద్రుడు ॥సీ॥

తోడుకొని వచ్చిరి తోడి చెలికత్తెలు
వయ్యారి నడకల వచ్చెను జానకి ॥సీ॥

గోదానము భూదానము సువర్ణదానము
వస్త్రదానము అన్నదానము కన్యాదానము
చేసెను జనకుడు ॥సీ॥

నవవధూవరులపై దేవతలు చల్లిరి సరోజాలు
శ్రీరామ కల్యాణమే సీతమ్మ కల్యాణమే
అని పాడెను మిధిలంతా ॥సీ॥

# 264

పట్టపురాణి పుత్తడిబొమ్మ కుందనపుబొమ్మ కౌసల్య కోడల ॥ప॥
బంగరుబొమ్మ భూపుత్రి మమ్మేలవమ్మ మైథిలిదేవి ॥బం॥
కోసలరాణి కమలదళాక్షి సరోజాక్షి సీతామహాలక్ష్మి ॥కో॥
పద్మదళాక్షి పరమపావని మమ్మేలవమ్మ మా పుణ్యరాశి ॥ప॥

# 265

దశరథసుత దయామయ దీనబంధు దండాలయ్యా
దండాలయ్య నీకు మా దండాలయ్య దండాలు ॥ద॥

జానకిప్రియ జగదోద్ధార జాగు చేయకు జోడించేము కరములు
జోడించేము కరములు నీకు మేము జోడించేము ॥జా॥

సరోజాక్షా సుందరాంగ సంరక్షించు సాష్టాంగాలయ్యా
సాష్టాంగాలు చేసేము నీకు మేము సాష్టాంగాలు
చేసేము సాష్టాంగాలు ॥స॥

# 266

చింతలు తీర్చు కోదండపాణి చెంతనుండగ
చింతలు ఏల మనసా చింతలు ఏల ॥చిం॥

చిగురించే చింతలకు అంతము
లేకున్నది మనసా ఓ మనసా ॥చిం॥

పట్టు వదలక పట్టాభిరాముని పదములు
పట్టవే మనసా ఓ మనసా ॥చిం॥

సంరక్షించు సరోజాక్షుడు చెంత ఉన్నాడు
చింతలు విడువవే మనసా ॥చిం॥

## 267

ఎంతటివాడు మా రాముడు
ఎక్కడ చూచిన మా రాముడు ॥ఎం॥

దశరథుని ఒడిలో మా రాముడు
తన కోరిక తీర్చిన మా రాముడు ॥ఎం॥

తాటకను చంపిన మా రాముడు
విశ్వామిత్రుని కోర్కె తీర్చిన మా రాముడు ॥ఎం॥

శివవిల్లు విరచిన మా రాముడు
సీతమ్మ మదిలోని మా రాముడు ॥ఎం॥

సరోజ పూజితుడు మా రాముడు
ఎల్లర రక్షించు మా రాముడు ॥ఎం॥

## 268

పూజించరే సౌభాగ్యవతి సీతమ్మను
పసుపు కుంకుమ పూల పడతులారా పూజించరే ॥పూ॥

పగడాల పీఠముపై సుందరాంగి సీతమ్మను
సొగసుగా కూర్చుండబెట్టి ॥పూ॥

పాదాలకు పసుపురాసి సొగసుగా
నగలలంకరించి పెద్ద కుంకుమబొట్టు పెట్టి ॥పూ॥

తలనిండ పూలు ముడిచి మెడలో
మల్లెల మాలలు వేసి పాదాల సరోజాల ॥పూ॥

సీతమ్మ మమ్ము మెచ్చ ఆనందముతో
మమ్ము దీవించు సౌభాగ్యవతులుగా ॥పూ॥

## 269

దారి శ్రీరాముని చేరు దారి రామ రామ
అన శ్రీరాముని దరి చేరు దారి ॥దా॥

సులభమైన దారి శ్రీరాముని స్మరించ
స్మరించ దగ్గరౌదారి ॥దా॥

భక్తులు చేకొన్న దారి పావనమైన దారి
పవిత్రమైన ముక్తికి దారి ॥దా॥

స్మరించి స్మరించి సరోజాలర్పించ
స్వర్గానంద మిచ్చు దారి ॥దా॥

## 270

ఉగ్గుపెట్టి లాలపోసి బొట్టుపెట్టి
దృష్టి తీసి మురిసిపోయెను
ముసిముసి నవ్వుల బాలను చూచి కౌసల్యతల్లి ॥ఉ॥

వీర నడక చూచి సత్యవచనము విని
ధర్మబుద్ధి కొమరుని చూచి గర్వపడె దశరథరాజు ॥వీ॥

తొడపై పరుండబెట్టుకొని పదములుపట్టి
శృంగారముతో ఆనందపరచి
ఉప్పొంగిపోయె సీతమ్మ తల్లి ॥తొ॥

పాద పూజలు చేసి ఆతిధ్యమొసగి
తీయని పండ్లు తినిపించి హృదయంలో
దాచుకొని పరవశించిరి సరోజాక్షుని భక్తులంతా ॥పా॥

# 271

పలుకే బంగారమైతే నేనేమి చేతునయ్యా
నీ పలుకే బంగారమైతే నేనేమి చేతునయ్యా
ఓ రామా శ్రీరామా రామయ్య రామ ఓ రామ ॥ప॥

వేచి వేచి నీ పలుకుకై ఇంకా వేడుకొందునయ్యా
నీవు భక్త పాలుడవు సరోజాక్షుడవు నీ పాదాలు
నే విడువనయ్యా నన్ను నీవు విడువకయ్యా ॥ప॥

# 272

కొండంత కోరికలు కోరలేదు రామా నీ
పాటలు నాచే పాడించిన అదే కోటి పదివేలు ॥కొం॥

నీ పాటలోని మాధుర్యము ఎనలేనిది రామా ॥కొం॥

దండకారణ్యావాసా ధర్మప్రభూ దశరథ తనయా
దయ చూపు నాపైన నీ పాటలు నాచే పాడించు రామ ॥కొం॥

సరోజపుష్పాలు నీకొసగి సంతృప్తి పొందేను ॥కొం॥

# 273

సేతువు కట్టెను వాయుపుత్రుడు
రావణుని చంపె శ్రీరామచంద్రుడు ॥సే॥

జానకిని తెచ్చె అంజనేయుడు
అగ్నిపరీక్ష చేసె శ్రీరామచంద్రుడు ॥సే॥

తల్లడిల్లిరి వానరులంతా
చల్లగ దీవించె సరోజాక్షుడు ॥త॥

రామ రామ శ్రీరామ శ్రీరామ జయ శ్రీరామ ॥రా॥

## 274

నేను నీ పాట పాడేను కల్యాణి రాగాన
కల్యాణరాముడవని కల్యాణ వైభోగమే
మా ఇంట వైభోగమే సీతాకల్యాణమే
శ్రీరామ కల్యాణమే ॥నే॥

పాట పాడి పాడి పరవశించేను పంతువరాళితో
పట్టాభిరామ పావనరామ నీ పాదాలు
పట్టేను పాలించుమయ్యా ॥ప॥

మరల మరల పాడేను మోహన రాగాన
మైథిలినాధునిపై గజ్జలు కట్టి నర్తన చేస్తూ
చిటికలు వేసి భజనలు చేస్తూ
మురిపముతోటి మురిసిపోతూ ॥మై॥

సాధించేను నిన్ను నేనని సారంగి రాగాన
సాష్టాంగాలు సరోజాక్షా సదా నీకు
సాష్టాంగాలు శ్రీరామ ॥సా॥

## 275

భక్తులపై నీ ప్రేమ ఎనలేని ప్రేమ రామ ఎనలేని ప్రేమ ॥భ॥
భక్తాగ్రేసరుడు ఆంజనేయుని ప్రేమతో
ఆలింగన మిచ్చావు గుహరాజుకు అతిథివైనావు ॥భ॥
చిన్న ఉడుతను నీవు ప్రేమతో నిమిరావు
ఎంగిలి పండ్లను శబరి నీకు తినిపించ తృప్తితో స్వీకరించావు ॥భ॥
సరోజపుష్పాలతో నీకొరకు వేచిఉన్నాను రామ
నీ భక్తులలో నన్ను చేర్చి స్వీకరించుము నన్ను శ్రీరామ ॥భ॥

# 276

జై జై జై జై శ్రీరామ జయ జయ జయ శ్రీరామ ॥జై॥

నక్షత్రాలలో వెలిగే చందమామగా
భక్తులలో వెలిగే శ్రీరామచంద్ర ॥జై॥

గణగణ లాడే గంటలలో శబ్దముగా
భక్తుల కంఠాల రామ శబ్దమా ॥జై॥

కటిక చీకటిలోని మిణుగుపురుగుగా
భక్తుల హృదయములోని దివ్యతేజమా ॥జై॥

పలుకు పలుకునా నీ నామమేగా
ఎక్కడ చూచినా సరోజాక్షుడేగా ॥జై॥

# 277

రామ రామ ఓ రామా నామీద కోపించకు
రామ నిన్నే నమ్మినానయ్యా ॥రా॥

దయచూపు స్వామి దండించకు
దయామయా ధర్మప్రభుడవు
ఎందరికో అభయమిచ్చిన
అభయహస్త శ్రీరామచంద్రా ॥రా॥

సర్వపాలక సరోజాక్షా సాష్టాంగాలు
చేసేను నా తప్పులు క్షమించి
కరుణ చూపు స్వామి ॥రా॥

## 278

నగుమోముకలవాని చూచేది నేనెప్పుడో
ఆ భాగ్యమెప్పుడో నాకాభాగ్యమెప్పుడో ॥న॥

చిరునవ్వుల చిద్విలాసుడు
సీతమ్మ మెచ్చిన శ్రీనివాసుడు ॥న॥

కళకళలాడు కమలదళాక్షుడు
కలతలు తీర్చే కరుణాకరుడు ॥న॥

సరోజపుష్పాల పూజించువాడు
నా మదిలోని శ్రీరామచంద్రుని ॥న॥

## 279

రామ రామ శ్రీరామ భక్తిప్రదాయ శ్రీరామ ॥రా॥

పంచభక్ష పరమాన్నము ఇస్తే నీకు నేను
భక్తి ప్రసాదిస్తువా నాకు నీవు శ్రీరామ ॥రా॥

కోటివిధాల పూజలు చేస్తే నీకు నేను
కృప చూపుతువా నాపై నీవు శ్రీరామ ॥రా॥

దండి దండిగా దండాలు పెట్టితే నీకు
నేను నీ దరి చేర్చుకొందువా
నన్ను నీవు శ్రీరామ ॥రా॥

సదా సదా సాష్టాంగాలు చేస్తే నీకు నేను
సరోజాలు నీకు నేను అర్పించ
సమ్మతింతువా నీవు శ్రీరామ ॥రా॥

## 280

పలుమారు నిను పిలువ నాకు పలుకులే బాలవు
పాలించవమ్మా నన్ను ప్రీతితోడ ॥ప॥

భూపుత్రి పద్మదళాక్షి పద్మావతి
పట్టపురాణి ప్రఫుల్లనేత్రి మా సీతమ్మతల్లి ॥ప॥

కాపాడుమమ్మ కమలదళాక్షి
కామాక్షి కోరికలు తీర్చే కౌసల్యాకోడలా ॥ప॥

సరోజదళాక్షి సుందరాంగి సుశీల
సుజాత సర్వపాలక సూర్యవంశపురాణి ॥ప॥

## 281

కరముల జోడించి వందనము చేయరే
శ్రీరాముని పాదాలకు భక్తితో వందనము చేయరే ॥క॥

సీతమ్మ మదిలోని పాదాలు
హనుమంతుడు విడువని పాదాలు ॥క॥

అహల్య పట్టిన పాదాలు
శబరమ్మ పూజించు పావన పాదాలు ॥క॥

గుహరాజు కడిగిన పాదాలు
విభీషణుడు శరణన్న పాదాలు ॥క॥

భక్తులు విడువక పూజించు పాదాలు
సరోజపుష్పాల పూజించి సాష్టాంగాలు చేయరే ॥క॥

## 282

ఒకసారి పిలిచిన పలికేవంట రామ
ఒకసారి నా కంటికి కనపడవా రామా ॥ఒ॥

కౌసల్య తనయుడవో నీలమేఘుడవో
కోదండపాణివో కమలదళాక్షుడవో ॥ఒ॥

నిను గనలేక నీ పిలుపు వినక
తల్లడిల్లుతున్నాను సరోజాక్షా శ్రీరామ ॥ఒ॥

భక్తపరిపాల సీతాపతి
భరత ప్రాణప్రియ శ్రీరామచంద్ర ॥ఒ॥

## 283

రామ రామ శ్రీరామ వీరాధి వీర
జానకిరామ జయరామ ॥రా॥

వెడలివచ్చె విజయుడై విశ్వామిత్రు
లక్ష్మణులతో తాటకను చంపి శ్రీరాముడు ॥రా॥

దారిలో రామ రామ శ్రీరామ అనుచు
అహల్య విముక్తురాలాయె శ్రీరామ నీ పాదస్పర్శకు ॥రా॥

శివ విల్లు విరచి శృంగార రాముడై
జానకిని చేపట్టె జగమెల్ల పొగడ ॥రా॥

విజయుడై వెడలివచ్చిన సరోజాక్షుని గని
దశరథ కౌసల్యలు ఉప్పొంగిపోయిరి
లోకకల్యాణ మగునని ॥రా॥

## 284

రామ రామ రామ రామ రామ రామ యన
పలుకవైతివి నీవు ఉలకవైతివి ॥రా॥

తీయని శబరమ్మ పండ్లు తిని
నన్ను మరచినావా రామా ॥రా॥

ఆంజనేయుని హృదయంలో దాగినావని
నేను విడవలేను రామా నిన్ను ॥రా॥

నా వినతి విని నీవు నన్ను సన్నుతించి
పలుకవయ్యా సరోజాక్ష శ్రీరామ ॥రా॥

## 285

రఘుకులతిలక రఘువంశ సుధ రఘునాయక
రావయ్య మమ్ము పాలించ రావయ్య ॥ర॥

పిలవగానే పలికేవంట
పరుగు పరుగున రావయ్యా ॥ర॥

రాజీవలోచన రామచంద్రప్రభూ
రఘునాథా రావయ్యా రావయ్య
పరుగు పరుగున రావయ్య ॥ర॥

మల్లెలు మొల్లలు సంపెంగలు
నీ పాదాల పూజించ సరోజాలు
తెచ్చాను రావయ్య ॥ర॥

## 286

శ్రీరామ నీ పాదాలు పూజించు భాగ్యము
నాకివ్వు ఆ భాగ్యము నాకివ్వు ॥శ్రీ॥

పాదాలు పట్టేను పాదాలు కడిగేను
ఆ పాదాల పూజించి కళ్ళద్ది పొంగిపోయెను ॥శ్రీ॥

నీ పాదాల తలవంచేను నీ పాదాలు మనమున
నిల్పి విడువక సరోజాల పూజించేను ॥శ్రీ॥

## 287

భజనలు చేయవే ఓ మనసా
భజనలు చేయవే మనసార భజనలు చేయవే ॥భ॥
అయోధ్యరాముని ఆపద్బాంధవుని ఆనందముతో ॥భ॥
కౌసల్యారాముని కరుణాకటాక్షుని కరముల జోడించి ॥భ॥
పట్టాభిరాముని పరమపావనుని పాదాలుపట్టి ॥భ॥
సరోజాలర్పించి సర్వమర్పించి స్వర్గానందముతో ॥భ॥

## 288

ఇనకుల తిలక ఇక్ష్వాకుల రాజా
ఇకనైన మాపై దయ చూపరాదా ॥ఇ॥

ఇంత పంతమేల దీనులైన దాసులపైన ॥ఇం॥
పంతాలకు తాళలేము స్వామి దయచూపుమయ్యా

దండాలుపెట్టి నిన్ను వేడేము స్వామి ॥ఇ॥
మాపై పంతాలు విడిచి పావనముచేయి సరోజాక్షా ॥ఇ॥

## 289

జానకిరామ జగదోద్ధార జయమంగళం
నీకు శుభమంగళం ॥జా॥

మైథిలినాథా మనోహర మహామంగళం
నీకు శుభమంగళం ॥మై॥

వైదేహిప్రియ వీరాధివీరా విజయమంగళం
నీకు శుభమంగళం ॥వై॥

సీతాపతి సరోజాక్షా సర్వమంగళం
నీకు శుభమంగళం ॥సీ॥

## 290

కుంకుమ పూజలు చేయండి
కౌసల్య కోడల కోరికలెన్నో కోరండి ॥కుం॥

పసుపు పూజలు చేయండి పట్టపురాణికి
పరమపదమునే కోరండి ॥ప॥

పుష్పాల పూజలు చేయండి
భూపుత్రికి భక్తి నిమ్మని కోరండి ॥పు॥

దండ లెన్నో పెట్టండి దశరథ కోడల
సౌభాగ్య మిమ్మని కోరండి ॥దం॥

మంగళహారతి పట్టండి
మైథిలిదేవికి మనమున దేవిని నిల్పండి ॥మం॥

సరోజపుష్ప మాలలు వేసి
సీతమ్మ తల్లికి సంతోషముగా పూజలు చేయండి ॥కుం॥

## 291

తంబూర మీటి శృతి కలిపి గజ్జలు కట్టి
న ర్తన చేస్తూ చిటికలు వేసి భజనలు చేస్తూ
శ్రీరాముని భ క్తితో కొలవండి తరించండి ||తం||

తంబూర మీటి శృతి కలిపి శ్రీరాముని
భజనలు పాడండి పరవశమొందండి ||తం||

గజ్జలు కట్టి చిందులువేస్తూ పరవశమున
నాట్యము చేయండి తన్మయమొందండి ||తం||

చిటికలు వేసి తన్మయముతో భజనలు
చేయండి సరోజాక్షుని తెలియండి ||తం||

## 292

వయ్యారి నడకల సీతమ్మ వచ్చేను
చంగల్వ పూమాలతో శ్రీరాముని కర్పించ ||వ||

వీరాధివీరుడు శ్రీరాముడు వచ్చేను
సంపంగి పూమాలతో సీతమ్మ మెడలోవేయ ||వ||

అందాలరాణి సీతమ్మను చూచి
అచ్చెరువొందె శ్రీరామచంద్రుడు ||అం||

కళకళలాడు కమలాలవంటి కనుదోయి చూచె
వంగపండువంటి ఆ పెదవుల చూచె
మిసమిసలాడు ఆ కెంపు బుగ్గల చూచె
చంద్రకాంతితో మెరయు సీతమ్మను చూచి
ఉప్పొంగిపోయె సరోజాక్షుడు ||వ||

## 293

రేయింబగలు నిన్నే తలచేము తిమ్మయ్య నిన్నే తలచేము ॥రే॥

శ్రీరాముని చేరు దారి తెల్పుదువని నిన్నే తలచేము ॥రే॥

సీతమ్మ నిన్ను తన కుమారునిగా చేకొనె ఆ దారి తెల్పుదువని ॥రే॥

శ్రీరామునిపై నీకున్న భక్తి ఏమిటో తెల్పుదువని ॥రే॥

సరోజాక్షులు నీలో చేరారు ఆ దారి
తెల్పు దయామయ తిమ్మయ్య ॥రే॥

## 294

రంజింప చేయవా శ్రీరామా నీ నామ స్మరణతో
నా మనస్సు రంజింప చేయవా ॥రం॥

ఓ రామ శ్రీరామ నా రామ దయామయ ॥రం॥

స్మరించ స్మరించ తన్మయమౌను
ఇంకా స్మరించ స్వర్గానందమే కదా ॥రం॥

సన్నుతించు సరోజాక్షా నీ నామమే నా పెన్నిధి ॥రం॥

## 295

రావయ్య రావయ్య మా ఇంటికి రావయ్య ॥రా॥

ఇల్లంతా అలికినాను ముగ్గులేసి అలంకరించా ॥రా॥

అమ్మను నీ ప్రక్కన కూర్చుండబెట్టి
పాదపూజ చేయ అందమైన పీఠమమర్చా ॥రా॥

సరోజపుష్పా లెన్నో తెచ్చి నీకు
స్వాగత మిచ్చి సర్వమర్పించేను ॥రా॥

# 296

వినరండమ్మ వినరండి అయ్యలారా
వినరండి శ్రీరాముని కథను వినరండి ॥వి॥

దశరథరాజు పుత్రకామేష్టి చేయగ
పుణ్యపురుషుడు జనించె పునర్వసున ॥వి॥

భరత లక్ష్మణ శత్రుఘ్నులకు అన్నగా
కౌసల్య నోముల పంట పండగ జనించె ॥వి॥

సత్యపాలుడై భక్తపాలుడై వీరాధివీరుడై
శత్రుసంహారుడై ధర్మస్థాపనచేసె ॥వి॥

రాముని పదములుపట్టి పరమపదము కోరి
సరోజపుష్పాల పూజలుచేసి ఆత్మానందం పొందండి ॥వి॥

# 297

పూలను కోయరే మాలలుకట్టి పూజలుచేయ
రమ్యమైన పూలను తెచ్చి రఘుపతికి
భక్తితో పీఠమలంకరించ ॥పూ॥

పంచరంగుల పూలనుకోసి భూపుత్రిని
భక్తితో పూజలుచేయ ॥పూ॥

తులసీదళాలు దండిగ తెచ్చి మారుతి
మెడలో హారము వేయ ॥పూ॥

సరోజపుష్పాలెన్నో తెచ్చి సీతారామాంజనేయులకు
పాదాల పూజ చేయ ॥పూ॥

## 298

జానకితల్లి జగన్మాత వేదన తీర్చమ్మ వేడుకొనేను ॥జా॥

ఆదరించమ్మ అందాలరాణి
శ్రీరామ పత్ని సీతమ్మతల్లి ॥జా॥

సీతమ్మతల్లి సుందరాంగి మమ్ము
నీలో చేర్చుకో భూపుత్రి ॥జా॥

భూపుత్రి పట్టపురాణి సౌభాగ్యమొసగు
తల్లి సరోజాక్షి ॥జా॥

## 299

పయనమైరి పల్లకిలో సీతారాములు
పసుపు పట్టువస్త్రములతో అయోధ్యకు ॥ప॥

పోయిరా మా అమ్మ పోయిరా తల్లి
భక్తితో పతి సేవచేసి సౌభాగ్యవతిగా వర్ధిల్ల ॥పో॥

అని వనితలు పాడిరి దీవించిరి దేవతలు
జనకరాజ సౌదామినులు
అప్పగించిరి సీతమ్మను శ్రీరామునికి ॥జ॥

అయోధ్య ఆహ్వానించె అతి ప్రేమ భక్తితో
సరోజ మాలలు సీతారాములు మార్చ
మంగళం పాడిరి వనితలంతా ॥అ॥

# 300

పండంటి నామము పట్టాభిరాముని నామము
పలుకగ పలుకగ పరవశమొందించు
శ్రీరాముని నామము ||పం||

మధురమైన ఈ నామము భక్తుల
ఆనంద పెన్నిధి విడువక పలికిన విందౌను
మదికి శ్రీరాముని నామము ||పం||

పావనమైన నామము పామరులకు
జ్ఞానమొసగు నామము సర్వవేళల తలచిన
మనల వేదుకొను సరోజాక్షుడు ||పం||

# 301

పూలను కోసేమా బుట్టల నిండా
చక్కగ పూసిన సుగంధ పూలను కోసేమా ||పూ||

సీతారాములు పరుండ వత్తురు
పాన్పు అమర్చి పాన్పుపై మల్లెలు చల్లను ||పూ||

సిగ్గులొలుకు సీతమ్మతల్లి సిగలో
సంపంగి పూలను శ్రీరాముడు ముడువను ||పూ||

శ్రీరామచంద్రుని పాదాలపై సరోజాలు
సీతమ్మ తల్లి శృంగారముతో ఆనందపరచను ||పూ||

సీతారాముల ఆనందమే
లోకకల్యాణమై శుభములు కలుగ ||పూ||

## 302

పవిత్ర జలాలు తెచ్చేను పాదాలు
కడిగి శిరస్సున దాల్చేను ॥ప॥

పూలను కోసేను సీతారాముల
పదముల భక్తితో పూజించేను ॥పూ॥

పండ్లను తెచ్చేను సీతారాముల
ప్రేమతో తినిపించేను ॥ప॥

మంగళహారతి నిచ్చేను
మన్నించమని మరి మరి కోరేను ॥మం॥

సాష్టాంగము చేసేను సరోజాక్షులకు
సర్వము భక్తితో అర్పించేను ॥సా॥

## 303

దండించిన నే తాళలేను శ్రీరామ
నాపై దయచూపి నీ దరి చేర్చుకోవయ్యా ॥దం॥

మందరను మన్నించావు కాకాసురునిపై
కరుణ చూపావు దయామయ దరిచేర్చుకో ॥దం॥

తప్పులు చేయుట మా ఖర్మ దయ చూపుట
నీ ధర్మంకదా దయామయ దరిచేర్చుకో ॥దం॥

సుగుణాలవాల సరోజాక్షా సుందరాంగా
సీతాపతి దయామయ దరిచేర్చుకో ॥దం॥

## 304

హారతి పట్టరే రామునికి
మంగళహారతి పట్టరే సీతమ్మకి ॥హా॥

జయ మంగళం నిత్య శుభమంగళం
సీతారాములకు శుభమంగళం ॥హా॥

కౌసల్య తనయునకు కర్పూరహారతి
మైథిలిదేవికి మంగళహారతి ॥హా॥

సర్వమంగళం సరోజాక్షా నీకు
సర్వమంగళం సీతారామ అని పాడ ॥హా॥

## 305

రామ రామ శ్రీరామ శ్రీరామా జయ శ్రీరామ ॥రా॥

సృష్టిలో ఉన్నది నీ రూపము శ్రీరామ
నీ నామస్మరణలో ఉన్నది సంతోషము ॥రా॥

భక్తిలో ఉన్నది పరమార్థము శ్రీరామ
నీ నామస్మరణలో ఉన్నది సంతోషము ॥రా॥

నిన్ను భజించుటలో ఉన్నది తన్మయత్వము
శ్రీరామ నిన్ను స్మరించుటలో ఉన్నది సంతోషము ॥రా॥

నిన్ను కీర్తించుటలో ఉన్నది పారవశ్యము
శ్రీరామ నీ నామ స్మరణలో ఉన్నది సంతోషము ॥రా॥

సరోజాల పూజించుటలో ఉన్నది స్వర్గానందము
శ్రీరామ నీ నామస్మరణలో ఉన్నది సంతోషము ॥రా॥

# 306

వందనాలు వైదేహిప్రియ నీకు
వందనాలు సాష్టాంగ వందనాలు ॥వం॥

విల్లు విరచి వైదేహిని పెండ్లాడి
లోక కల్యాణము చేసిన వీరాధివీర ॥వం॥

ఒకే బాణముతో రావణుని చంపి
ధర్మస్థాపన చేసిన ధర్మపాల ॥వం॥

తండ్రి మాట జవదాటక అడవిపాలై
సత్యపాలుడైన సరోజాక్షా ॥వం॥

# 307

జానకిదేవి వచ్చేను జలకమాడను
సువాసన వెదజల్ల పన్నీరు చల్లరే ॥జా॥

పసుపురాసి తల్లికి పట్టుచీరె కట్టి
పన్నీరు పూలను జడనిండ ముడువరే ॥జా॥

ముక్కుకు పుడక చెవుల జుంకాలు
మెడనిండ గొలుసులు చేతికి గాజులు అలంకరించరే ॥జా॥

వడ్డాణముపెట్టి వంకీలుపెట్టి
వైదేహికి పెట్టరే వజ్రకిరీటము ॥జా॥

పట్టపురాణి పుత్తడి బొమ్మను
సరోజాక్షుడు మెచ్చాలి మన కోరికలు తీరాలి ॥జా॥

## 308

గజ్జలు కట్టి నర్తన చేసిరి భక్తులంతా
శ్రీరాముని చేర పారవశ్యమున ॥గ॥

చిటికలు చేబట్టి చిందులేసి భజన చేసిరి
పామరులు పారవశ్యమున శ్రీరాముని చేర ॥చి॥

గొంతెత్తి భక్తితో కీర్తించిరి భాగవతులు
తన్మయత్వమున సీతారాముల చెంతచేర ॥గొం॥

సంకీర్తనలు పాడిరి సరోజాక్షుని పొగడి
సర్వజనులు సంతోషమున శ్రీరామునిచేర ॥సం॥

## 309

రాముని భజించరే సీతారాముల భజించరే ॥రా॥

కౌసల్యా తనయుని కైవల్యముకోరి
దశరథ తనయునకు దండముపెట్టి ॥రా॥

కౌసల్యా కోడల కుంకుమతో పూజించి
అయోధ్య రాణిని ఆనందపరచి ॥రా॥

సీతారాముల సంతోషపరచి
సరోజపుష్పాల పూజలు చేసి ॥రా॥

## 310

శ్రీరామ నామ మహిమ తెలియండి రామ రామని పలకండి ॥శ్రీ॥

పదిసార్లు పలికిన ఇంకా పలకాలనిఉండు
నూరుసార్లు పలికిన నీకు దగ్గరా శ్రీరాముడు ॥శ్రీ॥

వేయిసార్లు పలికిన వదలడు నిన్ను రాముడు
పదివేలసార్లు పలికిన పదిలముగా నీ మదిలోనిల్చు రాముడు ॥శ్రీ॥

పలికి పలికి పరవశము పొంది
పరమపదము కోరండి సరోజాక్షుని ॥శ్రీ॥

# 311

నాపైన దయచూపకున్నాడు శ్రీరాముడు
ఇంత పంతమేలనో తెలియకున్నదాయె ॥నా॥

దయ చూపలేదంటే అంజనేయుడు ఒప్పునా
కరుణలేని రాముడంటే శబరమ్మ మెచ్చునా ॥నా॥

నా తప్పులేమో నాకు తెలియకున్నది
నాపైన చిన్నచూపు ఏలనో నా రామునికి ॥నా॥

సర్వమర్పించగలనే కాని నేనేమి చేతు
సరోజాక్షా దయచూపు సదా నిన్ను పూజింతు ॥నా॥

# 321

మల్లెలు మొల్లల ॥పూజలుచేయరే మైథిలిదేవికి॥
మగువలారా భక్తితో ॥మ॥

కనకాంబరాల మాలలుకట్టి కౌసల్య కోడల జడలో ముడిచి
మగువలారా భక్తితోడ చామంతి పూల పీఠమమర్చి
సీతమ్మతల్లిని కూర్చుండబెట్టి మగువలారా భక్తితో ॥పూ॥

సర్వవేళల సౌభాగ్యముగా మము రక్షించు
సీతమ్మ తల్లికి పూజలు చేయరే సరోజాల
పూజలు చేయరే మగువలారా భక్తితో ॥పూ॥

# 313

రథముపై పూల రథముపై
మల్లెపూల రథముపై
సీతారాముల ఉత్సవ రథము వచ్చుచున్నది
హారతి పట్టండి మంగళహారతి పట్టండి ॥ర॥

మేళ తాళములతో నృత్యగీతములతో
చిటికలువేస్తూ భజనలు పాడుతూ
పారవశ్యముగ ఉత్సవము వచ్చుచున్నది
హారతి పట్టండి మంగళహారతి పట్టండి ॥ర॥

దీపకాంతులతో సుగంధవాసనలతో
సీతారాములు కళకళలాడుతు ఉత్సవ
రథమున వచ్చుచున్నారు సరోజాలర్పించి
హారతి పట్టండి మంగళహారతి పట్టండి ॥ర॥

# 314

సీతను వెదకుచూ రామలక్ష్మణులు
సేద దీర్చిరి చెట్టుక్రింద ॥సీ॥

పక్షులన్నీ దుఃఖముతో రామలక్ష్మణులకు
సేద తీర్చను రెక్కలతో విసురుతూ ॥సీ॥

కోకిలలు గానము చేసెను
రామలక్ష్మణుల మనస్సున కలతదీరి శాంతించ ॥సీ॥

సరోజాక్షా శ్రీరామా ఏమి దుఃఖము కలిగె
స్వామి అని ప్రకృతి అంతా దుఃఖించె ॥సీ॥

## 315

సరసాలాడుతు చదరంగమాడిరి
చక్కగ సీతారాములు ॥స॥

నే గెలిచితినని సీతమ్మ లేదు నేనే గెలిచితినని
శ్రీరాముడు చెంపమీద చిటిక వేస్తూ ॥స॥

బంతులాడిరి పూలచెండ్లతో
పకపకలాడుచు సీతారాములు ॥బం॥

నా చేతిలో ఉందనే సీతమ్మతల్లి లేదు నీ జడలో
ఉంది ముద్ద పూబంతి అనె శ్రీరాముడు ॥స॥

ఏమి సరసాలు ఏమి ఆనందము
సరోజాక్షుల ఆనందమే మన సౌభాగ్యము ॥స॥

## 316

ఆనందామృతము ఏమిటి శ్రీరామ నామ స్మరణే ॥ఆ॥

తలవండి పలకండి అనుభవించి
స్వర్గానందము పొందండి ॥ఆ॥

రామ రామ శ్రీరామ జయ జయ రామ
జానకిరామా అని అనరండి ॥ఆ॥

భజించండి కీర్తించండి సరోజాక్షుని
పూజించి స్వర్గానందం పొందండి ॥ఆ॥

## 317

ఏల నాపై అలుక తాపస రక్షక ॥ఏ॥

తపనలు తీర్చు దాశరథి ధర్మరక్షక దయామయ
పదములు పట్టేను పట్టాభిరామ
పరమ పదము కోరేను పుణ్యపురుష ॥ఏ॥

సర్వము ఏలే సరోజాక్షా సీతాపతి శ్రీరామచంద్ర ॥ఏ॥

## 318

రామ నీ వారము మేము మమ్మేలుకొని కాపాడుమయ్య ॥రా॥

రామా నిన్ను పూజించువారము మేము
మా పూజలందుకొని కాపాడు స్వామి ॥రా॥

రామా నిన్ను భజించువారము మేము
మా భజనలు స్వీకరించు స్వామి ॥రా॥

రామా నిన్ను విడువనివారము మేము
మమ్ము విడువక కావుము స్వామి ॥రా॥

రామా నీకు సరోజాలర్పించేము
మమ్ము నీవు చేరదీర్చుకోవయ్యా ॥రా॥

## 319

సీతమ్మ శ్రీరాముపత్ని కౌసల్యకోడల నమస్కారము ॥సీ॥
శ్రీరామా సీతాపతి దశరథ తనయ నమస్కారము
హనుమంత అంజనీసుత భక్తప్రదాయ నమస్కారము
సీతారామాంజనేయ సరోజపూజిత నమస్కారము

# 320

సీతారాములకు సేవలు చేసి నైవేద్యమిచ్చి
భజనలుచేయ ఆనందము పరమానందము ॥సీ॥

సీతమ్మతల్లిని అలంకరించి పసుపు కుంకుమతో
పూజించ ఆనందము పరమానందము ॥సీ॥

సీతారాములకు సీతాఫలాలు నైవేద్యమిచ్చి
విడెము అరగింపుచేయ ఆనందము పరమానందము ॥సీ॥

సరోజాక్షుల పరవశించి కీర్తించి భక్తితో
సదా భజించ ఆనందం పరమానందం ॥సీ॥

# 321

రామ రామ శ్రీరామ సరోజాక్షా శ్రీరామ ॥రా॥

దోగాడు రాముడు దోబూచులాడె
దశరథ కౌసల్యలతో ॥రా॥

కోదండరాముడు కోటి విద్యలు నేర్చె
గురువు వషిష్ఠుల వద్ద ॥రా॥

శృంగార రాముడు శివవిల్లు విరచి
సీతమ్మను పెండ్లాడె ॥రా॥

భక్తపాలుడు దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించె
పుణ్యపురుషుని పూజించిరి అందరు ఆశతో
సాష్టాంగముచేసి సర్వమర్పించిరి సరోజాక్షునికి ॥రా॥

# 322

రామ ప్రభో పట్టాభిరామ ప్రభో
మము పాలించుము మాంపాహి రామప్రభో ||రా||

రామప్రభో సీతారామ ప్రభో మము
సంరక్షించుము మాంపాహి రామచంద్ర ప్రభో ||రా||

రామప్రభో కరుణాలవాల ప్రభో
కావుమయ్య మమ్ము మాంపాహి రామప్రభో ||రా||

రామప్రభో సరోజాక్ష ప్రభో మా సాష్టాంగాలు
నీకు మాంపాహి శ్రీరామచంద్ర ప్రభో ||రా||

# 323

పడతులు బంతులు కట్టిరె పూలతో బంతులాడ సీతమ్మతో ||ప||
పరుగిడిరి పరుగిడిరి నందనవనమంతా ఆనందంతో ||ప||
కోదండముతో ఉన్న శ్రీరాముని చూచె సీతమ్మ అచ్చెరుగా ||ప||
ఇద్దరి కన్నులు కలిపెను ఇద్దరి మనసులు ఒకటై నిలిచెను ||ఇ||
దేవతలు ఆనందంతో పొంగిరి లోకకల్యాణమునకు నాంది
కుదిరెనని ||దే||
సిగ్గులొలుకుచు వయ్యారినడకలవెళ్ళె సరోజాక్షి గౌరమ్మపూజకు ||ప||

# 324

నా మనవిని వినవయ్యా నా మదిలో నిలువవయ్యా
రామ రామ రఘురామ నా రామ జయరామ ||నా||

నాపై కరుణను చూపవయ్యా నన్ను ఎప్పుడూ కావుమయ్యా
రామ రామ శ్రీరామ నా రామా జయరామ ||నా||

నావాడవు నీవయ్యా నా పెన్నిధిగా నిలువవయ్యా
రామ రామ సీతారామ రామ రామ జయరామ ॥నా॥

సరోజపుష్పాలు అర్పించేను సర్వము నీకే సమర్పించేను
రామ రామ దయామయ రామ రామ జయరామ ॥స॥

# 325

రామా నిన్ను నే నమ్మితి నిన్ను విడువను నేను ॥రా॥

భక్తపాలుడవని దయామయుడవని
కరుణాకరుడవని ధర్మపాలుడవని ॥రా॥

నీలమేఘశ్యామ అజానుబాహుడ
అభయహస్త శ్రీరామచంద్ర ॥రా॥

సరోజాక్ష రామా సర్వపాలుడవని
సర్వమర్పించేనే కాని విడిచేదిలేదయ్యా ॥రా॥

# 326

నా మది మెదలె రామా నీ కలవరముతో ॥నా॥
నా పాదాలు పరుగిడె రామా నీ గుడిచేర ॥నా॥
నా చేతులు సాగె సుగంధపూలపైకి ॥నా॥
నా మది నిలిచె రామ నీ స్మరణతో ॥నా॥
నా నోరు మెదిలె రామా నీ పాటలుపాడ ॥నా॥
నా కనులానందమాయె రామా నీ రూపు చూచి ॥నా॥
సరోజాక్షా సర్వేశ్వర సుగుణాలవాల సాష్టాంగముస్వామి ॥నా॥

# 327

ఊగేను ఊగేను ఉయ్యాల లూగేను
శ్రీరామచంద్రుడు ఊగేను ఊగేను ॥ఊ॥

మొలనూలు గజ్జెలు మెరుగుగా మెరయ
ఉరమున హారము తళతళ మెరయ ॥ఊ॥

చిద్విలాసుని చిరునవ్వుచూచి
కౌసల్యతల్లి మురిసి మైమరచి ఉండగ ॥ఊ॥

ముగ్గురు తల్లులు మురిపెముతోటి
జోలలుపాడి జోకొట్టి నిద్రపుచ్చగ ॥ఊ॥

సరోజపుష్పాల సరములు వ్రేలాడె
బంగరు తొట్టిలో పదిలముగా పరుండి ॥ఊ॥

# 328

పదిమంది నీ పాటలు పాడేరు రామా
మరి పదిమంది నిన్నే స్మరించేరు
ఇంకా పదిమంది నిన్ను భజించేరు
మరికొంతమంది నిన్ను కొలిచేరు
ఎంతోమంది నిన్ను భక్తితో పూజించేరు
నీ మహిమ పొగిడేరు ఎంతోమంది మహానుభావులు
నే చేసేను పూజ నీకు సరోజపుష్పాల
సాష్టాంగాలు నీకు రామస్వామి ॥ప॥

# 329

సీతమ్మను సింగారించిరి చెలికత్తెలు
శ్రీరాముడు మెచ్చ సొంపుగా ॥సీ॥

జడ అల్లిరి తళబిళ్ళ పెట్టిరి జడనిండా
సుగంధపూలు ముడిచిరి ॥సీ॥

పసుపు పూసిరి ముఖమున పెద్దబొట్టు పెట్టిరి
ముక్కున పుడక బులాసి పెట్టిరి ॥సీ॥

చందనము పూసిరి పట్టుచీరె కట్టిరి
నడుముకు వడ్డాణము పెట్టిరి ॥సీ॥

పాదాలకు పారాణిపెట్టి బంగరు గొలుసులు తొడిగి
చేతికి రవ్వల ఉంగరాలు పెట్టిరి ॥సీ॥

శ్రీరాముడు వచ్చె సీతమ్మ శృంగారము చూచె
అచ్చెరునొంది ఆనందపడె ॥సీ॥

మా రాముని ఆనందమే మా అందరి సౌభాగ్యము
పాదాల ఇడరే సరోజాలు ॥సీ॥

# 330

రాముడు మా రాముడు శ్రీరాముడు జయరాముడు ॥రా॥

మన రాముడు సత్యపాలుడు ధర్మపాలుడు భూపాలుడు ॥రా॥

మా రాముడు మేఘవర్ణుడు సరోజాక్షుడు సర్వపాలుడు ॥రా॥

మన రాముడు మైథిలినాథుడు మా ఇంటి రాముడు
మమ్మేలువాడు ॥రా॥

## 331

రామ రామ శ్రీరామ రామ రామ జయరామ ॥రా॥

రాముని కొలుచుటే నా కర్తవ్యము
శ్రీరాముని భజించుటే నా భాగ్యము ॥రా॥

రాముని తలచుటే నా తన్మయత్వము
శ్రీరాముని పూజించుటే నా పుణ్యము ॥రా॥

రాముని స్మరించుటే సర్వస్వము
శ్రీరాముని కొనియాడుటే నా కలవరము ॥రా॥

సరోజాక్షునే స్మరించెద కొనియాడెద
తలచెద భజించెద నా సర్వమర్పించెద ॥రా॥

## 332

విశ్వామిత్రుడు కన్నుగీటె విల్లు ఎక్కు పెట్టె
శ్రీరాముడు దేవతలు ఉప్పొంగిరి
దుష్టశిక్షణ శిష్టరక్షణ జరుగునని ॥వి॥

సీతమ్మ ఉప్పొంగె తననోము ఫలించెనని
సుగంధపూమాల చేకొని సరోజాక్షుని
ఎదుట నిలిచె వయ్యారముగ ॥సీ॥

మిథిలంతా పాడిరి మా సీతమ్మ పెండ్లికూతురాయెనే
శ్రీరాముడు పెండ్లికొడుకాయెనే అని
అక్షింతలు చల్లిరి వధూవరులపై ॥వి॥

## 333

రామ రామ శ్రీరామా అన ఏమి శోభ రామా
ఎంత శోభ రామా శ్రీరామ ఎంత శోభ రామా ॥రా॥

జానకిరామా సీతారామా అన ఏమి వింత
రామా ఎంత వింత రామా శ్రీరామా ఏమి వింత రామా ॥జా॥

పట్టాభిరామా పావనరామా అన ఏమి శాంతి
రామా ఎంత శాంతి రామా శ్రీరామా ఎంత శాంతి రామా ॥ప॥

సరోజ పూజలుచేయ నీకు ఏమి తృప్తి రామా
ఎంత తృప్తి రామా శ్రీరామా ఏమి తృప్తి రామా ॥స॥

## 334

నన్నేలువాడు నా రాముడు
నే పూజచేతు సీతాపతిని ॥న॥

దయచూపువాడు నా రాముడు
నే దండాలు పెట్టేది శ్రీరామునికి ॥న॥

కృపకలవాడు నా రాముడు
నే కాళ్ళు కడిగేది కోదండపాణికి ॥కృ॥

అభయహస్తుడు నా రాముడు
నా ఆరాధ్యదైవము అయోధ్యరాముడు ॥అ॥

సర్వపాలకుడు సరోజాక్షుడు
నే సర్వమర్పించేది సత్యపాలునకు ॥స॥

## 335

జోజో జోజో జోజో జోజో బాల నిద్రపో స్వామి ॥జో॥
నీలమేఘశ్యామ నిద్రపో నిద్రలో నీ నవ్వు చూడాలి స్వామి ॥జో॥
నీ తల్లి కౌసల్య ఊపి ఊపి నీకు అలసిపోయేను నిద్రపో ॥జో॥
సరోజాక్షా నిద్రపో నీకు జోలపాడేరు భక్తులంతా స్వామి ॥జో॥

## 336

తొలికోడి కూసె తెల్లవారెను స్వామి మేలుకో
రామయ్య మల్లెపూలు తెచ్చా నిన్ను పూజించను ॥తొ॥
కనకాంబరాలు తెచ్చా కలువపూల మాలలుకట్టి
నిన్నలంకరించి నా కనులార కాంచ ॥తొ॥
పొన్నలు ఉంచేను నీ పాదాలమీద
నీ పాదాలు కళ్ళద్ది నా పాపాలు పోగొట్టుకొన ॥తొ॥

## 337

కావుమయ్యా కావుమయ్యా కౌసల్యారామ
మమ్ము ఏలవయ్య ఏలవయ్య ఏకాంతరామ ॥కా॥
పలుకుమయ్యా పలుకుమయ్యా పట్టాభిరామ
మమ్ము పాలించు పాలించు పావనరామ ॥ప॥
వినవయ్యా వినవయ్యా వైదేహిరామ
మా విన్నపాలు విని వరము ఈయవయ్యా ॥వి॥
జాగేల జాగేల జానకిరామ జాగు చేయక
మమ్ము సంరక్షించు సరోజ పూజిత రామ ॥కా॥

## 338

పండుగ ఆయెను శ్రీరాముని పదములుపట్టి
పూజలు చేయగ పండుగ ఆయెను
నా మనముకు కనులకు పండుగ ఆయెను
ఎంతో పండుగ ఆయెను ॥పం॥

సీతారాముల నర్తనచేస్తూ కీర్తన భజనలు పాడగ
పండుగ ఆయెను మనముకు కనులకు
పండుగ ఆయెను ఎంతో పండుగ ఆయెను ॥పం॥

సరోజాక్షుల సంకీర్తనచేసి సాష్టాంగము చేయగ
పండుగ ఆయెను మనముకు కనులకు
పండుగ ఆయెను ఎంతో పండుగ ఆయెను ॥స॥పం॥

## 339

అయ్యో అనవేమి అయోధ్యరామ
కావుమయ్యా అని గీ పెట్టుతూఉంటే ॥అ॥

కనికరము లేనివాడవని నాకు తెలియదే
రామా దయకలవాడవని నేనమ్మినాను ॥అ॥

భక్తులకాచేటి పావనరామా పుణ్యపురుష
పట్టాభిరామ నీ పదముల పూజింతు శ్రీరామ ॥అ॥

సర్వపాలకుడవని నే నమ్మినాను సదా నన్ను
సంరక్షించు సాష్టాంగాలు సరోజాక్షా ॥అ॥

## 340

పాడేను ఆడేను పట్టాభిరామునికి
పదములే పాడేను నాట్యమే ఆడేను ॥పా॥

రామ రామ శ్రీరామ దయచూపు దాశరధీ
కరుణచూపు కౌసల్య తనయ అని ॥పా॥

జై జై రామ జానకిరామ జగదోద్ధార జానకిరామ
అని తాళమువేసి తధికిణతోం అని నాట్యమే ఆడేను ॥జై॥

## 341

భక్తులు నిన్ను కీర్తించి భజించి కొలిచే
భక్తులు వేచిఉన్నారు రావయ్యా శ్రీరామ
సీతమ్మను తోడుకొని రావయ్య మా అయ్యా రావయ్య ॥భ॥

సంపంగి మాలలు సరోజగుచ్ఛాలు నీ పాదాల
ఉంచి పరమపదము కోరవచ్చారు రావయ్యా ॥భ॥

దశరథ తనయా దయామయా దీనదయాళూ
ధర్మపాలక ధర్మప్రభూ నీ భక్తుల ఏల
వేగ రావయ్య దీనతతో వేడేరు రావయ్య రామయ్య ॥భ॥

## 342

సాధించరే శ్రీరాముని సన్నిధి సాధించరే ॥సా॥
రామ రామ శ్రీరామ అని స్మరించి స్మరించి ॥సా॥
సరోజాక్షుని సన్మార్గము సత్యమార్గము అనుసరించి ॥సా॥
సీతాపతి జగన్నాధ జయరామ అని స్మరించి ॥సా॥

## 343

శ్రీరామ ఓ శ్రీరామ మా ప్రార్థనలందుకో శ్రీరామ ॥శ్రీ॥

నిన్ను పూజించేము పుష్పాలతో శ్రీరామ
నిన్ను కొనియాడేము కీర్తనలతో ॥శ్రీ॥

నిన్ను భజించేము భక్తితో శ్రీరామ
నిన్ను స్మరించేము సర్వమర్పించి ॥శ్రీ॥

నిన్ను కలలో కనేము మైమరచి శ్రీరామ
నీ పూజలే మా పుణ్యము సరోజాక్షా
నీ ప్రార్థనలే మా పెన్నిధి సరోజాక్షా ॥శ్రీ॥

## 344

కోసలాదీశ కౌసల్య తనయ ఇదిగో
కర్పూరహారతి కరుణించు స్వామి ॥కో॥

మోహనాకార మైథిలినాథా ఇదిగో
మంగళహారతి మన్నించు స్వామి ॥మో॥

సుందరాకారా సరోజాక్షా నిత్యమంగళం
నీకు సర్వమంగళం స్వామి ॥సుం॥

## 345

పలుకవే మనసా పలుకవే రామ రామ శ్రీరామా అన పలుకవే ॥ప॥

పలుకు పలుకున రామ నామమే పలుకవే పరి పరి పలుకవే ॥ప॥

రమ్యమైన శ్రీరామ నామములో ఆనందమున్నది ॥ప॥

పలికి పలికి శ్రీరామ నామము సరోజాక్షుని చేరవే మనసా ॥ప॥

## 346

పూలమాలలు కట్టేరు పందిరి అలంకరించేరు
శ్రీరాముని కూర్చుండబెట్టిరి
సీతమ్మను తోడుకొనివచ్చిరి ॥పూ॥

గంధము పూసిరి పన్నీరు చల్లిరి
సఖులందరూ వచ్చి పూబెండ్లాడించిరి ॥పూ॥

ఆడిరి ఆడిరి పరమానందంతో ఆడిరి
సఖులందరూ నవ్విరి సీతారాముల శోభను
చూచి సరోజపుష్పాల మాలలు తెచ్చిరి
సీతారాముల అలంకరించిరి శుభమంగళం
పాడిరి లోకకల్యాణమునకు ॥స॥

## 347

దుష్ట రావణుని దునుమార్చె దశరథ తనయుడు
హేరామ శ్రీరామా అన ప్రాప్తించె పరమపదము ॥దు॥

సోదరవైరి వాలిని సంహరించె సీతాపతి
శ్రీరామా మన్నించన దొరికెగా స్వర్గానందం ॥సో॥

దుష్ట కాకాసురుని కనులొట్టచేసె కౌసల్యతనయుడు
కావుకావని శరణుకోర దొరికెగా కైవల్యము ॥దు॥

దయామయుడు దాశరథి దుష్టశిక్షణ
శిష్ట రక్షణ చేసిన సర్వపాలకుడు సరోజాక్షుడు ॥ద॥

## 348

రామ రామ శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
దశరథనందన శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
కౌసల్యతనయ శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
అహల్య పూజిత శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
సీతామనోహర శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
ఋషిజనసేవిత శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
వాలిసంహార శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
ఆంజనేయ ప్రియ శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
రావణ సంహార శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥
సరోజపూజిత శరణం శ్రీరామచంద్ర శరణం ॥రా॥

## 349

చిద్విలాసా శ్రీరామచంద్రా నాపై చిన్న చూపు
చూస్తే నేనేమి చేతునయ్యా నేనెటు పోదునయ్యా ॥చి॥

నా భజనలు వినరాదా నీకు రామా
నా ప్రార్థన మన్నించలేవా రామా
నాపై దయచూపకున్న నేనేమి చేతునయ్యా
నేనెటు పోదునయ్యా ॥చి॥

సీతమ్మ నీవైన చెప్పమ్మ సరోజాక్షునికి
సర్వమర్పించి సాష్టాంగము చేసి
దీనతతో ప్రార్థించేనని చిన్నచూపు వద్దని ॥చి॥

## 350

తళుకు బెళుకుల చిన్నారి చిలక జానకమ్మ
శ్రీరాముడు మెచ్చను అలంకరించెద రావమ్మ ॥త॥

నీ కాటుక కండ్లను చూచి రాముడు కలవరమొందాలి
నీ ఎర్రని పెదిమల చూచి రాముడు పరవశమొందాలి ॥త॥

నీ నున్నని బుగ్గల చూచి రాముడు బలే అనాలి
నీ సన్నని నడుమును చూచి సరోజాక్షుడు సంబరపడాలి ॥త॥

## 351

ఏమయ్యా రామయ్యా నా తప్పేమో తెలుపయ్యా
క్షమియించి నన్నెప్పుడు కాపాడు రామయ్య ॥ఏ॥

భక్తుల కాపాడే బంగారు రామయ్యా
భజియించెద నన్ను బాగా కావుమయ్య ॥ఏ॥

పరమ పవిత్రుడు పట్టాభిరామ నీ పదముల
నా కిచ్చి నా కోరిక తీర్చయ్య ॥ఏ॥

సంతోషముగ నిన్ను సరోజకుసుమాల సదా
పూజించెద నా తప్పు క్షమించు రామయ్య ॥ఏ॥

## 352

చక్కనిచుక్క సీతమ్మ నన్ను నీ చెంతన చేర్చుకో సీతమ్మ ॥చ॥
చెంగల్వరాణి సీతమ్మ నన్ను నీ చేదోడుగ చేసుకో సీతమ్మ ॥చ॥
దశరథ కోడల సీతమ్మ నన్ను నీ దాసిగ చేసుకో సీతమ్మ ॥చ॥
కౌసల్య కోడల సీతమ్మ నా కోర్కె తీర్చమ్మ సీతమ్మ ॥కౌ॥
సరోజాక్షి సీతమ్మా నేను నీకు సర్వమర్పించేను సీతమ్మ ॥చ॥

# 353

చిలకలకొలికివి సీతమ్మ నీవు మా రాముని పత్నివి సీతమ్మ ॥చి॥
మా రాముని అర్థాంగివి సీతమ్మ అయోధ్య రాణివి సీతమ్మ ॥చి॥
బంగారు బొమ్మవు సీతమ్మ నీవు మా భాగ్యరాశివి సీతమ్మ ॥చి॥
చల్లని తల్లివి సీతమ్మ నీ చల్లని చూపులు మాకు సీతమ్మ ॥చి॥
సరోజాక్షివి సీతమ్మ నీవు మాకు సౌభాగ్యమివ్వుము సీతమ్మ ॥చి॥

# 354

రాముని కొలవరే రాముని తలవరే
శ్రీరాముని పిలవరే రఘురాముని పూజించరే ॥రా॥

రాముని మనమున నిల్పి పూలను తెచ్చి
రామ రామ శ్రీరామ అని
రఘురాముని పూజించరే ॥రా॥

రామ రామ శ్రీరామా నీవేనయ్యా మా కయ్యా
నిను కొలిచేము పిలిచేము తలిచేము ॥రా॥

రాముని పదములుపట్టి ఫలముల నొసగి
సరోజాక్షుని మనమున తలచి రఘురాముని పూజించరే ॥రా॥

# 355

ఏమి ఆనందం ఎంత ఆనందం శ్రీరాముని చెంతన
సీతమ్మను చూడను ఏమి ఆనందం ఎంత ఆనందం ॥ఏ॥

శ్రీరాముని పదములవద్ద హనుమంతుని చూడను
ఏమి ఆనందము ఎంత ఆనందం ॥ఏ॥

సీతారామాంజనేయుల భక్తి పారవశ్యముగ
సరోజపుష్పాల పూజలు చేయగ
ఏమి ఆనందం ఎంత ఆనందం ॥ఏ॥

# 356

చిటపట చినుకులు పడుతూ ఉంటే
సీతమ్మ ఒడిలో శ్రీరాముని పడుకుని ఉంటే
పురివిప్పి నెమళులు ఛత్రము పట్టగ
ఏమి సొంపు ఈ శోభను చూడను ఎంతసొంపు ॥చి॥

చిటపట చినుకుల వానఝల్లుతో
మల్లె జాజులు ఘుమఘుమ లాడగ
సీతారాములు ఆఘ్రాణించి ఆనందము పొందగ
ఎంత సొంపు ఈ శోభను చూడను ఎంత సొంపు ॥చి॥

చిటపట చినుకుల వానలోనే
సీతారాముల ఆనందము చూచి
భక్తులంతా శోభను చూడను ఎంత సొంపు ॥చి॥

# 357

ఇనకుల తిలక ఇనవంశోద్ధార తీరుతెన్ను లేని
మమ్ము దయచూడవయ్యా మాకు దారి చూపయ్యా ॥ఇ॥

నీ దరి చేరు దారి చూపవయ్యా
వంకలన్నీ లేని నేరు దారి చూపయ్యా ॥ఇ॥

రఘు వంశోద్ధార రణధీర రావణ సంహార
రక్షించవయ్యా మమ్ము రక్షించు ॥ఇ॥

నీ దరిచేర సరోజపుష్పాలు కోకొల్లలుగా
తెచ్చాము నీ కర్పించి నీ దరిచేర ॥ఇ॥

# 358

పద్మదళాక్షుడు పుణ్యపురుషుడు పూలను
తేరండి పదముల నిడను రండి ||ప||
శ్రీరాముని పదముల నిడను రండి ||ప||

కమలదళాక్షుడు కౌసల్యా తనయుడు
కలువల తేరండి కాళ్ళన ఇడరండి
శ్రీరాముని కాళ్ళన ఇడరండి ||క||

నీరజాక్షుడు నిత్యపూజితుడు నిండుగ తేరండి
పూలను నిత్యము పూజించ నిండుగ తేరండి ||నీ||

సరోజాక్షుడు సర్వపాలకుడు సాష్టాంగము చేయండి
శ్రీరామునికి సర్వమర్పించి సాష్టాంగము చేయండి ||స||

# 359

రణధీర రఘువీర రావయ్యా మా ఇంటికి
నీ పాదాలు ఉంచయ్యా మా ఇంటి ముంగిట ||ర||

సీతమ్మ గుహరాజు శబరమ్మ ఆంజనేయులు
పూజించిన పావన పాదాలు పుణ్యపాదాలు ||ర||

నీ పాదములే మా పెన్నిధి నిన్ను పూజించుటే
మా పండుగ నిన్ను తలచుటే మా తలపు ||ర||

సీతమ్మ పూజించి సౌభాగ్యవతి అయె
శబరమ్మ పూజించి కైవల్యమును పొందె కదా సరోజాక్షా ||ర||
నీ పాదాలు ఉంచయ్యా మా ఇంటి ముంగిట ||ర||

# 360

కోకిలమ్మల కలకలలు చిలకమ్మల కిలకిలలు
సీతారాముల పకపకలు ॥కో॥

నాట్యమయూరుల ఘలఘలలు
దుప్పిలేడుల దుముకులు
సీతారాముల పకపకలు ॥నా॥

సీతారాముల పకపకలు
భక్తులపాలిటి భాగ్యాలు
ఘుమలాడే సరోజాలు ॥సీ॥

# 361

రత్నాల రథముపై శ్రీరాముడు కూర్చుండ
శోభాయమానముగ వెలిగెనే రథము
నా కనుల పండుగాయెనే ॥ర॥

శ్రీరాముని తొడపైన శ్రీరాముడు కూర్చుండ
రథానికి మెరపు అధికమాయెనే
నా కనుల పండుగాయెనే ॥ర॥

శ్రీరాముని పదముల అంజలినిడి
ఆంజనేయులు కూర్చుండ కళకళ లాడెనే రథము
నా కనుల పండుగాయెనే ॥ర॥

సరోజమాలలు రథమంతా ఘుమఘుమ లాడ
సీతారాములు నా పూజలందుకొన
నా కనుల పండుగాయెనే ॥ర॥

## 362

రఘునందన దశరథనందన రావయ్యా రావా
నీ పాదాలు కడిగి పూజించ రావా ॥ర॥

సీతమ్మను శృంగారించి తోడుకొని వచ్చేను
నీవు అమ్మను చూచి ఉప్పంగ ॥ర॥

సరోజపుష్పాలు సుగంధ ద్రవ్యాలు చల్లి
పాన్పు అమర్చేను జానకమ్మతో ఆనందించ ॥ర॥

## 363

రాజీవలోచనుని రఘువంశ తనయుని
పిలవరే మా ఇంటికి రారా రామయ్య
రావయ్య శ్రీరామ అని భక్తితో పిలవరే ॥రా॥

పండ్లు తెచ్చామయ్యా పూలు తెచ్చాము
నీ పాదాలు పూజించి పుణ్యమును కోరేము ॥రా॥

సంరక్షకుడవని సర్వదా నమ్మాము
సరోజాక్షా నీకు సాష్టాంగాలు చేసేము రా॥॥

## 364

భక్తులు పాడేరు రామ నీకు హారతి పాడేరు
మంగళహారతి పాడేరు శుభమంగళహారతి పాడేరు ॥భ॥
మంగళం శుభమంగళం సీతారామ మంగళం అని ॥భ॥
కౌసల్య తనయ జానకిరామ భక్త పరిపాల మంగళం అని ॥భ॥
మా హారతి గైకొనుమయ్యా సరోజాక్షా
సర్వమర్పించేది నీకేనయ్యా అని ॥భ॥

## 365

తులసీదళముల మాలలు గుచ్చి
దశరథ తనయున కర్పణచేసి దీవెన పొందరే
శ్రీరాముని దీవెన పొందరే ॥తు॥

కనకాంబరముల మాలలు కట్టి
కౌసల్య తనయున కర్పణచేసి కనికరం పొందరే
శ్రీరాముని కనికరం పొందరే ॥క॥

మల్లెపూల మాలలు తెచ్చి
మైథిలినాధున కర్పణచేసి మనమున నిల్పుకొనరే
శ్రీరాముని మనమున నిల్పుకొనరే ॥మ॥

సరోజపుష్పాల గుచ్ఛాలు తెచ్చి
సర్వపాలునకు అర్పణచేసి సాష్టాంగము చేయరే
శ్రీరామునికి సాష్టాంగము చేయరే ॥స॥

## 366

సీతమ్మ భుజముపై శ్రీరాముడు చేయివేసి
సింహాసనముపై కూర్చుండె చూడరే వచ్చి చూడరే ॥సీ॥

లక్ష్మణస్వామి సీతారాములకు ఛత్రముపట్టి
వినయముతో ఉన్నాడు చూడరే వచ్చి చూడరే ॥ల॥

భరత శత్రుఘ్నుల వింజామరలు వీచుచున్నారు
సీతారాములను చూడరే వచ్చి చూడరే ॥భ॥

సీతారాముల పాదాల సరోజపుష్పాలు అర్పించు
చున్నాడు హనుమంతు చూడరే వచ్చి చూడరే ॥సీ॥

## 367

రామ రామ శ్రీరామ
నా పూజలందుకో శ్రీరామ ॥రా॥

పండ్లు తినిపించె నీకు శబరమ్మ
నేను నీ పాదాల సరోజాలర్పించెద శ్రీరామ ॥రా॥

గుహరాజు నీకు అతిధ్యమిచ్చె
నేను నీకు సర్వమర్పించెద శ్రీరామ ॥రా॥

అంజనేయుడు పాదాలుపట్టె
నేను నీ పాదాలు శిరమున దాల్చేను శ్రీరామ ॥రా॥

భక్తులంతా నిన్ను కొనియాడేరు
నన్ను నీ భక్తులలో చేర్చుకో శ్రీరామ ॥రా॥

## 368

మరి మరి నిన్నుకోర మరియాదనా రామా
దయచూపకున్నావు మా తప్పేమి రామా ॥మ॥

మమ్ము శిక్షించుట నీకు తగదే రామ
క్షమియించుటే నీ గుణముకదా శాంతమూర్తి ॥మ॥

దయాహృదయ దయామయా
దశరథతనయ దయచూపు మా పైన ॥మ॥

శ్లాఘించేము నిన్ను పూజించేము
సరోజాక్షా దయచూపని వేడేము నిన్ను ॥మ॥

# 369

కావవేమయ్య కమలదళాక్షా కౌసల్యతనయ మమ్ము కావరావయ్య ॥కా॥
కరుణతో కాచేటి వాడవని నిన్ను కాంక్షతో వేరితి ॥కా॥
కరముల జోడించేను నేను నీ కాళ్ళనే కడిగేను కళ్ళద్ది కాంక్షతో
కాచి ఉండేను ॥కా॥
కణ్ణయ్య మా అయ్య కావయ్య సరోజాక్షా దండాలు శ్రీరామ నీకు॥కా॥

# 370

ముత్యాల సరములు నీలమేఘుని ఉరమున మిలమిల మెరయ
మురిసిరి ముగ్గురు తల్లులు ముదముతోటి ॥ము॥
పాడిరి జోలలు జోకొట్టి జోకొట్టి జోజో మా రాజా
జో రాజా జిగజిగ మెరిసేను నిద్రలో నీ నవ్వులు ॥ము॥
నీ నవ్వులే మా నవ్వులుగా నవ్వించి దీవించు నిన్ను నమ్మిన
మమ్ము నలగ నీయకు సరోజాక్షా రామా మాపాలి దైవమా ॥ము॥

# 371

పండ్లు తెచ్చేను పండిన అవ్వ పర్ణశాలకు పరుగు పరుగున ॥పం॥
శ్రీరాముడు వచ్చె మా రాముడొచ్చె ఆశతో
రామునికి పండ్లు తినిపించవలెనని ॥పం॥
ఒక్కొక్కటి రుచి రుచిచూచి వరుసగా ఉంచుకొనె
ఏకపత్నీవ్రతుడు శ్రీరామునికివ్వ ॥పం॥
చరచర పరుగెత్తి సరోజాక్షునికి స్వాగతమిచ్చి
తినిపించె భక్తితో శబరమ్మ పండ్లను ॥పం॥

## 372

అందులము కాని ఏమి తెలియని అంధులము
అయోధ్యరామ నీవేకదయ్యా మా ఆరాటము తీర్చను ॥అం॥

రామ రామ శ్రీరామ రామ రామ జయరామ
అన మా ఆరాటము తీర్చను నీవేకదయ్యా ॥అం॥

మమ్మేలుకో రామ మా ఆరాధ్యదైవమన
మా ఆరాటం తీర్చ నీవే కదయ్యా ॥అం॥

సర్వపాలుడవు నీవే సరోజాక్షుడవు నీవే
మము సంరక్షించువాడవు నీవే అన మా
ఆరాటము తీర్చ నీవేకదయ్యా ॥అం॥

## 373

పట్టాభిరాముడు పట్టపు రాణితో వచ్చె
పట్టరే హారతి పడతులంతా మీరు ॥ప॥

పసుపు కుంకుమతోటి సీతమ్మను పూజించి
పంచభక్ష్యములతోటి శ్రీరాముని సేవించి
పట్టరే హారతి పడతులంతా మీరు ॥ప॥

పాదాలు కడిగి పాదముల పూజించి
సీతారాములకు సరోజమాలలు వేసి
హారతి పట్టరే పడతులంతా మీరు ॥ప॥

## 374

ఫల పుష్పాలు పదిలముగా ఉంచి కాచుంటి
వేచుంట నా రామునికై కలలుకంటూ ॥ఫ॥

ఇదిగో వచ్చె అదిగో వచ్చె సీతా లక్ష్మణులతో
వచ్చెనని పారవశ్యమున కలలుకంటూ
కాచుంటి వేచుంటి నా రామునికై ॥ఫ॥

భజనలు వేస్తూ కీర్తనలు పాడుతూ రా రామ
శ్రీరామ ఓ రామ రావయ్య అని కలలుకంటూ
కాచుంటి వేచుంటి నా రామునికై ॥ఫ॥

భక్తపాలుడు సరోజాక్షుడు నన్ను వీడడు
నా రామునికై కలలుకంటూ
కాచుంటి వేచుంటి నా రామునికై ॥ఫ॥

## 375

బద్రగిరీశుడు భద్రగిరిపై నెలకొన్నాడు
పోదము రారండి పరుగు పరుగున
మెట్లన్ని ఎక్కి పోదము రారండి ॥బ॥

ఫలముల నొసగి పుణ్యముకోరి పూజలు వేసి
పరమపదము కోరెను ॥పో॥బ॥

రామ రామ శ్రీరామ అనుచు మెట్లన్నీ ఎక్కి
మనసార రాముని స్మరణలుచేస్తూ ॥పో॥బ॥

సరోజపుష్పాల పీఠముపైన కూర్చుని ఉన్న
సీతారాముల సేవలు చేయను ॥పో॥బ॥

## 376

శ్రీరామచంద్రుని పదములు పట్టి పవనకుమారుడు
పయనమాయెను సీతను వెదక ॥శ్రీ॥

దశరథ తనయుని దీవెనతో దిగ్విజయము
పొందెను హనుమంతుడు ॥శ్రీ॥

శ్రీరామచంద్రుని పదములు పట్టి కపులందరు
కట్టిరి వారథి సముద్రము పైన ॥శ్రీ॥

దశరథతనయుని దీవెనతో దిగ్విజయము
పొందిరి కపులంతా ॥శ్రీ॥

సరోజాక్షుని దీవెనే సర్వకార్య సిద్ధికి మూలమని
తెలియండి శ్రీరామచంద్రుని పదములు పట్టండి ॥శ్రీ॥

## 377

సీతారాముల కల్యాణం చూడను చూడను ఆనందం ॥సీ॥

కిటకిటలాడే జనముతోటి ధగధగలాడే పందిరిలోన ॥సీ॥

సుగంధ దూపముల వాసనలు వెదజల్ల
పరిమళ పూలు కళకళ లాడే ॥సీ॥

వయ్యారి సీత తలంబ్రాలు చల్లగ
ఓర చూపుల శ్రీరాముడు చూచె ॥సీ॥

దేవతలంతా సరోజాలు చల్లగ
వనితలంతా పట్టిరి మంగళహారతి ॥సీ॥

# 378

కలకంటినయ్యా రామా నిన్ను చూడాలని
కలకంటి కమ్మని కలకంటి ॥క॥

కలలో నీలమేఘుడిగా అజానుబాహుడిగా
సీతామనోహరుని చూడాలని కలగంటి ॥క॥

కలలో నిన్ను చూచితి సీతాపతిగా
అయోధ్య రామునిగా భక్తులపాలిటి కల్పవృక్షముగా ॥క॥

కలలో కోటి నమస్కారాలు చేసితి నా కల
పండించి నా కనుల పండుగ చేయవా సరోజాక్షా ॥క॥

# 379

రామ రామ శ్రీరామ రామ రామ జయ రామ ॥రా॥

మము పాలించేది నీవైతే శ్రీరామ నీ పాదాలు పట్టేది
మేముకదా నీ పాదాలు పట్టేది మేముకదా ॥రా॥

మము కరుణించేది నీవైతే శ్రీరామ నిన్ను కైవల్యము
కోరేది మేమేకదా నిన్ను కైవల్యము కోరేది మేమేకదా ॥రా॥

మము క్షమియించేది నీవైతే శ్రీరామ నిన్ను శరణు
కోరేది మేమేకదా నిన్ను శరణు కోరేది మేమేకదా ॥రా॥

మము సంరక్షించేది నీవైతే శ్రీరామ నీకు
నీకు సరోజాలర్పించేది మేమేకదా
సరోజాలర్పించాలని అనుకొనేది మేమేకదా ॥రా॥

# 380

పూజించరే ప్రభువును శ్రీరామచంద్ర ప్రభువును
పాదాలు పట్టి పూజించరే ॥పూ॥

పాదాలు పట్టిన పరుగున పోలేడు
భక్తపాలుడుకదా శ్రీరామచంద్రుడు ॥పూ॥

నీ పాదపూజే మా పుణ్యభాగ్యము నిన్ను
విడిచేదిలేదు నీ పాదపూజ కావాలి మాకు ॥పూ॥

పుణ్యాత్ములంతా పూజించిన పాదాలు పూజించి
పూజించి పుణ్యాత్ములుకారే సరోజాక్షుని ॥పూ॥

# 381

ఇంటింటికి రంగులు వేసిరి ముగ్గులు వేసిరి
మామిడి తోరణాలు కట్టిరి శ్రీరామచంద్రుడు
అయోధ్య వచ్చేనని ॥ఇం॥

రావణుని చంపి సీతా లక్ష్మణ ఆంజనేయులతో
పుష్పక విమానాన వచ్చేనని ॥ఇం॥

అయోధ్య ప్రజల ఆనందం అంతింత కాదు
పాడిరి ఎగిరిరి పూజలు చేసిరి రాముడు వచ్చేనని ॥ఇం॥

అయోధ్య అంతా సరోజాలు పాదాల ఉంచి
సాష్టాంగాలు చేసిరి సూర్యపుత్ర శ్రీరామునికి ॥ఇం॥

## 382

కొలిచేము కౌసల్య తనయ నిన్ను
కోటిపూలు తెచ్చి కోటి సార్లు ॥కో॥

కరుణించి కాపాడు కమలదళాక్షా అని ॥కో॥

కోటిసార్లు కొలిచేము పూజించేము కోటిసార్లు
పిలిచేము నిన్ను విడువక మేము ॥కో॥

కనులు కాయలు కాయ కాచేము నీకై సరోజాక్షా ॥కో॥

## 383

రామనామము దొరికెను కదా
పలికి పలకీ పరవశమొందను శ్రీ ॥రా॥

రామ నామము దొరికెను కదా
తలచి తలచి తన్మయమొందను శ్రీ ॥రా॥

రామ నామము దొరికెను కదా
పాడి పాడి పలుమారు పాడను శ్రీ ॥రా॥

రామ నామము దొరికెను పాడి స్మరించి
తన్మయముతో పరవశించి సరోజాక్షుని కనుగొన శ్రీ ॥రా॥

## 384

తలవరే రేయి పగలు శ్రీరామ
నీవే మాకని తలవరే ॥త॥

రాముని తలచి సీతారాముని కొలిచి
పట్టాభిరాముని పాదాలుపట్టి ॥త॥

నిన్ను నమ్మిన మాకు కొరతేలేదు
కావరావయ్యా కరుణాపయోనిధివి ॥త॥

పూజించేము సరోజకుసుమాల
సాష్టాంగము చేసేము సర్వమర్పించి ॥త॥

# 385

హారతి పట్టేమా మంగళహారతి పట్టేమా
శుభ మంగళహారతి పట్టెదమా ॥హా॥

మన్మధరూపుడు మహీపాలునకు
మైథిలిదేవి ప్రాణనాధునకు ॥హా॥

ఆనందరూపుడు అయోధ్య రాముడు
మా ఆరాధ్యదైవము మా ఇంటి దేవునకు ॥హా॥

సుందరాకారుడు సరోజాక్షుడు సాష్టాంగముచేసి
సర్వమర్పించి సదా ॥హా॥

# 386

పంచవటిలోని పిట్టలన్నీ కోకిల స్వరమున
జోలలు పాడెను సీతారాములకు ॥పం॥

జోజో మా స్వామి జోజో మా అమ్మ
నెమళులన్నీ మీకు వింజామరలు వీచేను జోజో ॥పం॥

సరోజపుష్పాల పాన్పుపై ఒరిగె
శ్రీరామచంద్రుడు ఆనందము ఉప్పొంగ ॥పం॥

పవళించు సీతమ్మ శ్రీరాముడు నిద్రించె
పాడేము జోలలు పరవశముతో తల్లి ॥ప॥

# 387

రామచంద్రులు నాపై అలిగినారే తల్లి
నేనేమి చేతునే ఓయమ్మ నేనేమి చేతునే
మొరపెట్టి మొరపెట్టి మోడునై తినే తల్లి
నేనేమి చేతునే ఓయమ్మ నేనేమి చేతునే
అలుకయేమిటో తెలియదాయె నేనేమి చేతునే తల్లి
నేనేమి చేతునే ఓయమ్మ నేనేమి చేతునే ॥రా॥

దయ కలవాడే నా రాముడు నా ఖర్మ
ఏమో తెలియదే తల్లి నేనేమి చేతునే
ఓయమ్మ సరోజాక్షుని పూజింతునే కాని ॥రా॥

# 388

పండుటాకులా పండిన ముసలవ్వ
పరుగులు తీసె శ్రీరాముని కొరకై ॥పం॥

మామిడాకులు తెచ్చె మంచి పండ్లు తెచ్చె
శ్రీరాముని మనస్సున నిల్పి మనసార పిలిచె ॥పం॥

నే తెచ్చిన పండ్లు తినవయ్య నేనడిగిన
పరమపద మీయయ్య ఈ ముసలి
పండును మరువకు నా మంచి రామా అని ॥పం॥

సరోజపుష్పాలు తెచ్చి నా సర్వమర్పించ కాచున్న
నా మనస్సున నిల్చి నా కోర్కె తీర్చయ్యా ॥పం॥

## 389

తికమక పడకవే మనసా మనపాలి దైవము
శ్రీరాముడుండగ తికమక ఏలనే మనసా ॥తి॥
తప్పుదారి పోవకే మనసా శ్రీరామచంద్రుడు
మనకు మంచి దారి చూపునుకదా మనసా ॥తి॥
రాముడు మనకు మంచి దారి చూపునుకదా మనసా ॥తి॥
రాముని నమ్మవే మనసా శ్రీరాముని నమ్మవే మనసా
సీతారాముని నమ్మవే మనసా సరోజాక్షుని నమ్మవే మనసా ॥తి॥

## 390

రామ రామ శ్రీరామ రామ రామ సీతారామ ॥రా॥
భక్త పరిపాల శ్రీరామచంద్ర కరుణతో
కావయ్య కరుణాపయోనిధి ॥రా॥
దయతో కాపాడు దశరథ తనయా
మా తప్పులన్నీ మన్నించు తాపసరక్షక ॥రా॥
మన్నించి మమ్ము బ్రోవు భూపుత్రీ
పతిభక్తితో నిన్ను కొలిచేము సరోజపుష్పాల ॥రా॥

## 391

పాడేను పాడేను శ్రీరామ నీ దివ్యపదములే పాడేను ॥పా॥
ఆడేను ఆడేను శ్రీరామ నీ దివ్యపదము నాట్యమే ఆడేను ॥ఆ॥
కొలిచేను కొలిచేను శ్రీరాముని దివ్యపాదములనే కొలిచేను ॥కొ॥
పాడేను ఆడేను కొలిచేను సీతారాముల
దివ్యపాదముల సరోజాల కొలిచేను ॥పా॥

## 392

రామయ్య రామ మా అయ్య రామ
సీతమ్మ సీత మా అమ్మ సీత ॥రా॥
శ్రీరామచంద్రుడు దశరథ తనయుడు
రామయ్య రామ మా అయ్య రామ ॥రా॥
జానకీదేవి జనకుని పుత్రి
సీతమ్మ సీత మా అమ్మ సీత ॥రా॥
అయోధ్య రాజ అభయహస్త రాజ
రామయ్య రామ మా అయ్య రామ ॥రా॥
అయోధ్య రాణి అందాల రాణి
సీతమ్మ సీత మా అమ్మ సీత ॥రా॥
సర్వపాలక స్వామి సరోజాక్ష రామ
రామయ్య రామ మా అయ్య రామ ॥రా॥
సిగ్గులొలికే తల్లి సీతమ్మ తల్లి
నీ వగలన్ని
శ్రీరామునికే చూపి మమ్ము రక్షింపు తల్లి ॥శ్రీ॥

## 393

శ్రీరామచంద్ర నిన్నేమని పొగడుదునయ్యా
భక్తపాలుడవననా నిన్ను సత్యపాలుడవననా ॥శ్రీ॥
ధర్మదేవతవననా నిన్ను శిష్టరక్షకుడననా
పాపహరుడవననా నిన్ను పుణ్యపురుషుడవననా ॥శ్రీ॥
కోదండపాణివననా సంరక్షించువాడవననా
నిన్ను సరోజాక్షుడననా ॥శ్రీ॥

# 394

ప్రభువుకు పాలపాయసముతో పండుగ చేతాము
శ్రీరాముని పుట్టిన పండుగ చేతాము ॥ప్ర॥

శుక్లపక్షమున నవమినాడు పునర్వసు
నక్షత్రాన పుడమిని పాలించ జన్మించిన
ధర్మప్రభువుకు పాలపాయసముతో ॥ప్ర॥

కౌసల్యతనయుల ముద్దుల బిడ్డడు శ్రీరామచంద్రుడు
భక్తులపాలిటి భాగ్యరాశి సీతాపతి ॥ప్ర॥

సంతోషముగా సర్వమర్పించి సరోజపుష్పాలు
సమర్పణచేసి భక్తితోటి గానము చేసి ॥ప్ర॥

# 395

మంగళం మంగళం మహారాజ మంగళం
మైథిలినాథ మంగళం శ్రీరామమంగళం
రఘువంశజ మంగళం ॥మం॥

మంగళం మంగళం కోసలాదీశ మంగళం
కౌసల్య తనయ మంగళం వైదేహిపతి మంగళం
ధర్మపాల మంగళం ॥మం॥

మంగళం మంగళం సర్వేశ్వర మంగళం
సరోజాక్షా మంగళం మము కరుణించు
మా ఇంటి దైవమా మంగళం ॥మం॥

## 396

రామ రామ రామ శ్రీరామ
జయ జయ రామ శ్రీ సీతారామ ॥రా॥

నా మదిలో నిలువుము శ్రీరామ
విడువక తలచేను శ్రీరామ ॥రా॥

నా కంటిలో నిలువుము శ్రీరామ
నినుకాంచి తరింతు శ్రీరామ ॥రా॥

నా కంఠమున నిలుపుము శ్రీరామ
నీ పదములే పాడుదు శ్రీరామ ॥రా॥

నా నాలుకను నిలువుము శ్రీరామ
నిన్నాశతో పిలిచేను శ్రీరామ ॥రా॥

నా హస్తాల నిలువుము శ్రీరామ
నిన్ను సర్వదా భజింతు శ్రీరామ ॥రా॥

నీవు నాలో నిలువుము శ్రీరామ
నీకు సరోజాలర్పింతు శ్రీరామ ॥రా॥

## 397

రామ రామ రామ రామ శ్రీరామ
రామ రామ రామ రామ శ్రీరామ సీతారామ ॥రా॥
జానకిరామ జగదభిరామ జగదోద్ధార శ్రీరామ ॥రా॥
పావనమూర్తి పరమపురుష పురుషోత్తమ శ్రీరామ ॥రా॥
కోదండపాణి కరుణారూప కోసలాధిపతి శ్రీరామ ॥రా॥
సరోజపూజిత సర్వపాపహర సర్వమంగళ శ్రీరామ ॥రా॥

## 398

గుడిలో గంటలు గణగణ మ్రోగెను
మేళ వాద్యములు శ్రావ్యముగ పలికెను
మంగళహారతి మిలమిల మెరిసెను
నా మది ఉప్పొంగె సీతారాముల చూచి ॥గు॥

గంటలు రామ రామ అని పలికె
మేళ వాద్యములు రాముని కీర్తించె
హారతిలో సీతారాముల దివ్యరూపము చూచితి
సర్వమర్పించితి సరోజాక్షుల చూచి ॥గు॥

## 399

మధుపర్కములు ధరించి ఠీవిగా వచ్చె
శ్రీరామచంద్రుడు వివాహవేదికకు ॥మ॥

ఎర్రని అంచుగల తెల్లని చీర కట్టి శృంగారముగా
సిగ్గులొలుకుచూ వచ్చె వయ్యారి సీతమ్మ ॥మ॥

ఎంత శోభ ఏమి శోభ రెండు కండ్లు చాలవు
సీతారాముల వివాహవేదిక శోభ చూడ ॥ఎం॥

తలంబ్రాలు చల్లుకొనిరి సీతారాములు
సరోజపుష్పాలు చల్లిరి దేవతలంతా
లోకకల్యాణమగునని ॥త॥

## 400

ఏమి చింత ఏమి వింత
నా రాముని కనుగొన ఎంత చింత ॥ఏ॥

ఎక్కడున్నాడు ఎట్లున్నాడు
ఎంతటివాడు నా స్వామి నా రాముడు ॥ఏ॥

నాకు కనబడునా నాకు పలుకునా
నన్ను దరిచేర్చుకొని కాపాడునా ॥ఏ॥

నా సరోజాక్షుడు నా చేయి విడువడు
దాశరథి దయామయుడు ॥ఏ॥

## 401

దాగుడుమూత లాడేవా శ్రీరామ
నాతో ఎంత వెదకినా దొరకవే ॥దా॥

నీ దగ్గరకు పరుగిడ నా చేతనౌనా
నీవే నన్ను నీ దరి చేర్చుకోవాలి ॥దా॥

వెదికేను వెదికేను ఎంతో ఆశతో
నా ఆశ తీర్చుటకు నీవేకదా ॥దా॥

సరోజాలు నీ కొసగెదనే కాని నీ
దాగుడుమూత లాటలోనే గెలువగలనా ॥దా॥

## 402

నా విన్నపము నీకు నే ఎరిగింతునే
కాని రామా నిన్ను నే ఎరుగలేనయ్యా ॥నా॥

నా విన్నపము ఎపుడు విందువో
నా కోర్కె నాకు ఎప్పుడు తీర్తువో ॥నా॥

దీన రక్షక దయామయ నీకు దండాలు
స్వామి పదివేల దండాలు ॥నా॥
వేచి ఉండేను వేదనతో విశ్వమేలేటి
సరోజాక్షా నా సీతాపతీ ॥నా॥

## 403

ఏమయ్యా రామయ్యా నాతోటి నీవు
పలుకకున్నావేమి నీ పిలుపు విన
నాకు ఆశాయెకద స్వామి ॥ఏ॥
శబరమ్మ పిలువగ పలికి పండ్లన్నీ తిన్నావే
రామ ఆంజనేయునికి నీవు విశ్వరూపమే చూపావంట ॥ఏ॥
నీవు పలికిన నాకు అంతేచాలు స్వామి ॥ఏ॥
నీ పాదాల నేను సరోజాల సేవించి
సర్వమర్పించెదనయ్యా ॥ఏ॥

## 404

ఓయమ్మో ఓయ్యో రారండి రారండి
గంతులు వేస్తూ గబగబ రారండి రారండి ॥ఓ॥
భక్తితోటి భజనలు చేస్తూ రారండి రారండి ॥ఓ॥
చిటికలు వేసి కీర్తనలు పాడుతూ రారండి రారండి ॥ఓ॥
భక్తులంతా గుంపులుకూడి రారండి రారండి ॥ఓ॥
సీతారాముల కల్యాణము చూడను రారండి రారండి ॥ఓ॥
పాదాలుపట్టి పదముల పాడను రారండి రారండి ॥ఓ॥
సరోజపుష్పాలు పాదాల చల్లి కళ్ళద్దను రారండి రారండి ॥ఓ॥

# 405

తాటకిని చంపి తాపసుల రక్షించిన
తాపస రక్షక దండాలయ్యా దండాలు ॥తా॥
శ్రీరామ నీకు దండాలు ॥తా॥

శాప విముక్తి చేసి అహల్యకు పరమపద మొసగిన
శ్రీరామ నీకు దండాలయ్యా దండాలు ॥శా॥

శివ విల్లు విరచి సీతమ్మను చేకొన్న శాంతమూర్తి
శ్రీరామ నీకు దండాలయ్యా దండాలు ॥శి॥

సత్యపాలనకై వల్కధారి అయిన పుణ్యపురుష
శ్రీరామ నీకు దండాలయ్యా దండాలు ॥తా॥

దశకంఠుని చంపి ధర్మస్థాపన చేసిన ధర్మప్రభూ
శ్రీరామ నీకు దండాలయ్యా దండాలు ॥ద॥

నా సరోజపుష్పాల పూజలందుకో నన్ను నీ దరి చేర్చుకో
శ్రీరామ నీకు దండాలయ్యా దండాలు ॥నా॥

# 406

రాముడు వచ్చెను స్వయంవరమున గెలిచె సీతను పెండ్లాడ శ్రీ ॥రా॥
ముని కనుసైగ చేసెను రాముడు శివవిల్లు పెట్టెను ॥రా॥
నిముషములో శివవిల్లు ఫెళఫెళ లాడెను ॥రా॥
శ్రీరాముని సీతమ్మ ఓరచూపుల చూచెను
మదిలో గౌరమ్మకు ధన్యవాదాలు చెప్పెను ॥రా॥
చిరునవ్వుల సీతమ్మ సరోజమాలతో వచ్చెను
దేవతలు పుష్పాలు చల్లగ శ్రీరాముని మెడలో వేసెను ॥రా॥

# 407

ఇది మంచి సమయము రామా నిన్ను
నిను భక్తితో కొలిచి నే సేవించను
సీతమ్మ నీ పాదాల సేవించి నిద్రించు
చున్నది నిన్ను సేవించనా ॥ఇ॥

ఆంజనేయుడు నిన్ను పూజించ పుష్పాలుతాను
పోయి ఉన్నాడు నిన్ను సేవించనా ॥ఇ॥

నే తెచ్చిన సరోజాలు నా ఆశ తీర
నిన్ను సేవించి తరించనా ॥ఇ॥

# 408

రామ రామ శ్రీరామ అన పొంగునుగా
ఆనందం ఉప్పొంగునుగా ॥రా॥

రామ రామ సీతారామ అన
అంతులేని ఆనందం అమితానందం ॥రా॥

రామ రామ జానకిరామ అన జగమే
ఆనందంతో నాట్యము చేయునుగా ॥రా॥

రామ రామ భక్తపాల అన
పరవశమున ఓలలాడుదుముగా ॥రా॥

రామ రామ సరోజాక్షా అన
స్వర్గానందం పొందుదుముగా ॥రా॥

# 409

ఏమి చేసిన నీకు దయ కల్గునో
రామా నా చింత ఎట్లు తీరునో ॥ఏ॥

శ్రీ రాఘవ సీతాపతి నాపై
దయచూపుము దయామయ ॥ఏ॥

ఆంజనేయ ప్రియ భక్తపాలక
వేయి సాష్టాంగాలు చేసేను దేవ ॥ఏ॥

సర్వపాలక రామ సరోజాక్ష రామ
రామ రామ అని సదా తలచేను ॥ఏ॥

# 410

ముసలి అవ్వ శబరికి నడుము ఒంగిపోయె
కండ్లు కానక కర్ర చేతికి వచ్చె
శ్రీరామునికై ఎదురుచూచి పండు బారె ॥ము॥

తీయ తీయని పండ్లెన్నో తెచ్చి
పైకి కిందికి పడుచు పూలెన్నో తెచ్చె
శ్రీరామునికై ఎదురుచూచి పండుబారె ॥ము॥

దూరమున రాముని చూచె టింగు టింగు మని
కర్ర కొట్టుచూ పరుగిడె పాదాలపైబడి
సాష్టాంగము చేసె పరమానందముతో ॥ము॥

రుచి చూచి పండ్లెన్నో తినిపించె
సరోజాక్షుని సుందరవదనము చూచి
తన్మయమొందె తృప్తితో తనవు చాలించె అవ్వ ॥ము॥

# 411

శ్రీరామ జయ శ్రీరామ జయరామ జయ సీతారామా ॥శ్రీ॥

పసుపురాసి పుత్తడిబొమ్మను మెరుగులు దిద్ద
సీతమ్మను చూచి శ్రీరాముడు మురిసిపోయె ॥శ్రీ॥

కాళ్ళకు అందెలు తొడిగి నడుముకు వడ్డాణ మిడ
వయ్యారి నడకల సీతమ్మను చూచి శ్రీరాముడు మురిసిపోయె ॥శ్రీ॥

వాలుజడ నిండ జాజులు ముడిచి జడ పిరుదులపై అల్లల్లాడ
సీతమ్మనుచూచి శ్రీరాముడు మురిసిపోయె ॥శ్రీ॥

పద్మదళాక్షి కమలదళాక్షి సరోజాక్షి
సుందరవదనముగా కళకళలాడు
సీతమ్మను చూచి శ్రీరాముడు మురిసిపోయె ॥శ్రీ॥

# 412

ఏమి కులుకు ఏమి వగలు సీతమ్మతల్లికి
శ్రీరామచంద్రుని నందనవనమున చూచి ॥ఏ॥

కిలకిల నవ్వేను గిరగిర తిరిగెను చెలికత్తెలతో
పరుగున పోయెను పూలను కోయను ॥ఏ॥

మాలలు కట్టెను మనమున నిల్పెను
శ్రీరామచంద్రుని ధ్యానించి గౌరమ్మను పూజించె ॥ఏ॥

దేవతలంతా దీవించిరి సీతమ్మను
సరోజాక్షునితో కల్యాణమగునని
సంబరపడిరి లోకకల్యాణమగునని ॥ఏ॥

## 413

రామ రామ అనరండి శ్రీరామ నామము గానము చేయండి ॥రా॥
రామ రామని తలవ తలవ మనస్సుకు మందు ॥రా॥
రామ రామ అని పలుక పలుక పరమానందము ॥రా॥
రామ నామము వినగ వినగ చెవులకు విందు ॥రా॥
శ్రీరాముని కనులార కనగ కనగ శోభానందము ॥రా॥
సరోజాక్షుని సర్వావస్థల తలవ తలవ స్వర్గానందము ॥రా॥

## 414

నా శ్రీరామచంద్రునికి ॥సాటి ఎవరే మనసా॥
శాంతమూర్తి సత్యసంధుడు భక్తపాలుడు
నా ధర్మప్రభువునకు ॥సా॥నా॥
సూర్యవంశుడు రఘువంశుడు
కౌసల్య దశరథుల ముద్దుల బిడ్డడికి ॥సా॥నా॥
నీలమేఘుడు సరోజాక్షుడు అజానుబాహుడు
అయోధ్యాధిపతికి ॥సా॥నా॥

## 415

నావాడు నారాముడు నన్ను వీడని వాడు శ్రీరాముడు ॥నా॥
తన పాదముల నా కిచ్చి నా పూజలందుకొనువాడు ॥నా॥
అభయహస్తము నాపై ఉంచి నా భజనలందుకొనువాడు ॥నా॥
చల్లగ నన్ను చూచి నా కీర్తనలు వినువాడు ॥నా॥
వేసాష్టాంగము చేయ నన్ను దీవించువాడు నా సరోజాక్షుడు ॥నా॥

# 416

దొరికెను దొరికెను రామమంత్రము
శ్రీ తారక మంత్రమే ముక్తిమార్గము ॥దొ॥

రామ రామ శ్రీరామ అన పరవశమొందించు
పరమాత్ముని నామము ॥దొ॥

రామ రామ శ్రీరామ అన కోరికలు
తీర్చి కైవల్యమొసగును
కరుణాకరుని నామము ॥దొ॥

సదా సదా విడువక తలచిన
స్వర్గారోహణమునకు దారి చూపును
సరోజాక్షుని నామము ॥దొ॥

# 417

కనులార నిను గాంచ నా కనులు
కోరుచున్నవి రామ వేచి ఉన్నవి ॥క॥

ఎప్పుడు కల్గునో ఆ భాగ్యము ఎట్లు
కల్గునో ఏమిటో నా స్వామి ॥ఎ॥క॥

ఈ తపన తీరు మార్గము తెల్పవా
రామ తాపస రక్షక తారక రామ ॥క॥

ఎల్లవేళల నిన్నే తలచు నన్ను దారి
చూపి దరిచేర్చు సరోజాక్షా ॥క॥

# 418

వాల్మీకి ఎన్నిన శ్రీరామచంద్రుడు
సత్యసంధుడు సర్వపాలకుడు ॥వా॥

అహల్య పూజించిన శ్రీరామచంద్రుడు
మహాదయ కలవాడు ధర్మపాలుడు ॥అ॥

శబరి భక్తితో కోరిన శ్రీరామచంద్రుడు
పరమపావనుడు పుణ్యపురుషుడు ॥వా॥

హనుమంతుని హృదయములో నిల్చిన
శ్రీరామచంద్రుడు భక్తపాలుడు తన భాగ్యరాశి ॥వా॥

సర్వజనులలో నిల్చిన సరోజాక్షుడు
సత్యధర్మపాలుడు పరమపావన భక్తపాలుడు ॥స॥

# 419

కనికరముంచి మాపై కావగరావా
కమలదళాక్షా కౌసల్య తనయ కరుణామయ ॥క॥

దయచూపి మాపై పాలించ రావ
పద్మదళాక్షా పావనరామ భక్త పరిపాల ॥ద॥

మంచి మనస్సు చేసి మాపై మన్నించరావ
మైథిలినాథా మా మంచి రామా మా దేవదేవ ॥మం॥

సర్వజ్ఞుడవే రామ మా సాష్టాంగాలు చేకొని
సంరక్షించి కాపాడు సరోజాక్షా ॥స॥

# 420

అదిగో అమ్మ రాముడు వచ్చె
ఇదిగో అమ్మ రాముడు వచ్చె
అదిగో ఇదిగో రాముడు వచ్చె
అని పరుగిడ పరుగిడ ఎక్కె కదా భద్రాద్రి కొండ ॥అ॥

సీతమ్మ ప్రక్కన కూర్చున్నాడు కదా
ఆంజనేయులు పాదాలుపట్టి ఉన్నాడు
నా వద్దకు వచ్చునా నా రాముడు ॥అ॥

పిలిచేను పిలిచేను నా గొంతు ఎండ
తలచేను తలచేను నా మది మత్తెక్క
తప్పక వచ్చు నా రాముడు అనే ఆశతో
సరోజపుష్పాల మాలలు కట్టేను
బుట్టల నిండా ఉంచుకొనేను నా రాముడు రాగానే
మాలలు వేసి పాదాలు పూజించేను ॥అ॥

# 421

భజనలు చేయవే ఓ మనసా శ్రీరాముని భజించి
భజించి భక్తిరాజ్యము పొందవే మనసా ॥భ॥

భజనలోనే భక్తి ఉన్నది భక్తిలోనే శాంతి
ఉన్నది శాంతే మరి ముక్తికి దారి ॥భ॥

సీతారామ శ్రీరామ జానకిరామ జగదోద్ధారా ॥భ॥

సరోజాక్షుని భజనలుచేసి భక్తిని కోరవే మనసా
భక్తిలోనే ముక్తి ఉన్నదని తెలుసుకొనవే మనసా ॥భ॥

## 422

కొనియాడరే శ్రీరామచంద్రుని కొనియాడరే
కౌసల్య తనయుని కోదండపాణిని
కల్యాణరాముని కరుణామయుని ॥కొ॥

వీరాధివీరుని విశ్వపాలుని వాలి
సంహారుని వాయునందన ప్రియుని ॥కొ॥

అయోధ్య రాముని ఆనందరాముని
అభయహస్తుని మన ఆరాధ్యదైవాన్ని ॥కొ॥

సర్వపాలకుని సూర్యవంశజుని
సాష్టాంగముచేసి సరోజాలర్పించి ॥కొ॥

## 423

వరుని మెడలో వరమాల వేసి శ్రీరామచంద్రునికి
సీతమ్మ పాదాభివందనముచేయ
ముక్కుబుళాకి అల్లల్లాడె ఆనందముతో ॥వ॥

పట్టుపాన్పుపై పవళించిన తన
మనోహరునకు విడము నోటి కందించ
గలగలలాడె అమ్మ చేతి గాజులు ఆనందముతో ॥వ॥

నిద్రకొచ్చిన సరోజాక్షునకు పాదాలు ఒత్తి
జోలపాడి ప్రక్కన ఒరగ తల్లికి
ఒళ్ళంతా పులకించె పరమానందముతో ॥ని॥వ॥

## 424

పునర్వసు నక్షత్రాన పుట్టేను శ్రీరాముడు
పుడమి జనుల పునీతుల చేయను ॥పు॥

దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించి
చూపెగా తన ఘనత సర్వజనులకు ॥పు॥

ప్రజలందరికి నమ్రత నేర్పి పునీతుల చేసిన
భక్తపరిపాలుడుగా శ్రీరామచంద్రుడు ॥పు॥

భజనలుచేసి కీర్తనలుపాడి భక్తపాలునికి
పూజలు చేయరే సరోజపుష్పాల ॥పు॥

## 425

పుత్తడిబొమ్మ పూలుకోయను పోయె
పతి పాదాలకు పూజచేయ ॥పు॥

ఝల్లు ఝల్లున ఝల్లువాన కురిసె
సీతమ్మ తడిచె ॥పు॥

చెట్లన్నీ వంగి చక్కని తల్లికి
గొడుగుపట్టె తడవకుండ ॥పు॥

పరుగుపరుగున పక్షులన్నీ వచ్చి
రెక్కలతో వింజామరలు వీచె ॥పు॥

రామలక్ష్మణులు ఈ వేడుక చూచి
ఆనందపడిరి సరోజపుష్పాలన్నీ
శ్రీరామునిపై చల్లి సిగ్గులొలికించె వైదేహి ॥పు॥

# 426

నన్ను పాలింప దిగిరావా దాశరథీ
దీనురాలి మొరాలింప కదలిరావా ॥న॥

మొరాలించు మొనగాడివట
మైథిలినాథా నా మన్నన వినవయ్యా ॥న॥

కరుణాకరా కమలదళాక్షా
కౌసల్య తనయ నన్ను కావరావయ్య ॥న॥

సదాసదా నిన్నే స్మరింతుస్వామి
నన్ను సంరక్షించు సరోజాక్షా ॥న॥

# 427

జోజో శ్రీరామ రఘువంశ రాజా
ఉగ్గుపాలు పోసి నీ తల్లి నిన్ను నిద్రబుచ్చెను ॥జో॥

సరోజపుష్పాల నీకు తొట్టిలు చేసి
పట్టుపరుపుపైన పన్నీరు చల్లిరి
చల్లగా నిద్రపో రామ లాలి ॥జో॥

భక్తితో నీకు లాలి పాడేరు పట్టున
నీ నవ్వుచూచి మురిసిపోయేరు
లాలిపో శ్రీరామ లాలి ॥జో॥

నీ నవ్వులే మాకు దీవెనలు కాగా
దశరథ తనయ నీవు నిద్రపో స్వామి
లాలి పాడేము శ్రీరామ లాలి ॥జో॥

## 428

సీతా లక్ష్మణ సమేతుడుగా కోదండముపట్టె
ఋషుల కాపాడి సత్యపాలన నిదర్శకుడుగా ॥సీ॥

శూర్పణఖ గర్వమణచె మారీచుని వధించె
శబరి జటాయువులకు మోక్షమిచ్చె
పది తలలు నరికి సీతను తెచ్చె ॥సీ॥

సత్యపాలనచేసి ఆదర్శపురుషుడుగా
లోకకల్యాణము కలిగించె
సర్వపాలకుడు సరోజాక్షుడు ॥సీ॥

## 429

తధికిణతోం తోం తోం తధికిణతోం తోం తోం తోం ॥త॥

శ్రీరామ నామ స్మరణలే మాకు చాలును
సీతారాముల స్మరణలే మాకు పెన్నిధి ॥త॥

రామ రామ రామ అన కల్గు శాంతి
సీతారామ రామ అన దొరకు ముక్తి ॥త॥

శ్రీరామ నామము విడువకండి
సీతారామ నామము మదిలో నిలపండి ॥త॥

రామనామ స్మరణలు సదా చేయండి
సరోజపుష్పాలు రాముని పాదాల ఉంచండి ॥త॥

# 430

రాముడున్నాడు శ్రీరాముడున్నాడు
మన తప్పుల క్షమించి కాపాడ ॥రా॥

కొలవరే భజించరే పూజించరే
కొలిచి భజించి పూజించి క్షమించ కోరరే ॥రా॥

పట్టాభిరాముడు భక్తపాలుడు పరంధాముడు
ఎందరో భక్తులు కొలిచి తరించిన ॥శ్రీ॥రా॥

మల్లెలు పూజించి భక్తితో రామ రామ
అని భజించి సరోజాలర్పించి కొలవను ॥శ్రీ॥రా॥

# 431

ఓహోహో భక్తులారా శ్రీరామచంద్రుని కీర్తించి
భజించి పూజలుచేయు భక్తులారా
॥రండి రండి రారండి సీతారాముల పూజలు చేతము రండి॥ ॥ఓ॥

తట్టల నిండా తీయని పండ్లు నిడుకొని
బుట్టల నిండా సుగంధ పూలను చేకొని ॥రం॥

తీయని పండ్లు శ్రీరాముని కొసగి సుగంధ పూలను
సీతమ్మ తలలో ముడిచి భక్తితో పూజించను ॥రం॥

భక్తపాలుడు సరోజాక్షుడు చల్లని తల్లి సీతమ్మ తల్లి
భక్తి శ్రద్ధతో పూజలుచేసి సర్వమర్పించను రారండి ॥ఓ॥

## 432

తులసి దళముల పూజచేతు దశరథ తనయ
దయచూడుము నాపై దయామయ ॥త॥

కనకాంబరాల పూజచేతు కౌసల్య తనయ
కరుణ చూపుము కరుణానిధి ॥క॥

మల్లెపూల పూజచేతు మైథిలినాథా
మన్నించు నా తప్పులు మహీపాల ॥మ॥

చామంతిపూల పూజచేతు సర్వపాలక
వేదుకో నన్ను చక్కని రాజా ॥చా॥

సరోజపుష్పాల పూజచేతు సర్వమంగళ
సంరక్షించు నన్ను ఎల్లవేళల సీతాపతి ॥స॥

## 433

॥పలుమారు ఎలుగెత్తి పిలచిన పలికేవా శ్రీరామ॥
శ్రీరామ సీతారామ జయ జయ రామ
జగదభిరామా అని ॥ప॥

దయకలవాడవు భక్తపాలుడవు
నిన్ను పిలచిన భక్తులందరికి అభయమిచ్చిన
అభయహస్తుడవు కదా ॥ప॥

సరోజాక్షా శ్రీరామ సర్వపాలక
శ్రీరామ సంరక్షించు శ్రీరామ అని ॥ప॥

# 434

మరువకు మనసా మైథిలినాధుని
మధురమైన నామము మరువకు
॥రామ రామ శ్రీరామ రామ రామ
సీతారామ విడువకు మనసా వైదేహిప్రియుని
వినోదమైన నామము విడువకు ॥రా॥
తలచుము మనసా దశరథ తనయుని
దివ్యమైన నామము తలచుము ॥రా॥
పలుకుము మనసా పలుమారు పలుమారు
పవిత్రమైన నామము పలుకుము ॥రా॥
స్మరించు స్మరించు సదా సదా
సరోజాక్షుని సంతోషపరచు నామము స్మరించు ॥రా॥

# 435

వాయునందన వీరాంజనేయ ఎక్కడ దాచావు
వైదేహిప్రియుని ఎక్కడ దాచావు ॥వా॥
సీవలెనే నేను శ్రీరామ శ్రీరామ సీతారామ అని
రోమ రోమము అల్లల్లాడ తలచేను స్వామి ॥వా॥
దయచూపి నాపై ఒక్కసారి చూపించవా
అంజనీసుత రామభక్త హనుమా ॥వా॥
నా తపన తీర్చయ్యా శ్రీరామభక్త కోటిసార్లు
నే నిన్ను పూజింతు సరోజపుష్పాల ॥వా॥

# 436

ఈ దీనురాలి సేవల ఘనముగా ఎంచి
॥నన్ను పాలింతువా భక్తపాల॥ ॥ఈ॥

నీకు వింజామరలు వీచేను విశ్వపాల భక్తితో ॥నీ॥ఈ॥

నీకు పాల పాయసము పొందుగా తినిపింతు ॥న॥ఈ॥

విందారగించిన నీకు విడెము సమర్పించేన ॥ఈ॥

నీ పాదాలు సుగంధపుష్పాల పూజించేను ॥నీ॥ఈ॥

నీవు సుఖముగా నిద్రించ సొంపుగా జోల పాడేను ॥నీ॥ఈ॥

నీవు మేలుకోగానే సరోజాలర్పించి సాష్టాంగము చేసేను ॥న॥ఈ॥

# 437

చెలువల్లారా సీతమ్మతల్లిని సింగారించరే
॥శ్రీరామచంద్రుడు వచ్చేను పరిణయమాడ॥ ॥చె॥

జానకిదేవికి జడనిండా జాజులు ముడవరే ॥శ్రీ॥చె॥

కౌసల్య కోడలికి కంకణము తొడవరే ॥శ్రీ॥చె॥

సౌమిత్రి వదినకు పాదాల పారాణి పూయరే ॥శ్రీ॥సౌ॥

అయోధ్య రాణిని ఆనందముగా అందముగా అలంకరించరే ॥శ్రీ॥చె॥

శ్రీరాముడు వచ్చేను సరోజ పూమాలతో
సీతమ్మ వచ్చేను సంపంగి పూమాలతో ॥చె॥

పరినయమాడిరి పురజనులు పరవశమున
ఉప్పొంగి పొంగి పొరల ॥శ్రీ॥చె॥

## 438

శ్రీరామ శ్రీరామ నాపై ఒకసారి
దయచూపు శ్రీరామ ॥శ్రీ॥

నీకు గోరుముద్దలు పెట్టు భాగ్యము
కౌసల్యా తల్లికే దక్కునా శ్రీరామా నాచే
ఒక్కసారి గోరుముద్దలు తినవా శ్రీరామ ॥శ్రీ॥

నీకు వింజామరలు వీచు భాగ్యము
సౌమిత్రికే దక్కునా శ్రీరామా నీకు నే
ఒక్కసారి వీచనా శ్రీరామా ॥శ్రీ॥

నీ పాదాలు ఒత్తు భాగ్యము సీతమ్మకే
దక్కునా శ్రీరామ భక్తితో నేను నీ
పాదాలు ఒక్కసారి ఒత్తనా శ్రీరామ ॥శ్రీ॥

నిన్ను భక్తితో పూజించు భాగ్యము
ఆంజనేయునికే దక్కునా శ్రీరామ నే
ఒక్కసారి సరోజపుష్పాల పూజించనా శ్రీరామ ॥శ్రీ॥

## 439

రాముడయ్యా రాముడు నాపాలి దైవము రాముడు ॥రా॥
నా మదిలోని రాముడు నే కొలిచేటి రాముడు ॥రా॥
నే పూజించు రాముడు ఎల్లప్పుడు నే తలచు రాముడు ॥రా॥
నన్ను కాపాడు రాముడు నా వెంతనుండు రాముడు ॥రా॥
నే వీడని రాముడు నన్ను వీడక ఏలు రాముడు ॥రా॥
సరోజపుష్పాల పీఠముపైన నా కనులలో ఉండు రాముడు ॥రా॥

## 440

ఆనందమాయెను వినోదమాయెను
చూడను సీతారాముల పెండ్లి వైభవము ॥ఆ॥

శ్రీరాముడు విసిరె పూలబంతి సీతమ్మ
ఒడిలో కళకళ లాడగ ॥ఆ॥

సీతమ్మ విసిరె పూలబంతి శ్రీరాముడు
చేకొనె చిరునవ్వులు ఒలుకుచు ॥ఆ॥

సీతమ్మ పెండ్లికూతురాయెనే అని
పాడిరి మిథిలంతా సరోజాలు చల్లుచు ॥ఆ॥

## 441

జోకొట్టి జోకొట్టి జోలపాడి కౌసల్య
అలసిపోయెను శ్రీరాముడు నిద్రపోక ॥జో॥

బంగరు తొట్టిలో శ్రీరాముని చిరునవ్వులు
చూచి మురిసిపోయెగా ముద్దుబిడ్డడి చేష్టలకు ॥జో॥

నిద్రపో నా తండ్రి నిద్రపో నా రామ నీ
తల్లి కౌసల్యను జో కొట్టి జోలపాడేను ॥జో॥

సూర్యవంశరాజ సరోజాక్షా తెల్లవారగానే
భక్తులు నీకు మేలుకొలుపు పాడేరు ॥జో॥

# 442

రామ రామ శ్రీరామ ఏమి ఘనుడవు శ్రీరామ ॥రా॥
కౌసల్య బంగారు కొమరుని ముద్దులాడెను ॥రా॥
దశరథరాజు తనయుని మనమున మెచ్చుకొనేను ॥రా॥
సీతమ్మ శ్రీరామచంద్రుని మనస్సున పూజించేను ॥రా॥
లక్ష్మణుడు అన్నకు తోడుగా నిలిచేను ॥రా॥
ఋషులందరూ రాముని వేనోళ్ళ కొనియాడేరు ॥రా॥
దానవులందరూ శ్రీరాముని ఘనుడుగా మెచ్చేరు ॥రా॥
నే పూజింతు శ్రీరాముని సరోజపుష్పాలొసగి ॥రా॥

# 443

నన్ను విడుచునా రాముడు
భక్త పరిపాలుడు భద్రాదీశుడు ॥న॥
ఎక్కి ఎక్కి నీ కొండ ఎక్కలేకున్నాను
దరిచేర్చుకో నన్ను దాశరథి ॥న॥
నీ పాదాల నా మదిని నిలిపి
నీ శరణుకోరి గబగబ వచ్చుచున్నాను ॥న॥
భద్రాద్రివాసా సరోజాక్షా
నా మనవి విని నన్ను వీడకు రామా ॥న॥

# 444

రామచంద్ర నన్ను బ్రోవ చాలా చలము చేసెదవేల స్వామి ॥రా॥
నీ భక్తకోటిలో నేను ఒక్కడను కానా రామా ॥రా॥
భక్తుల పాలించు పుణ్యపురుషుడవే
భక్తకోటి నీకు కోటి నమస్కారాలు చేసేరు ॥రా॥
నా ఒక్క నమస్కారము ఆ కోటిలో చేర్చుకో సరోజాక్షా ॥రా॥

## 445

పవళించెనే సఖి నా రాముడు
వింజామరలు తారా వీచేను నేను ॥ప॥

పట్టుపాన్పుపై సోయముగా పరున్నాడు
సుఖ నిద్ర పోవాలి భక్తుల పాలించ ॥ప॥

ఏమి సొంపుగ నున్నాడు ఏమి దివ్యతేజుడు
నా రాముడు దృష్టి తగులునో ఏమే సఖి ॥ప॥

సఖులారా రండి సరోజాలు తావాలి
నిద్రలేవగానే స్వాగతము పాడాలి ॥ప॥

## 446

రామ రామ రామ రామ నీవే రామ మా కయ్యా
నీ పట్టపు రాణే మా కయ్యా నీ సత్యపాలనే మా కయ్యా
నీ ధర్మపాలనే మా కయ్యా నీ భక్తపాలనే మా కయ్యా
నీవే మా మార్గదర్శకుడవయ్యా
నిన్నే మేము పూజింతుమయ్యా
నిన్ను కొనియాడేము నిన్ను భజియించేము
నిన్ను కీర్తించేము నీ భజనలు భజించి
నీ కీర్తనలు పాడి తన్మయమొంది
సరోజాలు నీ కర్పించేము ॥రా॥

# 447

శ్రీరామచంద్రుని భజన ఆనందం
సీతారాముల భజన ఆనందం ॥శ్రీ॥

దశరథనందుని భజన ఆనందం
జానకివల్లభుని భజన ఆనందం ॥శ్రీ॥

కౌసల్య తనయుని భజన ఆనందం
వైదేహిప్రియుని భజన ఆనందం ॥శ్రీ॥

భక్తపరాయణుని భజన ఆనందం
భూపుత్రి ప్రియుని భజన ఆనందం ॥శ్రీ॥

మమ్మేలు రాముని భజన ఆనందం
మైథిలినాథుని భజన ఆనందం ॥శ్రీ॥

సరోజాక్షుని భజన ఆనందం
సీతారాముల భజన ఆనందం ॥శ్రీ॥

# 448

రాముని భజించరే శ్రీరాముని భజించరే
రాముని కొనియాడరే శ్రీరాముని కొనియాడరే ॥రా॥

రామా నీ భజనలో సంతోషమున్నది
శాంతి ఉన్నది ముక్తిఉన్నదని నమ్మి ॥రా॥

ధర్మపాల దయామయ దీనదయాళూ
దీనరక్షక దిక్కులేని మాకు నీవే దిక్కని నమ్మి ॥రా॥

సర్వము తెలిసిన సరోజాక్షుడని సర్వము
నీకే అర్పించెదమని సీతా ॥రా॥

# 449

ముద్దుబాలుడుగా దోబూచులాడించె
కౌసల్యదేవిని శ్రీరామచంద్రుడు॥
సత్యవాక్కులచే పరమానందపరచె
దశరథరాజును అయోధ్యరాజు ॥స॥

కండ్లు మూసి బుగ్గన చిటికవేసి
సీతమ్మను సంతోషపరిచె శృంగారరాముడు ॥కం॥

హృదయములో దాగి హనుమంతుని
తృప్తిపరచె భక్తులపాలిట కల్పవృక్షము ॥హృ॥

పూజించరే సరోజాక్షుని సాష్టాంగాలు
చేయరే శ్రీరామచంద్రుని భక్తితో ॥పూ॥

# 450

నందనవనమున సీతమ్మను చూచె
శ్రీరామచంద్రుడు మదిని నిల్పుకొనె తనపత్నిగా ॥నం॥

జానకి ఓరకంటచూచె శ్రీరామచంద్రుని
తన భర్తగా ఎంచి పరుగునపోయె
గౌరమ్మను పూజించ ॥నం॥

దేవతలు ఆనందపడిరి సీతారాముల
సంభోగమే దుష్టశిక్షణ శిష్ట రక్షణ
లోకకల్యాణము కాగలదని ॥నం॥

సీతారాముల కల్యాణమే లోక కల్యాణము
సదా సదా సమర్పించరే సరోజాల సీతారాములకు ॥నం॥

# 451

ఇక్కడ రాముడు అక్కడ రాముడు
ఎక్కడ చూచిన రాముడు ॥ఇ॥

కౌసల్యకు మొలను గజ్జలు గలగలలాడు
చిట్టి బాలరాముడుగా దొరికె ॥ఇ॥

మునులు వెదక దొరికె కోదండరాముడుగా
సీతమ్మ వెదకగా దొరికె శృంగార రాముడుగా ॥ఇ॥

అహల్య శబరులు వెదకగా దొరికె
అభయహస్తుడుగా గుహుడు
ఆంజనేయుడు వెదకగా దొరికె భక్తపాలుడుగా ॥ఇ॥

కాకాసుర విభీషణులు వెదకగా దొరికె కరుణాకరుడుగా
వాలి రావణులు వెదకగా దొరికె శాంతమూర్తిగా ॥ఇ॥

సరోజాలర్పించి నే వెదక దొరుకు
నా మదిలోని సీతారాముడుగా ॥ఇ॥

# 452

పట్టినామయ్య శ్రీరామచంద్ర నీ పాదాలు పట్టినామయ్యా ॥ప॥
విడిచేది లేదయ్యా నీ పాదాల మేము విడిచేది లేదయ్యా ॥వి॥
శరణాగతులము మేము నీకు శరణాగతులమయ్యా ॥శ॥
మమ్ము ఏలు భారము నీదేకదయ్యా రామా నీదేకదయ్యా ॥మ॥
సరోజాలు ఎన్నో తెచ్చి ఉంచాము నిన్ను పూజించ రామ
నిన్ను పూజించ ॥స॥

# 453

ఎందుకూ దయరాదురా దాశరథి
శ్రీరామచంద్ర నీకు నాపై ॥ఎం॥

తప్పులు క్షమించు కరుణాకటాక్షుడవని
నమ్మిన నాపై నీకు ॥ఎం॥

భక్తపాలుడా దయామయా దీనదయాళూ
రక్షించు పాహిమాం పాహిమాం అన నాపై ॥ఎం॥

తలము చేయకు సంరక్షించు
సరోజాక్షుడవని నమ్మిన నాపై నీకు ॥ఎం॥

# 454

రామయ్య రామయ్య రావా మా పూజలందుకొన
గబగబ రావా రామయ్య వేగ రావా ॥రా॥

మగువలంతా నీకు మేలుకొలుపు పాడేరు
స్వాగత మిచ్చేరు నీకు సుగంధపూలతో ॥రా॥

పన్నీరు చల్లేరు మంచి గంధము పూసేరు
బంగరు పీఠము అమర్చి నిన్ను కూర్చుండ పెట్టేరు ॥రా॥

పుష్పాల పూజించి ధూప దీప నైవేద్య మిచ్చి
భక్తితో నీకు సేవలు చేసేరు ॥రా॥

పదములుపట్టి సాష్టాంగముచేసి సరోజమాలలు వేసి
నిన్ను పరమ పదము కోరేరు ॥రా॥

# 455

సరి సరి సరిగమ సూర్యవంశ సత్యపాల
రిగ రిగ రిగమప రక్షించుము రఘునాధా
గమ గమ గమపద కరుణించు కమలాక్షా
మప మప మపదని మన్నించయ్యా మైథిలినాధా
పద పద పదనిస పట్టామయ్యా పదములే
సని సని సనిదప సర్వపాల సాష్టాంగాలు
నిద నిద నిదపమ నీవేమాకు నీరజాక్ష
దప దప దపమగ దండించకు దాశరధి
పమ పమ పమగరి పూజించేము పుష్పాలతో
మగ మగ మగరిస మంగళమయ్యా మహీపాల
సరిగమపదనిస సంరక్షించు సరోజాక్షా
సనిదపమగరిస సంరక్షించు సరోజాక్షా॥

# 456

పూజించరే కుంకుమ పసుపుతో పూజించరే ॥పూ॥
కౌసల్యకోడలు పుత్తడిబొమ్మను ॥పూ॥
పన్నీటి గంధముతో పూజించరే పట్టపురాణి కమలదళాక్షిని ॥పూ॥
పునుగు జవ్వాజితో పూజించరే పుణ్యవతి జానకిదేవిని ॥పూ॥
సుగంధ పూలతో పూజించరే సూర్యవంశరాణిని సరోజాక్షిని ॥పూ॥
పండ్లు తాంబూలముతో పూజించరే పరమపావని జగన్మాతను ॥పూ॥

# 457

ఎందుకూ దయరాదురా రఘువంశ తిలక మా పైనీ ॥ఎం॥
మా తప్పులను మన్నించి మమ్మేలువాడవు నీవేకదా ॥ఎం॥
సంరక్షించు సరోజాక్షా అన సర్వదా కాపాడుదువుకదా ॥ఎం॥
నీ పాదాలు పూజించ పరమపద మిచ్చేవాడవు కదా ॥ఎం॥

# 458

శ్రీరామా నిన్ను కనుగొనుట సామాన్యమా ॥శ్రీ॥

భక్తితో భజించిన దొరకునా నీ సన్నిధి
గొంతెత్తి నిన్ను కీర్తించ దొరకునా ॥శ్రీ॥

భక్తి కుదిరినకాని నీవు దొరకవు
నీవు దొరకినకాని భక్తి కుదరదు ॥శ్రీ॥

నిన్ను కనుగొను శక్తి సామాన్యమా
నీవే దారి చూపి దరిచేర్చు సరోజాక్షా ॥శ్రీ॥

# 459

రాముని చేరను రారండి జయరాముని చేరను రారండి ॥రా॥
చిటికలు వేసి భక్తితోటి భజనలు చేసి ॥రా॥
గజ్జెలుకట్టి గలగలమనుచూ నర్తనచేసి ॥రా॥
పుష్పాలతోటి భక్తిగ పూజలుచేసి ॥రా॥
పదములుపట్టి పాపము కడిగి శ్రీ ॥రా॥
పాటలుపాడి పరవశమున శ్రీ ॥రా॥
సరోజాక్షునికి సర్వమర్పించి శ్రీ ॥రా॥

# 460

రామ రామ శ్రీరామ సీతారామ ॥రా॥
దశరథ తనయ దండాలయ్యా నీకు ॥రా॥
కౌసల్య తనయ కరములు జోడించేము నీకు ॥రా॥
వైదేహిప్రియా వందనాలయ్యా నీకు ॥రా॥
భక్త పరిపాల ప్రణామాలు నీకు ॥రా॥
జానకి ప్రియ జోహారులు స్వామి ॥రా॥
నీరజాక్షా నమస్కారాలు నీకు ॥రా॥
సరోజాక్షా నమస్కారాలు నీకు ॥రా॥
సరోజాక్షా సదా సాష్టాంగాలు స్వామి ॥రా॥

# 461

శ్రీరామచంద్రుడు మా రామచంద్రుడు ॥శ్రీ॥

కౌసల్యాతనయుడు కోదండరాముడు
కోటి పూల పూజ చేయ కోటివరము లిచ్చువాడు ॥శ్రీ॥

రఘువంశవీరుడు రమ్యమైన రాముడు
రక్షించమనగానే రివ్వున పరుగెత్తువాడు ॥శ్రీ॥

దశరథ తనయుడు దండకారణ్యవాసుడు
దండాలు పెట్టగానే దరిచేర్చుకొనువాడు ॥శ్రీ॥

వైదేహి ప్రియుడు వీరాధివీరుడు
వినయముతో నమస్కరించ వచ్చునుగా వేగముగ ॥శ్రీ॥

సత్యధర్మపాలుడు మా సరోజాక్షుడు
సర్వమర్పించగానే మనల కాపాడువాడు ॥శ్రీ॥

## 462

రామనామము తారక నామము
ముక్తి సాధనము తెలుసుకో మనుజా ॥రా॥

ముక్తి సాధనము భక్తి మార్గము
భక్తికి సాధనము రామనామము తెలుసుకో మనుజా ॥రా॥

భజించి కీర్తించ శ్రీరాముని దొరకుకదా
భక్తి మార్గము తెలుసుకో మనుజా ॥రా॥

సరోజాక్షుని స్మరించ కల్గు ఆనందమే
భక్తి మార్గము తెలుసుకో మనుజ ॥రా॥

## 463

భజనలు చేయరే ఓ మనసా
చిటికలువేసి చిందులు త్రొక్కుచు
సీతారాముల భజనలుచేయవే మనసా ॥భ॥

చిటికలు వేసి చిందులు త్రొక్కుచు
భజనలుచేయవే ఓ మనసా
పాటలు పాడి పాటలు పాడి
సీతారాముల భజనలు చేయవే ఓ మనసా ॥భ॥

పాటలు పాడి పాటలు పాడి
తన్మయముతో భజనలు చేయవే ఓ మనసా ॥భ॥

తన్మయమున సరోజాక్షుని చూడవే ఓ మనసా
సీతారాములు భజనలు చేయవే ఓ మనసా
భజనలు చేయవే ఓ మనసా ॥భ॥

## 464

భక్తులపాలిటి భాగ్యరాశి భద్రాచల రాముడేకదా
భజనలు చేయగ కరుణించేది భద్రాచల రాముడేకదా ॥భ॥

పదములు పట్టగ దీవించేది భద్రాచల రాముడేకదా
శరణన్న వారికి అభయ మిచ్చేది భద్రాచల రాముడేకదా ॥భ॥

సదా స్మరించు వారిని రక్షించేది భద్రాచల రాముడేకదా
సరోజాలర్పించ దరిచేర్చుకొనేది భద్రాచల రాముడేకదా ॥భ॥

## 465

రామ నేనేమి కోరను నిన్నేమి కోరను
నాకు భక్తిమార్గమే చాలు నిన్ను చేరను ॥రా॥

పదములు పట్టిరి నీకు పూజలు చేసిరి
నిన్ను పొగడిరి కొనియాడిరి భక్తులంతా నిన్ను చేర ॥రా॥

ఆ మార్గము సులభమార్గము నీ దరిచేరు మార్గము
నేర్పయ్యా రామ నిన్ను వినయముతో వేడేను ॥రా॥

సరోజాలర్పించేను సర్వమర్పించేను
నా కింకేమి తెలియదు స్వామి ॥రా॥

## 466

రాముడున్నాడు కృపతో కాపాడ శ్రీరాముడున్నాడు ॥రా॥
భయమెందుకు దిగులెందుకు శ్రీరామ రామ అన ॥రా॥
దయామయుడు దశరథతనయుడు కరుణాసాగరుడు
కౌసల్య తనయుడు ॥రా॥
సదా సదా సరోజాలర్పించి పాదాలు పట్టగ ॥రా॥

# 467

సేవించరే భక్తితో శ్రీరాముని భక్తితో ॥సే॥

గుహరాజు భక్తితో శ్రీరాముని పాదాల
పూజించి పరవశించె ఆనందముతో ॥సే॥

జటాయువు రావణునితో పోరాడి
భక్తితో శ్రీరాముని సేవించి తరించె ॥సే॥

శబరి రుచి చూచిన తీయనిపండ్లు భక్తితో నొసగి
శ్రీరాముని సేవించి పరమపదము నొందె ॥సే॥

వాయునందనుడు వారధి కట్టి సీతను తెచ్చి
భక్తితో సేవించి శ్రీరాముని భక్తుడాయెను ॥సే॥

సరోజాక్షుని భక్తితో సేవించి స్వర్గానందము చెందరే
రాముని సేవించి పరమపదము గొనరే ॥సే॥

# 468

సీతమ్మ రావమ్మ మా ఇంటికి
రావమ్మ కాలి అందెలు ఘల్లు ఘల్లు మనుచు ॥సీ॥

బంగారు పీఠమమర్చి మంచి మంచి
రంగు రంగుల ముగ్గులువేసి ఉంచాను రావమ్మ ॥సీ॥

గడపకు పసుపు కుంకుమతో అలంకరించి
మంచి ముత్యాల మామిడి తోరణాలు కట్టాను రావమ్మ ॥సీ॥

మల్లె జాజి సరోజాలు తెచ్చాను
అరటి మామిడి ద్రాక్షపండ్లు తెచ్చాను
నీకు నైవేద్యమిచ్చి సంబరపడను ॥సీ॥

# 469

ఊచండి లాలి అమ్మలారా
చిట్టి రామునికి లాలి ఊచండి ॥ఊ॥

దోగాడుతూ వచ్చాడు దోబూచులాడాడు
ఆడి ఆడి బిడ్డ అలసినాడమ్మ ॥ఊ॥

వగలాడి రాముడు వగలు చూపేను
నిద్రపోక మనల ఆటలాడించేను ॥ఊ॥

నిద్రలో రాముడు చిరునవ్వు నవ్వేను
ఆ నవ్వులే మనకు ఆశీర్వాదములగునంట ॥ఊ॥

సర్వమేలే రాముడు సరోజాక్షరాముడు
చల్లగా నిద్రించి జగమెల్ల ఏలునంట ॥ఊ॥

# 470

పూజించరే కుంకుమ పసుపుతో
పూజించరే కౌసల్య కోడలు పుత్తడి బొమ్మను ॥పూ॥

పన్నీటి గంధముతో పూజించరే
పట్టపురాణి కమలదళాక్షిని ॥పూ॥

పునుగు జవ్వాజితో పూజించరే
పుణ్యవతి జానకీదేవిని ॥పూ॥

సుగంధ పూలతో పూజించరే
సూర్యవంశరాణి సరోజాక్షిని ॥పూ॥

పండ్లు తాంబూలముతో పూజించరే
పరమపావని జగన్మాతను ॥పూ॥

# 471

ఓ హెూ హెూ ఏమి శోభ సీతారాముల
శృంగార శోభ అహోహో ఏమి ఆనందం ॥ఓ॥

పూబంతిని విసిరె శ్రీరామచంద్రుడు
సీతమ్మ మీద సఖులందరూ కిలకిలలాడిరి ॥ఓ॥

శ్రీరాముడు చిరునవ్వు నవ్వె
సీతమ్మ సిగ్గుతో వయ్యారముగ తలవంచె ॥ఓ॥

శ్రీరాముడు వసంతము చల్లె
సీతమ్మ చలితో ఒణికె మగువలు కిలకిలలాడిరి ॥ఓ॥

సీతమ్మ ఒంపులు చూచి శ్రీరాముడు నవ్వె
సీతమ్మ తలవంచె సిగ్గుతో ॥ఓ॥

శ్రీరాముడు గంధము చల్లె సీతమ్మపై
అమ్మ సరోజాలు చల్లె శ్రీరామునిపై ॥ఓ॥

గంధాలంకరణచూచి శ్రీరాముడు మురిసిపోయె
సీతమ్మ ఒంగి పాదాలుపట్టె
వనితలు ఆనందంతో ఉప్పొంగ ॥ఓ॥

# 472

రామ రామ రామ రామ శ్రీరామ అని అనరే ॥రా॥
రామ రామ రామాని పదములుపట్టి శ్రీరాముని కనరే ॥రా॥
గుహుడు పట్టిన పదములపట్టి పావనరాముని కనరే ॥రా॥
పావనరాముని పదములే మన పాపము కడుగును కనరే ॥రా॥
సరోజాక్షుని సదా తలచి శ్రీరామ రామ సీతా రామని అనరే ॥రా॥

## 473

నా కండ్ల కనపడవు నా మదిలో
నిలువవు ఎక్కడున్నావు శ్రీరామా
నేనేమి చేతు శ్రీరామా ॥నా॥

పిలిచేను పిలిచేను ఎంతో పిలిచేను
పలుకవు ఉలకవు ఎక్కడున్నావు శ్రీరామ
నేనేమి చేతు శ్రీరామా ॥నా॥

వెదికేను వెదికేను ఎంతో నిన్ను చూడ
నా కనుల కనపడవు ఎక్కడున్నావు శ్రీరామా
నేనేమి చేతు శ్రీరామా ॥నా॥

సీతమ్మ నడిగినా పలుకదు హనుమంతు
నడిగినా ఉలకడు ఎక్కడున్నావు శ్రీరామా
నేనేమి చేతు శ్రీరామ ॥నా॥

నా మదిలోని ఆరాటము తీర్చవా సరోజాక్షా
నా ఆరాధ్యదైవమా అయోధ్య రామా
అభయహస్త శ్రీరామా ॥నా॥

## 474

రామా నీ సమానమెవరూ నా మదిలో లేరయ్యా ॥రా॥
నిన్ను నేను పూజించేను నిన్నే ఎల్లప్పుడు
నిన్నే నేను పూజించేను తలచేను ॥రా॥
సరోజాక్షా సుందరాంగ సర్వపాలకుడవు నీవేనయ్యా ॥రా॥
నన్నేలుకొని పాలించే భారము నీదేకదా రామయ్యా ॥రా॥

# 475

బంగారు తొట్టిలో బజ్జున్నావా రామా
॥లాలి పాడేను నీకు లాలి॥ ॥బం॥

నిద్రపో నా తండ్రి నిద్రకొచ్చావు నిద్రలో
నీ నవ్వుల చూడాలి నేను లాలి ॥లా॥

నీ నవ్వులే మాకు దీవెనలు కాగా
నిన్ను పూజించి మేము తరించాలి రామా లాలి ॥బం॥

రోజాలు నీకు ఘుమఘుమ లాడేను
చల్లగా నిద్రించి దీవించుమమ్మ లాలి ॥లా॥బం॥

# 476

గణగణ మ్రోగెను గుడిగంటలు
నా మదిలో నిలిచిరి సీతారాములు ॥గ॥

అభయహస్తుడై శ్రీరామచంద్రుడు నన్ను
దీవించుతూ సీతమ్మ తల్లి ॥గ॥

దండాలు పెట్టితి దశరథ తనయునకు
సాష్టాంగము చేసితి సీతమ్మ తల్లికి ॥గ॥

నా పంట పండెను నా కానందము నిండెను
సీతారాములు దీవించిరి నన్ను ॥గ॥

సర్వమర్పించితి సరోజా లొసగితి
సంరక్షించమని మనసార కోరితి ॥గ॥

# 477

రమ్మనగానే వచ్చేవా రఘుకుల తిలక రాజీవలోచన ॥ర॥
ఇమ్మనగానే ఇచ్చేవా ఇనకుల తిలక ఇక్ష్వాకులరాజ ॥ర॥
కమ్మని ఫలముల ఇచ్చేము నిన్ను ఘుమ్మను పూల పూజించేము ॥ర॥
పట్టున పదముల పట్టేము ఫలముల నెన్నో కోరేము ॥ర॥
చల్లగ మమ్మెప్పుడు కాపాడు నిన్ను సరోజాక్షా అని కొలిచేము ॥ర॥

# 478

నిన్ను కాన నా కన్నులు కాచున్నాయి
శ్రీరామ దయామయ దీనదయాళూ
నాకు దర్శనమివ్వవా శ్రీరామ ॥ని॥

జగదోద్ధారా జగన్నాధా జానకీపతి
జాగుచేయక నాకు దర్శనమివ్వవా స్వామి ॥ని॥

సర్వవేళల నిన్ను మరువక తలచేను
జాగుచేయక నాకు దర్శనమివ్వవా సరోజాక్షా ॥ని॥

# 479

రామ రామ శ్రీరామ జయ జయ రామ శ్రీరామ ॥రా॥
చిగురించె నామది శ్రీరామచంద్రుని సీతామనోహరుని తలవగానే ॥చి॥
మొగ్గగా మారె నా మది రామనామము వినగానే ॥మొ॥
పూవుగా పూచె నా మది శ్రీరాముని తలచి తన్మయమొందగ ॥పూ॥
స్మరించ స్మరించ నా మదిలో సరోజాక్షుడు నిలిచె నిండుగా ॥స్మ॥

# 480

అమ్మ అమ్మ సీతమ్మ నన్ను తరింపచేయి సీతమ్మ ॥అ॥

జానకీదేవికి జడలల్లి జాజులు ముడిచేను
అమ్మ ఆనందంతో నా జన్మ తరింపచేసేను
సీతాదేవికి పట్టుచీర కట్టి సింగారించేను
అమ్మ ఆనందంతో నాకు స్వర్గానంద మిచ్చేను ॥అ॥

మైథిలిదేవికి మొలకు బంగారు వడ్డాణ ముంచేను
అమ్మ ఆనందంతో నాకు ముక్తినిచ్చేను ॥అ॥

పట్టుపురాణికి పాదాల పారాణి పూసి అందెలు తొడిగేను
అమ్మ ఆనందంతో నాకు పరమపదము ఇచ్చేను ॥అ॥

శ్రీరామ పత్నిని భక్తితో సరోజపుష్పాల పూజించేను
అమ్మ ఆనందంతో నన్ను తనలో చేర్చుకొనేను ॥అ॥

# 481

మేలుకో ఓరామ మమ్మేలుకోవయ్యా
మల్లెపూలు తెచ్చి పూజ చేసేము ॥మే॥

కనపడు ఓరామా మా కనులార గను
కనకాంబర పూమాల వేసేము నీకు ॥క॥

మా మదిలో నిలువయ్యా మైథిలినాథా
మంచి పండ్లు తెచ్చి నైవేద్యమిచ్చేము ॥మే॥

సరోజాక్ష రామా సర్వపాలక రామ
మమ్మేలుకోవయ్య నీకు సర్వమర్పించి
సాష్టాంగము చేసేము ॥ప॥

# 482

మేలుకో శ్రీరామ సూర్యుడుదయించె
సూర్యవంశరాజా మేలుకో ॥మే॥

పడతులంతా నీకై పన్నీరు తెచ్చారు
స్నాన మాచరించి సంతోషపరచు ॥ప॥

కన్నెలంతా నీకై గంధము తెచ్చారు
గంధాధరణ గావించి కావుమయ్యా మమ్ము ॥క॥

వనితలంతా నీకై వస్త్రాలు తెచ్చారు
వస్త్రాలంకరణ గావించి విన్నపము వినవయ్యా ॥వ॥

పుణ్యవతులు తెచ్చారు పుష్పాలెన్నో
పూజగావించేరు పరమపదము కోరేరు ॥పు॥

మగువలు తెచ్చారు మంగళహారతి నీకై
హారతి గై కొని ఆనందపరచు ॥మే॥

సర్వమేలే రామ సరోజాక్షరామ సాష్టాంగాలు నీకు
మాకు సౌభాగ్యమొసగ మేలుకో రామ ॥స॥

# 483

మంగళం శ్రీరామ జయమంగళం
కోసలాదీశ నీకు శుభమంగళం ॥మం॥

సీతాపతి నీకు జయమంగళం
జానకీపతి నీకు శుభమంగళం
నిత్య మంగళం నీకు సదా మంగళం
సర్వేశ్వరా నీకు సరోజమంగళం ॥మం॥

## 484

అయోధ్యరాముడు మన చెంతనుండగ
ఆరాటము ఏలనే మనసా ఓ మనసా ॥అ॥

కల్యాణరాముడు కాచి ఉండగ
కలతలు ఏలనే మనసా ఓ మనసా ॥క॥

మైథిలిరాముడు మనచెంత నుండగ
మంచి కలుగునే మనసా ఓ మనసా ॥మై॥

పట్టాభిరాముడు ప్రక్కనుండగ
పరమానందమే మనసా ఓ మనసా ॥ప॥

సరోజాక్షుని సన్నిధి మనకుండ
స్వర్గానందమే ఓ మనసా ॥స॥

## 485

మురిపముతోటి ముత్యాలపల్లకి
ముద్దుగ కట్టిరి సీతారాములకు ॥ము॥

పల్లకి నిండా పన్నీరు చల్లిరి
పీఠము అమర్చిరి పగడాలతో
మంగళకరమగు మామిడి తోరణాలు
మెండుగ కట్టిరి పల్లకి మెరయ ॥ప॥

సుగంధ పూలతో సరాలు చేసి
సంబరముగ చేసిరి స్వర్ణపల్లకిని ॥సు॥

పల్లకిలోని సరోజాక్షులు
అభయహస్తులై దీవించిరి మనల ॥ము॥

## 486

పంచవటిలో నీవు బంగరులేడి
కనపడి చిక్కులలో చిక్కుకొంటివే
సీతమ్మ చిక్కుకొంటివే సీతమ్మ ॥పం॥

రామలక్ష్మణులు నిన్ను వెదకి వెదకి
దుఃఖమొందిరి కదా
సీతమ్మ దుఃఖమొందిరి సీతమ్మ ॥రా॥

నీ నగలమూటను చూచి వానరుల
స్నేహముతో వారధి కట్టిరి కదా
సీతమ్మ వారిధి కట్టిరి కదా సీతమ్మ ॥నీ॥

సీతను చూచితని శ్రీరామునితో చెప్పి
అంజనీ సుతుడు ఆనందపడెకదా
సీతమ్మ ఆనందపడె కదా సీతమ్మ ॥పం॥

విభీషణుని సహాయమున రావణుని
పడగొట్టి సరోజాక్షుడు నిన్ను చేకొనె కదా
సీతమ్మ చేకొనె కదా సీతమ్మ ॥పం॥

## 487

ఏలుకునేవాడు మమ్మేలుకునేవాడు ఎక్కడున్నాడు ఎక్కడున్నాడు ॥ఏ॥
భద్రాద్రి కొండపైన భద్రముగా దాగున్నాడు ॥ఏ॥
సీతమ్మ ఒడిలో భద్రముగా పరుండి ఉన్నాడు ॥ఏ॥
ఆంజనేయుని హృదయములో భద్రముగా దాగి ఉన్నాడు ॥ఏ॥
గుహరాజు ఆతిథ్యముతో భద్రముగా మునిగి ఉన్నాడు ॥ఏ॥
సరోజపుష్పాల పాన్పుమీద భద్రముగా పరుండి ఉన్నాడు ॥ఏ॥
భక్తుల ప్రార్థన వింటూ భద్రముగా అభయహస్తుడై ఉన్నాడు ॥ఏ॥

## 488

పరుగు పరుగున పారాడు మన రాముడు
గట్టిగ విడువక పట్టుపట్టాలి ॥ప॥

రామనామ మహిమతో గట్టిగ పట్టిన
గబగబ దొరకును రాముడు ॥ప॥

అంజని సుతుడు పట్టెను కదా
గుహరాజు విడువక పట్టుపట్టె ॥ప॥

భక్తపాలుడు పావనరాముడు
భక్తుల విడచి పారిపోవునా ॥ప॥

రహదారి అంతా సరోజాలు చల్లిన
పాదాలు నోవక వనవద్ద వచ్చు ॥ప॥

## 489

నీ చేతి పది వ్రేళ్ళకు నేను పగడాల ఉంగరాలు పెట్టగలనా
రామా నిన్ను నేను పదివేలసార్లు స్మరియింతునేకాని ॥నీ॥

సీతమ్మ నడుముకు పగడాల వడ్డాణము పెట్టగలనా
రామా అమ్మను నేను పదివేలసార్లు పూజింతునేకాని ॥నీ॥

నీ మెడలో నేను మణిహారాలు వేయకలనా
రామా నిన్ను నేను సరోజపుష్పాల అలంకరింతునేకాని ॥నీ॥

సీతమ్మ పాదాలకు రవ్వల గొలుసులు తొడగగలనా
రామా అమ్మ పాదాలు పట్టి విడువక పూజింతునేకాని ॥నీ॥

మీకు నేను బంగరు మందిరము కట్టగలనా
రామా నా హృదయములో సదా మిమ్ము నిలుపుకుందునేకాని ॥నీ॥

## 490

పలుకవేమి నా రామయ్య పిలచి పిలచి నిన్ను
నా నోరు ఎండిపోవదా ॥ప॥

కావు కావుమని నిన్ను కోరి కోరి వేడేను ॥ప॥

పలుకకున్న నాతో నేను పారిపోదునా
పరుగున వచ్చి గట్టిగా పట్టేను ॥ప॥

ఆవురావురని నీ పిలుపుకై వేచివేచి అలసినాను ॥ప॥

పిలుతునే కాని నేనింకేమి చేతు
దయచూపు నాపైన సరోజాక్ష రామ ॥ప॥

## 491

ఎప్పుడు వచ్చునో తల్లి సీతమ్మ ఎట్లు వచ్చునో ॥ఎ॥

తొలికోడి కూసింది సూర్యోదయమాయె
తులసిమాలలు కట్టి తల్లడిల్లుతున్నాను ॥ఎ॥

మధ్యాహ్న వేళాయె సూర్యుడు తలపైకి వచ్చె
మల్లెపూమాల కట్టి మైమరచి ఉన్నాను ॥ఎ॥

సంధ్యవేళాయె గొల్లలు ఇల్లు చేరె
సన్నజాజులు తెచ్చి సంకట పడుతున్నాను ॥ఎ॥

రాత్రి పన్నెండాయె రాదాయె నా తల్లి
శ్రీరాముడు రానిచ్చునా నా తల్లి
నా సరోజాలు వాడకమునపే వచ్చునా ॥ఎ॥

# 492

రామ రామ శ్రీరామ రామ రామ శ్రీరామ॥

పునర్వసు నక్షత్రాన పుట్టిన పుణ్యపురుషుడు
పట్టాభిరాముడు శ్రీరామచంద్రుడు ॥రా॥

సూర్యవంశమున జన్మించిన సూర్యతేజుడు
సత్యపాలుడు శ్రీరామచంద్రుడు ॥రా॥

రఘువంశమున రాణించిన రఘువీరుడు
రాఘవుడు శ్రీరామచంద్రుడు ॥రా॥

దశరథరాజుకు పట్టిన దానవమర్ధనుడు
ధర్మపాలుడు శ్రీరామచంద్రుడు ॥రా॥

సర్వేశ్వరుడుగా జన్మించిన సరోజాక్షుడు
సీతాపతి శ్రీరామచంద్రుడు ॥రా॥

# 493

కాంతులు మెరయుచు కళకళ లాడెను శ్రీరామచంద్రుడు
కల్యాణరాముడై ఫెళఫెళ విరచెను శివవిల్లును
సీతను పెండ్లాడె శుభముగా ॥కాం॥

గర్వమణచెను పరశురాముని జిగజిగ మెరిసెను
వీరాధివీరుడై (అతితేజస్సుతో) ॥గ॥

దేవతలు చల్లిన సరోజపుష్పాల ఝల్లులో
కాంతులు మెరసె కల్యాణరాముడు ॥దే॥

## 494

ఊరేగింపుగా వచ్చేనుగా ఊరంతా కిటకిటలాడేనుగా ||ఊ||

బంగరు పీఠముపై సీతారాములు
ఇరుప్రక్కల లక్ష్మణ శతృఘ్నులు ఛత్రము పట్టి
భరతుడు పాదాలు పట్టి పవనకుమారునితో ||ఊ||

మంగళ వాద్యాలు వాయించండి పూలతో పూజించండి
శుభగానములే పాడండి చెమ్మచెక్కలు ఆడండి ||ఊ||

పూలు ఫలములు తేరండి పంచభక్షాలు తేరండి
టెంకాయ తాంబూలము తేరండి మంగళహారతి పట్టండి ||ఊ||

భజనలు కీర్తనలు పాడండి నర్తన తాండవము చేయండి
సర్వమర్పించి సరోజాక్షులకు సాష్టాంగములే వేయండి ||ఊ||

## 495

అరవిందలోచన అయోధ్యరామా
లాలి పాడేను నీకు లాలి లాలి ||అ||

కమలదళాక్షా కౌసల్య తనయ లాలి
పాడేను నీకు లాలి లాలి ||క||

పద్మ దళాక్షా పావనరామా
లాలి పాడేను నీకు లాలి లాలి ||ప||

జలజాక్ష శ్రీరామ జానకీ వల్లభ
లాలి పాడేను నీకు లాలి లాలి ||జ||

సరోజాక్ష శ్రీరామ సూర్యవంశజ
లాలి పాడేను నీకు లాలి లాలి ||స||

# 496

రాముని చరితము వినరండి శ్రీరాముని చరితము
వినరండి సీతమ్మ చరితము వినరండి ॥రా॥

కౌసల్య దశరథులకు పుట్టెను రాముడు
సౌదామిని జనకులకు పుట్టెను సీతమ్మ ॥రా॥

అయోధ్యలో శ్రీరామచంద్రుడు
మిథిలాపురమున సీతాదేవమ్మ పెరిగిరి ముద్దుముద్దుగా ॥రా॥

విశ్వామిత్రుడు వచ్చె రాముని తోడుకొని పోయె
శ్రీరాముడు తాటకిని చంపె అహల్యా శాపము బాపె ॥రా॥

నందనవనమున సీతమ్మను చూచె శ్రీరాముడు
విశ్వామిత్రుని కను సైగపై పెండ్లాడె సీతను ॥రా॥

కైక వరములకు లోబడి సత్యపాలనకై
అడవి పాలైరి సీతారామ లక్ష్మణులు పన్నెండ్లేండ్లు ॥రా॥

ఋషుల కాపాడిరి భక్తుల పాలించిరి
శూర్పణఖ ముక్కు చెవులు కోసి రావణునికి విరోధులైరి ॥రా॥

ఆంజనేయుని సహాయమున సీతను కనుగొనిరి
రావణుని చంపి సీతను చేకొనె సరోజాక్షుడు ॥రా॥

అయోధ్యాపురము స్వాగతము పలికెను
సీతారాములకు పట్టము కట్టిరి
శ్రీరామచంద్రునకు జయమంగళం
పట్టాభిరామునకు శుభమంగళం అని పాడిరి ॥రా॥

# 497

పట్టపగ్గాలు లేవనుకుంటివా రామా పారిపోదువే ॥ప॥
నీ నామస్మరణతో నిన్ను కట్టివేయనా నా మదిలో గట్టిగ ॥ప॥
రామ రామ రామ రామ రామ రామ శ్రీరామ
అన ఎక్కడికి పోదువు ఎట్లు పోదువు ఎటు పోదువు ॥ప॥
సరోజాక్షా నీ నామము నా మదిలో స్థిరముగ నిలుపవా ॥ప॥

# 498

ప్రభూ శ్రీరామచంద్రప్రభూ నా రామచంద్రప్రభూ
నామొర వినవా శ్రీరామ ॥ప్ర॥
నీపై భక్తి నాలో నిలిపి నన్ను నీలో చేర్చుకోవా ॥ప్ర॥
కరుణామయ కరుణాపయోనిధి కైవల్యమొసగే కౌసల్యతనయ ॥న॥ప్ర॥
సర్వజ్ఞ సరోజాక్షా నా మొరవిని నన్ను నీలో చేర్చుకో స్వామి ॥న॥ప్ర॥

# 499

రామనామము స్మరణలు చేయవే మనసా
స్వర్గానందము పొందవే మనసా ॥రా॥
రామనామమును మించిన నామము లేదని తెలియవే మనసా
స్వర్గానందం పొందవే మనసా ॥రా॥
రామనామమే తారకమంత్రము మనమున నిలుపుము మనసా
స్వర్గానందము పొందవే మనసా ॥రా॥
రామ రామ శ్రీరామా అని స్మరించి తరించవే మనసా
స్వర్గానందం పొందవే మనసా ॥రా॥
సరోజాక్షుడే మన సర్వస్వమని తలవవే మనసా
స్వర్గానందము పొందవే మనసా ॥రా॥

## 500

అడుగు ముందుకు వేయను నే నిన్ను విడువను
గట్టిగ పట్టిన నీ పాదముల విడువను ॥అ॥

విడిచిన నీవు పారిపోదువు నే తాళలేను ॥అ॥

సీతమ్మ పిలిచినా విడువను
ఆంజనేయుడు అడిగినా విడువను
నే పట్టిన పట్టు విడువను ॥అ॥

సర్వము నీ కర్పించిన నన్ను విడిచి ఎటు పోదువు ॥అ॥

సరోజపుష్పాలు తెచ్చాను సరములు సరములు కట్టాను
నీకు మాల వేసే వరకు నే పట్టిన పట్టు విడువను ॥అ॥



| పుట సంఖ్య | పాట సంఖ్య | పాటలో పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 17 | 6 | 11 | పదములె | పదముల |
| 28 | 28 | 5 | నూర్యపుత్ర | సూర్యపుత్ర |
| 39 | 50 | 1 | కనుగొస | కనుగొన |
| 43 | 60 | 3 | సన్ను | నన్ను |
| 57 | 91 | 4 | పరమపద | పరమపదము |
| 83 | 146 | 2 | పూజించరాదా | పూజించరావా |
| 107 | 199 | 4 | పావనమీదును | పావనమౌదును |
| 146 | 282 | 3 | విశ్వామిత్రు | విశ్వామిత్రుడు |
| 157 | 307 | 8 | పజ్రకిరీటము | వజ్రకిరీటము |
| 181 | 362 | 4 | ఉప్పంగ | ఉప్పొంగ |